
వెంకన్న కోట్లు
బొమ్మలకథ: బాపు
8


పరీక్ష పోయినందుకు విచారపడకు - మా వెంకట్రావుగారితో తుమ్మించి నిన్ను పాస్ చేయిస్తాం - ఈలోపు కొద్దిగా చదువు


మా ఫ్రెండొకడున్నాడు - వాడు తుమ్మితే చాలు - ఏపనన్నా అవుతుంది


మా పక్కవాటాలో ఓ గ్రాడ్యుయేట్ వున్నాడు - అతను తుమ్మితే అప్పుడు బయలుదేరినవారికి జయంగలుగుతోంది
వెరీ ఫన్నీ


వెంకట్రావుగారో! దినపత్రికనుంచి విలేఖరి నీతో ఇంటర్వ్యూకి వచ్చారు
నాతోనా?


దినపత్రికలో వెంకట్రావుగారి తుమ్ము మహాత్మ్యం పూర్తి వివరాలతో వేశారు!
పరీక్షలో చదివినవో అన్నీ వచ్చాయ్!
మా అమ్మాయి ఫస్టుక్లాసులో పాసయింది!
నాకు వంద రూపాయల నోటు దొరికింది!
నాకు ఐదులక్షలకి కాంట్రాక్టు వచ్చింది!
(ఇంకా ఉంది)

# ఉత్తరాలు

## ప్రపంచ భద్రతకై 'సుభద్ర'గా శ్రీమతి గాంధీ

సిమ్లాలో భారత—పాకిస్థాన్ అధినాయక సమావేశం, తే 28—6—72ది నుండి శ్రీమతిగాంధీ శ్రీ భుట్టోల మధ్య చర్చలు ప్రారంభమయినవి. దీని ఫలితమేమిటో ఎలా గుంటుందో యని విశ్వమానవాళి ఎదురు చూస్తుంది.

ఆశియా—ఆఫ్రికా దేశాలలో యూరోపియన్ వర్తకవాణిజ్యవేత్తల పెత్తనాన్ని అటకాయించి కమ్యూనిస్టు—కేపిటలిస్టు సైనిక శిబిరాలకు దూరంగా అహింసాపథాన నిర్మింపబడిన— గాంధియన్ భారతీయ వ్యవస్థకు ప్రతినిధిగా శ్రీమతి ఇందిరాగాంధీ సిమ్లా సమావేశములో పాల్గొనుచుండగా, శ్రీ భుట్టో ఎవరికి ప్రతినిధిగా హాజరు యగుచున్నది అంతుచిక్కడములేదు. అందుచేత శ్రీ భుట్టో పాకిస్థాన్ అధ్యక్షుడుగా పాకిస్థాన్ తరపున ప్రతినిధిగా సిమ్లా అధినాయక సమావేశంలో పాల్గొంటున్నప్పటికీ భుట్టో స్థానభ్రష్టత్వంలోనే యున్నాడనవలసి వస్తున్నది. కారణం— అక్కడ సైన్యం భుట్టోను నేరుగా రాజ్యాధికారంలో ప్రతిష్ఠించియున్నది. అందుచేత భుట్టో పాకిస్థాన్‌లో సర్వాధికారి కానేరడు. భారతదేశంలో 1971 మార్చిలో జరిగిన మధ్యంతర ఎన్నికలు శ్రీమతి ఇందిరాగాంధీని ఏకైక నాయకురాలుగ భారతజాతి ఎన్నుకున్నది. భుట్టో పరిస్థితి అదికాదు. సదరు కమ్యూనిస్టు—కేపిటలిస్టు సైనిక శిబిరాల నడుమ ఊగిసలాడుతూ ఎటూ తేల్చుకోలేని కొరగాని ప్రతినిధిగా పాకిస్థాన్ అధ్యక్షుని పేరుతో సిమ్లా సమావేశంలో చర్చలు జరుపుతున్నాడు. తనకు కావలసిందేమిటి? భారత స్వాతంత్ర్య ప్రజాపరిరక్షణము మాత్రముకాదు. భారతీయుల స్వాతంత్ర్యాన్ని విచ్ఛిన్నం చేయజూసేవారు నిర్మించిన మాయదారి పాకిస్థాన్ మాయమైపోతుందేమోనన్న భయం పీక్కుతింటున్నది. బంగ్లా అవతరణతో అది మరీ బలపడిపోయినది. సైనికుల రాజకీయాలలో భుట్టో ఇరుక్కుని పోయాడు. నిజమైన రాజకీయవేత్తగా ఆయన సిమ్లాలో పాల్గొనలేదు. ప్రపంచ కమ్యూనిస్టు—కేపిటలిస్టు—సైనిక విషవలయంలో పాకిస్థాన్ చిక్కుపడి యున్నది. దానినుండి బంగ్లాను, భారత్ విడిపించివేసినా మిగిలిన పాకిస్థాన్‌ను స్వతంత్ర దేశంగా అవతరింపజేయగలదా! యని విశ్వమానవాళి ఎదురు చూస్తున్నాది. వ్యాధి ముదరక ముందే సంస్కృతీపరులు— చరిత్రకారులు—సంఘటిత పడడం అవసరం. లేని యెడల విశ్వశాంతి లేదు.

ప్రాచీన భారతీయ వ్యవస్థాకారుల 'సుభద్ర' శాంతి నాయకత్వంలో సాగిన శైవ—వైష్ణవ—సైనిక శిబిర కురుక్షేత్ర సంగ్రామానంతరం అవతరించిన బవుద్ధం విశ్వమానవ శాంతిని నిర్మించినటుల గానే నేడు కమ్యూనిస్టు—కేపిటలిస్టు— సైనిక శిబిర సంగ్రామ క్షేత్రంలో సుభద్రలా శ్రీమతి ఇందిరాగాంధీ నిర్మిస్తున్న భారతీయ వ్యవస్థ విశ్వశాంతికి ఆటపట్టుగా నిలిచియుండగలదు. కావుననే విశ్వమానవాళి శ్రీమతి ఇందిరాగాంధీని శాంతినాయకురాలిగా దర్శిస్తున్నది. భారతీయ సంస్కృతీపరులు శ్రీమతి ఇందిరాగాంధిని 'సుభద్ర'గా దర్శించగలరు.

మేఘవరం జగ్గారావు, చిన్నారావు (కొమరాడ)

*　*　*

30—6—72 పత్రికలో ఉత్తరాల శీర్షిక క్రింద ప్రచురించిన శ్రీ రాచకొండ శ్రీధర్‌గారి ఉత్తరం చదివాను.

శ్రీ రా. శ్రీధర్‌గారు భూమిలేనివారనుకుంటాను. అందుచేతనే వారు శ్రీ సూరిగారి భావాలను అలా తృణీకరించారు. భూస్వాములకు రైతులకు గల వ్యత్యాసం చాలా బాగా చూపించారు. అయితే ఆ రెంటికీగల సంబంధమును మరచిపోయారనుకుంటాను. వారన్నట్లుగానే తనపొలం దున్ని దానిపై ఆధారపడి వుండే వ్యవసాయమే తన ముఖ్యవృత్తిగా కల్గినవాడు 'ఫార్మర్ లే రైతు' అనబడతాడు. అయితే అంత కష్టపడేందెందుకంటారు— సంపాదనకు. సంపాదన ఎక్కువయితే ఆ 'రైతే' కొన్ని ఎకరాలకు యజమానియై భూమిలేని (పేద) రైతులకు పారితోషికం చెల్లించుచూ పనులు చేయించుకొని ఆ పైన వచ్చిన లాభాన్ని జేబులో పెట్టుకొంటున్నాడు. ఈ విధంగా అటు భూమిలేనివారికి ఉపాధి కల్పించుచూ, ఇటు లాభం పొందుచున్నవాడేనేమో శ్రీధర్ గారి 'భూస్వామి'కి అర్థం.

అంటే పొలంలేని 'రైతు' కూలిచేసుకుని సంపాయించి భూమికి 'యజమాని' యై తరువాత 'భూస్వామి' అవుచున్నాడు. ఇట్లా అయితే రైతుకూ భూస్వామికీ తేడా ఏమిటి? అస్తిలోనా? (అంత అసూయమనకెందుకు?) వాడు కష్టపడి సంపాదించాడు, అనుభవించుతాడు. ఈ అనుభవించే భూస్వామి వద్దనుండి కొంచెం (ఎక్కువగానే) భూమి మనం (చట్టం) తీసుకుందామా? అయితే ఒకటి ఆలోచిద్దాం.

ఇక్కడ రైతుకూ, ఉద్యోగస్థునకూ ఒక పోలిక కనపడుతోంది. ఈ ఉద్యోగస్థుడు మొదట టెంపరరీగానే చేరి, యల్.డి.సీ., యు.డి.సీ., యై చివరికి ఆఫీసర్ అవుతున్నాడు. ఆఫీసర్ అయిన తరువాత (భూస్వామిని రైతుగా చేయమన్నట్లే) తిరిగి యల్. డి. సీ.,గా పని చేయుమని ఎందుకు అడుగగూడదు? (జాబ్ సీలింగ్!) దేశంలో అంతమంది నిరుద్యోగులతో బాధపడుతున్న తరుణంలో యీ ఆఫీసర్‌ను తొలగించి బదులుగా అదే జీతంతో నలుగురు 'యల్డీసీ' లను చేర్చుకుంటే నలుగురుకు ఉపాధి కల్గుతుంది గదా. ఇట్లా చేస్తే ఆఫీసరుకు అధికార పరిధి తగ్గి అధికారం దుర్వినియోగం కాదుకదా. (లంచాల రేటు కూడా తగ్గుతుంది). దీన్నిబట్టి చూస్తే భూపరిమితి చట్టం దేశానికి హానికరం, ఉద్యోగపరిమితి చట్టం లాభదాయకం అని పిస్తోంది.

రావుచౌదరి, (మద్రాసు)

*　*　*

30—6—72 పత్రికలో ప్రచురించిన రాచకొండ శ్రీధర్ (హైదరాబాద్) గారి ఉత్తరం చూసినాక నాకు ఈ ఉత్తరం వ్రాయాలని ఆలోచన వచ్చినది.

'భూకమతాల — పరిమితిచట్టం' గురించి — 2—6—72 సంచికలో మల్లాది సూరిబాబుగారు వ్రాసిన వ్యాసం శ్రీధర్‌గారు సరిగ్గా అర్థం చేసుకోలేదని తలుస్తాను.

శ్రీధర్‌గారి దృష్టిలో రాష్ట్రంలోని రైతులందరు భూస్వాములగానే కనపడుతున్నారనుకొంటాను. మీరు చెప్పినట్లు 100, 200లు ఎకరముల పొలము వున్నవారు రాష్ట్రంలో ఎంతమంది వున్నారు? ఈ చట్టం వలన కేవలం మధ్య తరగతి వారే అనగా 40 ఎకరాలలోపు భూవసతి కలవారు ఆర్థికంగా చాలా


త్వరలో ప్రారంభం!
అనామధేయుని ఆత్మకథ
శ్రీరియుసేత్ హాస్యరచన
'ఆర్వీయం'



# తల నొప్పా?
# అనాసిన్

## నొప్పి నివారణకు మేలైనది. ఎందువలనంటే అది బలీయమైనది మరియు సురక్షితమైనది.



ఒలింపియన్ ఫుట్ బాల్ ఆటగాడు నెవిల్ డిసౌజా అనాసిన్ వాడకందారు. 'నేను ఎల్లప్పుడూ అనాసిన్ దగ్గర ఉంచుకుంటాను'. అని అతను అంటాడు.

*బలీయమైనది* ఎందువలనంటే ప్రపంచమంతటా ఎక్కువ మంది డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థాలు అనాసిన్ ఎక్కువగా కలిగియున్నది. అందువలననే అనాసిన్ బాధనుంచి సత్వర నివారణ కలిగిస్తుంది.

*సురక్షితమైనది.* ఎందువలనంటే అనాసిన్ డాక్టరు ఇచ్చే మందుల మిశ్రమం వంటిది. మీరు దానిని సురక్షితంగా పిల్లలకు గూడా ఇవ్వవచ్చును. అన్ని మందుల విషయంలో వలె, మీ పిల్లలకు దీని సరియైన మోతాదు కోసం మీ డాక్టరును సంప్రదించండి.

జలుబు మరియు ఫ్లూ వలన కలుగు నొప్పులకు. తలనొప్పి.
నడుం నొప్పి, కండరాల నొప్పులకు మరియు పంటి నొప్పికి బాగా పనిచేస్తుంది.

**అనాసిన్**

భారతదేశపు ఎక్కువ జనప్రియమైన నొప్పి నివారిణి




Regd. User of T.M.: Geoffrey Manners & Co. Ltd.

క్షీణదశలకు గురి అగుచున్నారు. ఇటువంటి మధ్య తరగతి రైతుకు వ్యవసాయము ఎంతవరకు గిట్టుబాటుగా వుందో, ఎంత మిగులుతుందో హైదరాబాద్‌లో వున్నవారికి తెలియకపోవచ్చు. స్వర్గీయ సంజీవయ్య తల్లిగారికి 1000 రూ॥లు వుదారంగా ఇవ్వటానికి అంగీకరించిన ప్రభుత్వం, దేశమునకు వెన్నెముక వంటి రైతు విషయంలో పక్షపాత వైఖరి అవలంభించటం విచారకరం.

వేలకువేలు జీతాలు తీసుకొంటూ, ఇతరదేశపు కార్లు తప్ప ఇండియా కార్లను వాడటం తమగౌరవానికి భంగం అని తలుస్తూ, ఎయిర్‌కండిషన్డ్ రూమ్‌లలో తప్ప నివసించటం అలవాటులేని మంత్రులపై ముందుగా సీలింగ్ పెట్టాలని శ్రీధర్‌గారి లాంటి వారు ఎందుకు అనుకోరు.

ఏదైనా సంస్కరణ పెట్టాలంటే ముందు ఇటువంటి దుబారాలపై పెట్టాలి—అప్పుడుగాని ప్రజలు హర్షించరు, శ్రీధర్‌గారు కోరుకొనే సర్వమానవ సమానత్వం అప్పుడుగాని రాదు.

—మాదినేని పురుషోత్తం, (పేరకలపూడి)

**క థ లు**

30—6—72 సంచికలో యర్రంశెట్టి శాయిగారు తమ కథ 'రిట్రెంచ్‌మెంట్'లో జయ తన భర్త, రాజా కొరకు నిరీక్షిస్తూ, సిరితో మాట్లాడి డ్రాయింగ్ రూంలోకి వెళ్ళినదని, అప్పుడు సమయం ఆరవుతుందని, ఆలోచిస్తూ రేడియో ఆన్ చేసిందని రేడియోలో పదేళ్ళక్రితం రిలీజయిన తెలుగు సినిమా పాటలు వచ్చినాయని వ్రాసినారు. కాని నాకు తెలిసినంతవరకు సాయంత్రం ఆరు గంటల ప్రాంతాల్లో ఏ స్టేషను నుండి కూడ తెలుగు పాటలు రావు. మరి శాయిగారు దయచేసి వారు తమ కథలో వ్రాసినట్లు సాయంత్రం ఆరు గంటల ప్రాంతాల్లో ప్రపంచములోని ఏ స్టేషను నుండి తెలుగు పాటలు — ముఖ్యంగా పాతవి (అవి నాకు చాల ఇష్టం) వస్తాయో వివరిస్తే— ఆనందిస్తా!

యస్. డి. యిసాహాక్ మదని, (ఆకివీడు)

* * *

'క్వారిటే'ంవేతల కమ్మంకు కట్టేపటులు అవుతుండెను. చదువునప్పుడు రచయిత కొన్ని ఇంగ్లీషు

## ఉత్తరాలు

అక్షరాలు కలిపి సునాయాసంగా అర్థం అయ్యేట్లు వ్రాసినందుకు వారికి నా ధన్యవాదాలు.

—బి. లక్ష్మీపతి. (కామారెడ్డి)

* * *

శ్రీమతి ప్రభావతి నారాయణరావుగారు వ్రాసిన 'ఆషాఢం' చాలా బాగా వుంది. కొత్త దంపతులకు ఒక విధంగా మార్గం చూపించారేమో!

—వనం రంగారావు, (ఖమ్మం)

**సీ రి య ల్**

రాగధార సీరియల్ 7—7—72 సంచికలో మధుని ఆతని ఒదినగారు గుండెలకు అదుముకున్నట్లు, ఆమె అతని ఒడిలో తలపెట్టుకొని ఏడ్చినట్లు, ఆమెచేతిని అతను స్పృశించినట్లు వ్రాశారు. ఎంత మాతృప్రేమతో చూచినా అతను ఆసెకు మరది. అంతేకాక అతను ఎమ్. ఏ. చదివిన విద్యార్థి. ఆ వయస్సులో వదినగారితో అంత చనువుగా వుండడం సమంజసంగా లేదని నాభావన. చెప్పుడు మాటలు విన్న అన్నగారు చెడుగా వూహించుకున్నట్లు విమలా రామంగారు వ్రాశారు. ఆటువంటి సంఘటనలు కంటపడిన తర్వాత ఎటువంటి వ్యక్తి అయినా చెడుగా భావించుకుంటాడు.

—కె. వి. శ్రీరామమూర్తి, (విశాఖ)

**సి ని మా**

పింతోసేపు వూటి, మైసూరులలో షూటింగు జరిపి బోరుకొట్టిస్తున్న సమయంలో రాజస్థాన్ ఎడారి వంటి కొత్త ప్రదేశంలో చిత్రీకరణ నెరపి, మనకు వెరైటీ చూపించిన కృష్ణ నిజంగా తెలుగు చలనచిత్ర పరిశ్రమకు వెన్నెముకలాంటి వాడు, సందేహం లేదు.

—వి. రాంబాబు, (హైదరాబాదు)


పై వారమే ప్రారంభం!
శోభావాణి
శీర్షికకింద
పాఠకుల ప్రశ్నలకి
శోభన్‌బాబు జవాబులు!



# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938 - 1972)

శుక్రవారం: 21-7-72
శ్రీవిరోధికృన్నామ సం॥ ఆషాఢ మాస॥ కృష్ణ దశమి
**సంపుటము: 60 సంచిక: 48**

స్థాపితము:
1908
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు - 1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక


మనిద్దరంకలసి మన
సమస్యలను
పరిష్కరించుకుందాము
ఏమీ బాగాలేదు!
పాకిస్తాన్
ఇండియా
బయటివారి ఆసక్తి


వంతెన
కాన్సుల్ దౌత్యం
అమెరికా
ఇండియా


భారత్-పాక్
సంబంధాలలో
కొత్త అధ్యాయం


అప్పుడు
ఉత్తర వియత్నాం
దక్షిణ వియత్నాం


ఇప్పుడు
దక్షిణ వియత్నాం
ఉత్తర వియత్నాం

# బేనజీర్

ఒక హిందీనటిమీద మోజుతో ఒకప్పుడు శ్రీ జుల్ఫికార్ అలీ భుట్టో బొంబాయి సినిమా స్టూడియోల చుట్టూ తిరిగేవాడని అంటారు; తను కూడా సినిమాలలో చేరుదామని ఆయన అనుకున్నాడని కూడా అంటారు. ఆయన కోరిక ఫలించి తెరమీదకి ఎక్కిఉంటే నేటి హిందీ సినిమాలలో ఆయన ఎంతదాకా రాణించి ఉండేవాడో చెప్పటం కష్టం. కాని, భుట్టో మంచి నటనాకౌశల్యం కలవాడనటంలో అతిశయోక్తి లేదు. కొంతకాలం క్రితం ఐక్యరాజ్యసమితిలో ఆయన చేసిన అభినయ ప్రదర్శనం మరపురానిది. అదే విధంగా తమ దేశపు రేడియో మీద శ్రీ భుట్టో విన్యాస కల్పనలు చేశారు. అవన్నీ ఆ సందర్భంలో భారతీయులకి ఎంత మనోరంజకంగా ఉండలేదు. నేటి పరిస్థితులని బట్టి ఆలోచించిచూస్తే కొంత నవ్వురావచ్చు!



సిమ్లాలోని సెంట్రల్ కాటేజ్ ఎంపోరియం దర్శించటానికి వచ్చిన కుమారి బేనజీర్ భుట్టోని చూడటానికి వచ్చిన జనసమూహం

సిమ్లాలో జరిగిన సమావేశానికి శ్రీ భుట్టో ఒక అధినాయకుడిగా వచ్చారు. 1971 యుద్ధం తర్వాత ఆయన ధోరణిలో కొంతమార్పు వస్తూనే ఉండివచ్చిందని ఎందరో అనుకున్నారు, ఆయనకూడా మొత్తంమీద తమ కొత్త హోదాకి తగినట్లే ప్రకటనలు చేస్తూ వచ్చారు ఇటీవలే ముగిసిన భారత్–పాకిస్తాన్ అధినాయకుల ఒప్పందం ఈ రెండు దేశాలమధ్యా శాంతియుతమయిన సంబంధ బాంధవ్యాలు ఏర్పడవచ్చుననే ఆశకి ఎంతో బలాన్ని ఇచ్చాయి. ఈ వాతావరణం శ్రీ భుట్టో పేరు ప్రతిష్ఠలని పెంపొందించాయనటానికి సందేహంలేదు.

అయితే, అధినాయక సమావేశాలు జరిగిన సిమ్లాలో పాకిస్తాన్ ప్రదర్శించగలిగిన ప్రధానమయిన ఆకర్షణ జుల్ఫికార్ అలీ భుట్టో కాదు — ఆయన కుమార్తె 18 ఏళ్ల బేనజీర్ భుట్టో! ఈ అమ్మాయికి ఏమి ఇష్టం, ఆమె సిమ్లాలో ఏమి చేసింది, ఏ అంగళ్లలోకి వెళ్లింది— ఇటువంటి వార్తలు ప్రముఖంగా ప్రచురించాయి భారత వార్తాపత్రికలు. బేనజీర్ భుట్టో గురించి ఇప్పటికి ఎందరో భారతీయులకి చాలా తెలిసిఉంటుంది. ఒకప్పుడు ఇటువంటి చిన్న విషయాలే రాజకీయాలలో పెద్ద పాత్ర వహించవచ్చు, కాని, భారత పాకిస్తాన్‌లమధ్య వైరానికి ఎంతో లోతయిన, పాతకారణాలు చాలా ఉన్నాయి. అవి అంత తేలికగా పరిష్కారం అయ్యేవికావు. అయ్యేదాకా స్నేహభావాలని పెంపొందించే ఎంత చిన్న విశేషాన్నయినా చులకన చెయ్యరాదు!

—(ఓ. వి)



సిమ్లాలోని బొమ్మల ప్రదర్శనశాలని దర్శిస్తున్న కుమారి బేనజీర్ భుట్టో

# "నేను ఎలా బతికి బయటపడ్డాను"

## —— జూలియాన్ కొప్కె ——

### 3

అపడానికదో పడవే అయినా, పాత పడవేమోనని, సర్వనాశనమైనందువల్ల ఎవరో ఉన్నక్కడ వదిలేసి పోయారేమో ననుకున్నాను. తీరా చూసేసరికది గట్టిదే గాక, చాలా కొత్త పడవ!

నదొడ్డున కట్టేసుంది.

ఆ పడవ కట్టేసున్న చోటు నుంచో సన్నని కాలి దారి కనబడింది. ఆ దారి వెంట కొన్ని దూరం వెళ్ళి చూస్తే ఓ చిన్నపాక కనుపించింది. ఈతాకులతో వేసిన పాకది. తిన్నగా ఆ పాకలోకి వెళ్ళాను. లోపల ఓ ప్లాస్టిక్ గుడ్డ కింద ఓ మోటారు ఇంజను వుంది. పక్కనే ఓ పెట్రోలు డబ్బా వుంది.

కనుక ఇక్కడ మనుష్యులు వుండుం డుండాలి.

కానీ ఎప్పుడు.

పాకలో నేలంతా బల్లలు పరచి వుంది. చీకటి పడ్డం వల్ల నేనక్కడే పడుకున్నాను. చాలా రాత్రుల తరువాత ఆ రాత్రి నాకు ఓ ఆచ్ఛాదనం క్రింద నిద్రపోయే అదృష్టం పట్టింది.

కాని, నిద్ర పడితేగా!

దోమలు దున్నేయ సాగాయి.

ఏవైనా గొంతులు, మాటలు వినిపిస్తాయేమోనని, రాత్రంతా చెవులు రిక్కించుకునే పడుకున్నాను. నా వెర్రిగాని అర్ధ రాత్రి కారడవుల్లో ఎవరు విహరిస్తారు!

అంతలో ఏదో లైటు కనుపించినట్టయి, లేచి చూచాను. అది మిణుగురు పురుగుల సమూహం! పాకలో నిద్రపట్టక, నేలమీద అటూ యిటూ దొర్లాను. చివరికి లాభం లేక, నది ఒడ్డున ఆ ప్లాస్టిక్ గుడ్డ కప్పుకుని పడుకున్నాను. ఒంటిమీద చిన్న చిన్న పురుగులు పుట్టాయికదా! అవి విపరీతమైన బాధ పెట్టనారంభించాయి. అయినా, శరీరం అలసి పోయుంది గనుక విధిగా నిద్ర పట్టేసింది.

[illegible]

ఇహ ప్రయాణం మళ్ళీ సాగించవచ్చును కున్నాను.

అసలు పడవ కోసం ఎవరో ఒకరు వచ్చి తీరాల్సిందే కదా: కానీ, వాళ్ళెవాళ్ళే వస్తారని నమ్మక మేమిటి? ఓ వారం తరువాత రావచ్చు. పదిహేను రోజుల తరువాతనైనా రావచ్చు. అసలు రాకనే పోవచ్చు. అడవికి అర్పణమై పోయుండచ్చు కదా!

ఏదో సాధించాలని అడవులకు బయలుదేరిన వారిలో చాలామంది పత్తా కూడా లేకుండా అదృశ్యం కంకితమై పోతూంటారు. అలాగని ఆ పడవ తీసుకు



[illegible] దోమలు, ఈగలు [illegible]

# నేను ఎలా బతికి...

పోడానికి నాకు మనస్కరించలేదు. పాపం వాళ్లెవరో, ఏమిటో! నా దారి నాకుండనే వుంది కదా! గత కొన్ని రోజులుగా కురిసిన పాడు వానవల్ల ప్రవాహ వేగం ఎక్కువయింది. ఆ వానల ధర్మమా అని నా వొంటిమీది పురుగులు కొన్ని కొట్టుకు పోయాయి. శరీరం విషమెక్కి నే చావకుండా వుండడానికా వానలే కారణమేమోనని నాకిప్పుడనిపిస్తుంది.

ఆ పాకలో వో గొట్టంలో నాజలీను కనబడింది. ఆశగా అది తీసి, వొళ్లంతా పులుముకున్నాను. దానివల్ల వంటిమీది పురుగుల గుడ్లు చస్తాయేమోనని ఆశ పడ్డాను. కానీ అవంత తేలిగ్గా వదలవు. ఈతాకులు పీకి, వో బెత్తాన్ని తయారుచేసి దానితో వో పాతిక గుడ్లను పీకాను. కొన్నిటిని వళ్లతో పీకేశాను—ఏం చేస్తాం మరి!

ఈలోగా ఏవో గొంతులు వినిపించాయి. ఆ గొంతులు అడవిలోంచి వస్తున్నాయి. పాకనుంచి ఆ వైపు అడవిలోకి కూడా వో కాలిబాట వుంది. కానీ నా కటు వెళ్ళ బుద్ధికాలేదు. నీటిని వొదిలి, మళ్ళీ అడవి లోకి వెళ్ళానంటే యిక బ్రతకలేనని భయంవేసింది.

చివరో వస్తున్న చప్పుడయింది.

కాలికే రక్షలూ లేకుండ, పొట్టి లాగులు తొడుక్కుని వో ముగ్గురు పాకకేసి వస్తున్నారు. వారు స్పానిష్ మాట్లాడుకుంటున్నారు.

వాళ్ళు నన్ను చూశారు.

'అయ్యో!అంతా అయ్యోపోయిందమ్మాయ్' అని మా అమ్మ అరచిన రోజునుంచి పదిన్నర రోజులు గడిచాయని నాకు అనక తెలిసింది. అనగా మా విమానం కాలి, ధ్వంసమై కూలి పదిన్నర రోజులయ్యిందన్న మాట.

'ఐ! ఏమ్టిది!' అంటూ వో మనిషి ఆశ్చర్యంతో అరచి, 'అక్కడ కూర్చున్నదెవరు' అన్నాడు గట్టిగా—నాకేసి చూస్తూ.

విమానం కూలి పదిన్నర రోజులయ్యింది. ఇన్నాళ్లూ ఏకాకిగా అడవులు పట్టుకుని తిరిగిన నేనిక ఏకాకినికాను.

ఆ ముగ్గురూ చక చకా పాకవైపొస్తున్నారు.

నేను రెండువిధాల అదృష్టవంతురాలిని.

నది వొడ్డున నడవకపోతే నేనసలా పాకను చూచుండేదాన్నే కాదు. ముందసలు నీళ్ళ లోనే యీదుకుంటూ పోదామనుకున్నాను. వొడ్డునున్న పొదలూ, చెట్లూ, చేమలూ చూస్తే నడవడానికే మొదట భయమేసింది.

ఆ ముగ్గురు మనుష్యులూ రెండు మూడు వారాలకోరోజే ఆ పాకకు వచ్చి పడుకుంటారట. నే గనుక ఒక్కరోజు ఆలస్యంగా వొచ్చుంటే వాళ్ళు ఆ పాకకు వచ్చి, వెళ్ళిపోయుండేవారన్నమాట.

అలా గనుక జరిగివుంటే నే నసలు ఏ మనిషికీ కనపించకుండానే నశించిపోయి వుండేదాన్నేమోనని నాకిప్పు డనిపిస్తుంది. నది వొడ్డున యీ పాక తప్ప యిహ కొన్ని మైళ్ళ దూరంవరకూ ఏమీలేదని, నర సంచారం అసలే వుండదని, యిహపైన నది వొడ్డున నడవడం చాలా కష్టమనీ, దుబ్బులూ, పొదలూ, చెట్లూ, చేమలూ చాలా భయంకరంగా వుంటాయని వాళ్ళు చెప్పారు. వీళ్లే గనుక కనపించక పోయి వుంటే—జనం కనుపించే వరకు నడిచే వోపిక నాకుండేదా! నేను చాలా అదృష్టవంతురాలిని.

సందేహమే లేదు.

వారు మెస్టిజోస్ సంతతి వారట. అంటె ఇండియోస్‌తో రక్త సంబంధం వున్నవారు. వేటకు అడవికి వచ్చినట్లూ ఏ పాడూ దొరకనట్లూ చెప్పారు. ఇల్లూ వాకిలీ లేకుండా, వో చోటంటూ లేకుండా అడవుల వెంట తిరుగుతూ పోతారు వీళ్ళు. చెట్లునరికి నదిలో పారేసి, పుకల్సి తోసుకుంటూ పోతారు. మరోచోట కూడా తమ పనికోసం వో పాక వేసుకున్నట్లు వారు చెప్పారు.

తాము వస్తూ వస్తూ మొదట నన్ను చూసినపుడు పెద్దగా పట్టించుకోలేదని, తమలో ఒకతను 'ఐః అక్కడ కూర్చున్నదెవరు' అని అరిచాక సరిగా చూశామనీ చెప్పారు.

జరిగిన విపత్తంతా వారికి వివరించాను. కానీ వాళ్ళల్లో ఒకాతను మాత్రం నా కథను సుతరాం నమ్మనన్నాడు. విమాన ప్రమాదంలో అందరూ చచ్చాకా! అప్పరాల్ వో పదిహేడేళ్ళ ఆడపిల్ల బతుకుటేమి! పదిన్నర రోజులు తిండి తిప్పలూ లేకుండా భయంకర కీకారణ్యంలో నడచివచ్చుటేమి! నే నమ్మనన్నాడు. ఆమాట కొస్తే ఆడపిల్లే కాదు, కొమ్ములు తిరిగిన మగవాడైనా రాలేడని, తానిలాంటివి నమ్మ కూర్చోలేదని కలవిచ్చాడు.

'అది సరిః కానీ మీ ఎదురుగా నేను, బతికి ప్రాణాలతోనే వున్నాను కదా? కన బడ్డంలేదూ' అనడిగాను నేను.

వాళ్లు ఫక్కుమన్నారు. నేనూ అన్నాను.

శల్య పరీక్ష చేస్తున్నట్లు ముగ్గురూ నాకేసి చూశారో కాస్సేపు. అనక వాళ్ళు దగ్గరున్న పెట్రోలు కొంత నామీదపోసి, సుమారో 30 పురుగుల గుడ్లను పీకి పారేశారు.



మనుష్యుల ప్రాణాల్ని తీసే ఒకరకం పక్షి, ఇదంటె జూలియానాకి అగని భయం.

బాగా వాచి బాధపెడుతున్న నా కుడిచేతి కేసి చూసుకుంటే ఆ చెయి తీసేయవలసి వస్తుందేమో చివరికనిపించింది. భయంతో శరీరం చల్లారి పోయింది.

వాళ్ళుముగ్గురు శ్రమపడి, నా వేళ్ళు వుప్పునీళ్ళతో కడిగి, శరీరంలోకి విషం ఎక్కకుండా, పాకకుండా ఏవో కొన్ని మందులు రాశారు. తినడానికి ఏదో పెట్టారు. ఆనక పడుకోడానికి దోమ తెరవంటిది కూడా యిచ్చారు.

పదిన్నర రోజుల తరువాత నిజంగా నేనా నాడే సరిగ్గా తిండి తిన్నాను. అడివిలో దొరికిన పళ్ళతో అవేవో తయారుచేసి పెట్టారు. వున్నదంతా నే తినేసి, నన్ను కాపాడినవారిని ఆకలితో కూర్చోపెట్టడం న్యాయమనిపించలేదు. పైగా నాకు పెద్దగా ఆకలి కూడా వేయలేదు.

బాగా రాత్రయ్యాక వో కంబళి వంటి దానిమీద పడుకుని. నిద్రకుపక్రమించాను.

'ఈ రాత్రి ఎంచక్కా నిద్ర పో పిల్లా: గుడ్‌నైట్' అని ఒకతను నవ్వుచెప్పాడు. కానీ ఆ రాత్రి నాకు నిద్రపట్టనే లేదు. బల్లలు పరచిన ఆ నేలమీద పడుకునేసరికి నడుం నలుపు ప్రారంభమయ్యింది. కుడి పక్కకు తిరిగి పడుకుందామంటే కుడి చెయ్యి అనలే వొప్పలేదు.

వాళ్ళూ పడుకోలేదు. దాంతో యిక బాతాఖానీలో పడ్డాము. నేను మళ్లీ విమాన విపత్తంతా ఏకరువు పెట్టాను. 'హారె! ఆ విపత్తులో ఎవరైనా బ్రతికున్నారేమో అని చూసిన విమానాల్లో వో విమానంలో నేనూ వున్నానే' అని వొకతను ఆశ్చర్య పోయాడు.

'ఇంకెవరూ బ్రతికారనుకో'నన్నాడతను.

నాకు తెలీకుండానే నిద్ర పట్టేసింది. తెల్లారి లేచేసరికి వాళ్ళప్పుడే పడవ సిద్ధం చేస్తున్నారు. మోటారును పడవకు అమర్చారు.

'ఈ నదిపేరు షీబోన్యా. ఈ నది ఉకేలి నదిలో కలుస్తుంది. ఉకేలి వెళ్ళి అమెజాన్‌లో కలుస్తుంది' అని ఒకతను వివరించాడు.

మోటారు పడవలో మూడు రోజులు ప్రయాణం చేస్తేగాని పుకల్పా చేరమని చెప్పారు. కానీ, యింకా మూడురోజులు నేను బతికి వుండగలనా అనే అనుమానం నాకేగాక వారికి కూడా వున్నట్టుంది.

(ఇంకా ఉంది)


# సమ్మోహనమైన చిరునవ్వు

మెరిసే పళ్ళ నుంచి
ఒలికే చిరునవ్వు
స్నేహితుల్ని జయించగలదు.

దాని ప్రఖ్యాతిగల బోటని ప్రేలి
గ్రిప్‌గల హేండిల్, ఏంఖర్
గిప్ మరియు బష్ హెడ్ దంతత.
యాన్ని అరికట్టుట కోసం
ప్రత్యేకంగా, రూపొందించబడినవి –

**ఆర్యన్**
టూత్ బ్రష్
ఎప్పుడూ వాడితే, మీరు మీ
దంతాలను పరిశుభ్రంగా,
మెరుస్తూ ఉంచుకోగలరు.




నున్నగా, పరిశుభ్రమైన షేవ్ కోసం

**ఆర్యన్** షేవింగ్ బ్రష్

పట్టు తప్పని గ్రిప్ హేండిల్‌తో,
వెల్వెట్ తయారీ నైలాన్ బ్రిజిల్స్
శాకిడికి పుష్కలమైన నురుగు
పొందండి, నున్నగా, పూర్తిగా,
షేవ్‌లు అనుభవించండి.

వివిధ
రకాలలో
దొరకును.





ఓం తత్ సత్!



## సుఖ జీవిత సేవ
"సిద్ధ వైద్య మహిమ"
సిద్ధుల పోటిలేని కీర్తికి ఒక తార్కాణము
కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి గారి

# 'మేల్ మాయిల్ మందు'
(Regd)

**దీర్ఘకాల చర్మరోగములకు చక్కని నివారిణి**

నల్లరంగు, ఎర్రరంగు పొడలు, దద్దులు, పొట్లు, గజ్జి (చర్మ సంబంధము) పొడలు గల చోట్లలో తిమురు, నాదితో పొడిచినప్పుడు నొప్పి లేకుండుట, నిప్పువడి బొబ్బలు గలిగినా తెలియకుండుట, మరు నీరు సర్వ అవయవములందు వ్యాపించి, రక్తములో కలిసి మత్తు కలుగజేయుట, (నరముల సంబంధము) చేతి వేళ్లు ముడుచుకొనుట, బొబ్బలు లేచుట, ముక్కు బంధనముల్లు, పాదము నందు నల్లపు పుండ్లు ఏర్పడుట, కాలుచేతులు వేళ్ళు తగ్గుట, ముక్కు పొట్టవటుట. ఎగాచుటకు నిసుగు పుట్టించు రణముల (అన్ని సంబంధము) నీటికి చక్కని నివారిణి.

1 మండలం (40 రోజులు) నూనె, లేహ్యము రు. 12/- తపాల ఖర్చులు రు. 3-00
8 ఔన్సుల శ్రీ పరమాత్మ తైలం రు. 6/- తపాల ఖర్చు రు. 2/-

సిద్ధాక్టర్

## కే. టి. కృష్ణమూర్తి ఆచ్చారి & సన్సు
5/22, మేల్ మాయిల్ P.O., (N.A. Dt.)

# థేంక్స్ టుది ఇంగ్లీష్‌మని




సత్యం మందపాటి

'ఇదే మా ఆడిటోరియం' అన్నాడు జయరాం తమ ఆఫీసు కల్చరల్ అసోసియేషన్ వాళ్ళ ఆడిటోరియం—తన కొత్త పెళ్ళాం ఇందిరకు చూపిస్తూ.

'సింపుల్‌గా వున్నా బాగుంది' అన్నది ఇందిర—పరికించి చూస్తూ.

జయరాం దారి చూపిస్తూ ముందుకు నడిచాడు.

'నమస్కారం సార్—రండి!' ఎవరో ఆహ్వానించారు జయరాంని.

జయరాం నమస్కారం అందుకుంటూ ఠీవిగా లోపలకు నడిచాడు — ఇందిరతో పాటు.

'ఈ చుట్టుపక్కల వున్న గవర్నమెంటు ఆఫీసులలోని వాళ్ళంతా కలసి స్థాపించారు ఈ కల్చరల్ అసోసియేషన్. నెలకోసారి ఏ మ్యూజిక్ ప్రోగ్రామో, డాన్సు ప్రోగ్రామో వుంటుంది. వూళ్ళో వున్న బిగ్ షాట్స్‌ని కూడా పిలుస్తుంటాం' మల్లెపూలతో ఘుమ ఘుమలాడుతున్న ఇందిర జడను చేత్తో ప్రక్కకు నెట్టి చెవిలో అన్నాడు జయరాం —ఎదురుగా వస్తున్న జిల్లా కలక్టర్‌ని చూపించి.

ఇందిర తల వంకించింది — తల్లోని మల్లెమొగ్గలోమారు సర్దుకొని.

'సుభద్రా వెంకటరామన్' పాట కచేరీ యింతకుముందోమారు విన్నాను—త్యాగరాజ కీర్తనలు చాల బాగా పాడుతుంది' అన్నది ఇందిర. మనసులో ఆ ప్రోగ్రాంకి పిలుచుకు వచ్చిన జయరాంని మెచ్చుకుంటూ.

ఇంకా తెర లేవలేదు. జనం మెల్ల మెల్లగా వస్తున్నారు.

వాతావరణం చాలా ఆహ్లాదకరంగా వుంది. రకరకాల వ్యక్తులు రకరకాల దుస్తులతో మంచి శోభనిస్తున్నారు కార్యక్రమానికి.

ముందువరుసలో కూర్చునివున్న సన్నగా, పొడుగ్గా, ఎర్రగా వున్న వ్యక్తి ఒకతను చటుక్కున తన కుర్చీలోనించి లేచి ముందుకు నడచి ఒక పొడుగాటి ఆసామీని లోపలకు ఆహ్వానిస్తున్నాడు. ఆయన వెనకనే వస్తున్న ఆయన భార్యకి, నమస్కారం చేశాడు. అంతేకాదు, ప్రక్కనే వున్న ఆయన పిల్లవాడికి జేబులోనించి ఓ చాకలెట్ తీసి అందించాడు. ఆయనవాగ్రతం చాల గంభీరంగా వచ్చి ముందుసీట్లో పేముకుర్చీలో కూర్చున్నాడు.

'ఆ నన్నగా, పొడుగ్గా, ఎర్రగా వున్న తను ఫలానా ఆఫీసులో ఫలానా వుద్యోగం చేస్తున్నాడు. ఇప్పుడతను లోపలకు పిలిచినది వాళ్ళ మేనేజర్ ని. ఆవిడ ఆయన భార్య—చూశావా ఎంత కాకా పట్టేస్తున్నాడో!' అన్నాడు జయరాం.

'ఛ—మర్యాదకోసం లోపలకు ఆహ్వానిస్తే తప్పేముందండీ.' అన్నది ఇందిర మెల్లగా.

జయరాం నవ్వాడు. 'మర్యాదా—ఈ ఆఫీసుల్లో వాళ్ళకి మర్యాద తీసుకోవటం తెలిస్తే కదా మేం యివ్వటం. అదంతా కాకాలూకీయం డార్లింగ్—చూస్తుండు నీకే తెలుస్తుంది!' అన్నాడు.

ఇందిర వింతగా చూసింది.

మేనేజర్ కుర్చీలో కూర్చో బోయేటప్పుడు, ఆయన హాండ్ కర్చీఫ్ క్రింద పడి పోయింది. అది ఆయన గమనించలేదో గమనించీ ఎందుకని ఆగాడో తెలుసుకోవటం కష్టం. అది ఆ ఫలానా ఉద్యోగి చూసి గబగబా వెళ్ళి కర్చీఫ్ తీసి దాన్ని తన కర్చీఫ్ తో శుభ్రంగా తుడిచి, ఆయన అతి వినయంతో అందించి, ఒకడుగు వెనక్కి వేశాడు.

ఆయన, అతన్ని ఈగని చూసినట్టు చూసి చటుక్కున కర్చీఫ్ లాక్కుని తన భార్యవేపు గంభీరంగా చూశాడు. ఆయన భార్య యింకా గంభీరంగా చూస్తున్నది— ముందు కుర్చీలో కూర్చున్న ఆయన బట్ట తల ఎందుకు అంత నిగనిగా మెరుస్తున్నదా అని.

అతను ఒక నిముషం అక్కడ నుంచుని ఏదో మాట్లాడబోయి ఆగి...వెనక్కి వెళ్ళి ఎక్కడో దూరంగా—మేనేజర్ చూపులకు అందనంత దూరంగా వెళ్ళి సిగరెట్ వెలిగించాడు.

'యిప్పుడేమంటావ్ !' అన్నాడు జయరాం గర్వంగా.

మూతి ముడిచి ముచ్చటగా నవ్వింది ఇందిర — మెట్టు ప్రక్కల్ని నురగనిపోయి, జయరాం కళ్ళలోకి సూటిగా చూస్తూ.

జయరాం ఆమె నెత్తిమీద చేయి వేశాడు.

ఎదురుగా వస్తున్న ఒకాయన్ని చూపిస్తూ అన్నాడు జయరాం — 'ఆయన ఫలానా ఆఫీసర్. ఆయన ఏం చేస్తాడో తెలుసా. సరిగ్గా అయిదు నిముషాల తక్కువ అయిదింటికి ఆఫీసుకి వస్తాడు రోజూ — బయల్దేరదామని ఫైళ్ళు సర్దబోతున్న వాళ్ళందరూ — మళ్ళీ ఫైళ్ళు ముందేసుకుని కూర్చుంటారు. అంతే—రాత్రి ఎనిమిదింటికీ, ఒక్కోరోజు తొమ్మిదీ, పదీ కూడా అవుతుంది ఆయన కుర్చీలోనించి లేచే సరికి—అప్పటిదాకా వాళ్ళలా కూర్చో వలసిందే. ఇంట్లో పెళ్ళాన్ని డాక్టర్ కి చూపించాలనుకున్నా, ముద్దుగా పెరుగుతున్న పిల్లవాడిని ముచ్చటగా ఒళ్ళో కూర్చోబెట్టుకుని లాలిద్దామనుకున్నా, బజారు నుంచి సామాన్లు తేవాలనుకున్నా...యిక గోవిందే—'

'మరి — ఆయన మాత్రం యింట్లో పనులు చూసుకోడా?'

'ఆహాఁ! ఎందుకు చూసుకోడూ — సరిగ్గా నాలుగున్నరదాకా చూసుకుంటాడు— కావాలనే అయిదింటికి కొద్దిగా ముందుకు వస్తాడు. అదో దరిద్రపు బుద్ధి ఆయనకి. అదీకాక యింటినిండా నౌకర్లూ, చాకర్లూ. ఆయన బజారు పోవాలా—యింటి వెచ్చాలు తేవాలా...' కసిగా అన్నాడు జయరాం.

'అదేం బుద్ధండీ—అంతా యింతేనా!'

'అంతా అని అనలేం ఇందూ! కాని చాలమంది అంతే — పైగా అంతపని చేసినా -ఎప్పుడూ ఆయన పై ఆఫీసర్ల దగ్గర్నించి కంప్లైంట్లే—పని జరగటం లేదని—'

'మరి వాళ్ళు రోజూ ఎనిమిదింటిదాకా-'

నవ్వాడు జయరాం. 'అది అంతే ఇందిరా — బలవంతాన కూర్చోపెట్టి పని చేయిస్తే ఏం జరుగుతుంది. ఆయన్ని బట్టే ఆయన క్రింది ఉద్యోగులు!'

ఇందిరకూడా నవ్వింది. ఆ నవ్వుని అలా దోసిట్లో దాచేసుకుందా మనుకున్న జయరాం ఆగిపోయాడు.

'ఇంకా తెర తీయరేం...' అంటున్న ఇందిరకూడా చటుక్కున ఆగిపోయింది.

కారణం— మరేం లేదు. అంత గంభీరంగా కూర్చున్న మేనేజరూ ఒక్కసారిగా పిల్లిలా అయిపోయాడు. సడన్ గా లేచి నుంచున్నాడు — ఆయనతోబాటు ఆయన భార్యకూడా లేచి నుంచున్నది.

వింతగా చూసింది ఇందిర.

'వచ్చేసారండి' మేనేజర్ గబగబా ఎదురువెళ్ళి సన్నగా, పొట్టిగా, నల్లగా చింతమొద్దులా వున్న ఒకాయన్ని ఆహ్వానించాడు, ఆయన వెనకనే వస్తున్న ఆయన భార్యను, మేనేజర్ గారి పెళ్ళాం రిసీవ్ చేసుకుంది. మేనేజర్ అప్పటిదాకా తను కూర్చున్న కుర్చీలో ఆ వచ్చిన ఆయన్ను, ఆయన భార్యనీ కూర్చోబెట్టి చేతులు కట్టుకు నుంచున్నాడు.

'ఆయన వాళ్ళ ఆఫీసర్. అందుకే అంత వినయవిధేయతలు చూపిస్తున్నాడాయన' అన్నాడు జయరాం ఇందిర చేతిని సున్నితంగా వత్తుతూ,

ఇందిర తల పంకించింది.

'ఏమయ్యా — మా అమ్మాయి కాలేజి సంగతి కనుక్కున్నావా' అడిగాడు ఆఫీసర్.

'ఆయ! కనుక్కున్నానండి — యాభై రూపాయలు డొనేషన్ కట్టాలన్నారండి. అదీ కట్టేశాను సార్!' గుర్రుగా చూస్తున్న భార్యను, గమనించనట్టుగా చూస్తూ అన్నాడు మేనేజర్.

ఆఫీసర్ థాంక్స్ చెప్పలేదు. చిరునవ్వు నవ్వలేదు. కళ్ళల్లో కృతజ్ఞతను చూపలేదు. 'ఊఁ!' అన్నాడు.

తెరలేచింది. సుభద్రా వెంకటాముకి పరిచయం అయాక కథని మొదలు పెట్టింది.

'కూచోవయ్యా నుంచుంటావేం!' గుణిగాడు ఆఫీసర్ నన్నగా.

'ఆయ'! అంటూ వెనక్కి వెళ్ళి కూర్చున్నాడు. మేనేజర్. పెళ్ళాంతో సహా.

'చీ! యిదేం డిపార్టుమెంటండీ — వాళ్ళకి అభిమానం అంటూ వుండదూ— అంత చదువూ చదివి అలా ప్రవర్తిస్తారేం! కనీసం — ఏమండీ అని మర్యాదగా అన్నా పిలవరేం — అదేం సంస్కారం — అయినా ఈయన మాత్రం అంత పిల్లిలా అయి పోతాడేం!' అన్నది ఇందిర

'ఇక్కడ అంతే ఇందిరా — నీకు తెలీదు— అలా ఉండకపోతే ఈ డిపార్టుమెంటులో వుండలేరు—'

'ఆ! వుండిమాత్రం ఏం లాభం. హాయిగా ఇంకోచోట చేరవచ్చు. మరీ యింత బోరింగ్ అయితే ఎలా అండీ — ఆఫీసుల్లో అయితే కొంత నయం. యిలాటి కల్చరల్ ప్రోగ్రామ్స్ లో కూడా యింతేనా— జ్ఞానం వుండద్దూ— మరీ ఈ డిపార్టుమెంటులోనే ఇలాంటి అసహ్యాకరమైన

‘సంతానంలేదా?’

వెంటనే సంప్రదించండి

బాక్స నెం. W/128

7, ఆంధ్ర సచిత్ర వార పత్రిక

తంబుచెట్టివీధి, మద్రాసు-1.



రేడియో రు. 15/- మాత్రమే



మా నవీనపథకం ద్వారా బ్యాటరీ సెల్సుతో పని చేసే ప్యాకెట్ ట్రాన్‌సిస్టర్ పొందండి. జపాన్ తయారి. ప్రపంచంలో ఎక్కడైనా స్థానికంగా సంగీతం, వార్తలు వగైరా వినండి. పోస్టేజి రు. 3. వి.పి. పార్సిల్ ద్వారా పంపబడును. వెంటనే వ్రాయండి. తృప్తికరముగా లేనిచో ధర వాపసు.

BUNTY RADIOS (B-19)
Durgiana, Amritsar.



బేబీటోన్

గ్రైప్ మిక్శ్చర్






అతన్ని ముద్దుగా నవ్వించండి!

అంతా చేసి యేడాదే. ఇంతలోనే ఆరు పళ్లు వచ్చేశాయి. ఎంతో సరదాగా వున్నాడు. ఆరోగ్య సూచకమైన ఆకలి. గాఢ నిద్రపోతాడు. కాని కడుపునొప్పి! అది తగ్గటం ఎంతో సేపు కాదులెండి. బేబీటోన్ గ్రైప్ మిక్శ్చర్‌కు ధన్యవాదాలు చెప్పాలి.




వారి ఉత్పత్తి

అమర్‌శోభ పోస్టు బాక్సు 518, మద్రాసు-3
పోస్టు బాక్సు 16460 బొంబాయి-16


# థేంక్స్ టు ది...

ప్రవర్తన—’

‘అవును ఇందూ — మా డిపార్టుమెంటులోనే యింత విపరీత ధోరణి — అది అంతే...’ అన్నాడు జయరాం.

‘మరి మీరూ యింతేనా!’ అన్నది ఇందిర.

‘ఛ — చస్తే అటువంటి పనులు చేయను—నాకా మాత్రం మానాభిమానాలు వున్నయ్ ఇందూ— ఇంత చదువూ చదివి — అంత సిగ్గులేకుండా ప్రవర్తిస్తానా— నాకింద పనిచేసే వాళ్లని నాతో సమానంగా గౌరవిస్తున్నాను. నాపై వాళ్ళకి ఎంత మర్యాద యివ్వాలో అంతా యిస్తున్నాను— ఒకళ్ళ కోసం నా ఆశయాలకు సంకెళ్ళు వేయను — వేయలేను.’ ఆమె కళ్ళల్లోకి ముద్దుగా చూస్తూ ముద్దుగా అన్నాడు జయరాం.

ఆమె చిన్నగా నవ్వి—గర్వంగా చూసింది జయరాంని.

ఆఫీసర్‌గారి పెళ్ళాం, ఎప్పుడు చూసిందో ఏమో—ఇందాకటి ఫలానా వుద్యోగిని చూసింది. చూసి, అతన్ని చూపించి ఆయనతో ఏదో చెప్పింది. ఆయన ఎవరికో చెప్పి, అతన్ని పిలిపించాడు.

‘బాయిలర్ బొగ్గు అయిపోయి మూడు రోజులయింది...’ ఆవిడ పూర్తిగా చెప్పక ముందే సుభద్రావెంకట్రామన్ పాడుతున్న పాట పూర్తయింది. అంతా చప్పట్లు కొడుతున్నారు. ఆవిడ కూడా చటుక్కున ముఖం మీదకు నవ్వు తెచ్చుకుని చప్పట్లు కొడుతూ ‘చాల బాగా పాడింది కదూ!’ అన్నది భర్తతో.

‘అవును! చక్కటి కృతి పాడింది. కళ్యాణి రాగం ఈవిడ చాల బాగ పాడుతుంది కదోయ్ నరసింహం!’ అన్నాడాయన వెనకనే కూర్చున్న మేనేజర్‌తో.

‘ఎస్సార్! చాల బాగ పాడింది—పాడుతుంది!’ అటెన్షన్‌లోకి వచ్చి అన్నాడు మేనేజర్.

మేనేజర్ పెళ్ళాం మెల్లగా అంది ‘ఆ పాట కళ్యాణి రాగం కాదండీ — కాంభోజి రాగం!’ తన సంగీత జ్ఞానం ప్రదర్శించి.

‘ఫీ నోర్మూయ్ అది కల్యాణి రాగమే!’ అన్నాడు మేనేజర్ ఆవిడ చెవిలో.

ఆవిడేం మాట్లాడ లేదు.

సుభద్రావెంకట్రామన్ యింకో కీర్తన అందుకుంది.

‘ఏమిటీ అంటున్నాను...ఆఁ! బాయిలర్ బొగ్గు అయిపోయి మూడురోజులయింది — రేపు ప్రొద్దున్నే తీసుకురావాలి. తెలిసిందా— ఎన్నాళ్ళుని ఆగాలి!’ గట్టిగా అడిగిందావిడ భర్తవేపు ఒకసారి చూసి.

‘అవును ఎన్నాళ్ళని ఆగాలి! రేపు ప్రొద్దున్నే ఒక బస్తా వేయించు’ అన్నాడాయన.

అతను మాడిపోయిన ముఖంమీద చిరునవ్వు పులుముకుని. ‘ఎస్సార్’ అని నమస్కారం చేసి జేబులోని సిగరెట్ పెట్టె తడుముకుంటూ జనంలో డిసాల్వ్ అయిపోయాడు.

‘చూశావా—యిదీ వరస— స్వంతపనులు చేయించుకోవటానికి వాళ్ళకి బుద్ధి జ్ఞానం లేదనుకో— చేసేవాళ్ళకి అయినా వుండక్కర్లా—’

‘అవును—మన రక్తంలో ఇంగ్లీషువాళ్ళు బానిసత్వం నింపి వెళ్ళారు—వాళ్ళు దేశాన్ని వదిలినా, అది వదలనంటున్నది వీళ్ళని— ఏంచేస్తారు పాపం!’ అనోరకంగా నవ్వింది ఇందిర.

వాళ్ళు గొప్పతనం నేర్చుకోకపోయినా కనీసం యిదన్నా వంటబట్టింది మనకి— థేంక్స్ టు ది ఇంగ్లీష్‌మెన్!’ అన్నాడు జయరాం.

భర్త భుజంమీద తలవాల్చి అరమోడ్పు కళ్ళతో, చెవులు రిక్కించి పాటవింటున్న ఇందిర, ఉన్నట్టుండి వులిక్కి పడింది, జయరాం ఆమెను ఒక్కసారిగా విదిలించే సరికి అతన్ని తేరిపార జూడబోయింది. కాని అతడు అక్కడ లేడు. గేటువేపు చూసింది. ఒక చిన్నపిల్లవాడ్ని ఎత్తుకొని నవ్వుతూ—ఒక లావుపాటి ఆయనకు దారి చూపిస్తూ వస్తున్నాడు జయరాం.

ఆ లావుపాటి శాల్తీ అంటున్నాడు ‘రేపొద్దున్న ఒకసారి రావయ్యా — మా’ ఆవిడ అప్లికేషన్ డోర్స్—హోటల్స్‌నంచి కారియర్ అవీ ...’

తరువాత ఇందిరకేమీ వినపడలేదు — తల వూపుతున్న జయరాం కనబడ్డాడు. ●

# పళ్ళు-జాగ్రత్తలు

## డాక్టర్ రాధాసత్సంగి

ముఖ సౌందర్యానికి పళ్ళు చాలా ముఖ్యమైనవి. అందమైన, తెల్లని ముత్యాల్లాంటి పళ్ళు ముఖానికి ఎంతో అందాన్నిస్తాయి. చక్కని తీర్చిదిద్దినట్లున్న పలువరుస మనిషి వ్యక్తిత్వానికి విశేషమైన ఆకర్షణ నిస్తుంది. అయినా పళ్ళయొక్క కర్తవ్యం, ఒక్క ముఖానికి అందాన్ని, ఆకర్షణని ఇవ్వడమే కాదు. మనం మాట్లాడేటప్పుడు, ఉచ్చారణ సరిగ్గా వుండడానికి, మనం తినే భోజనం బాగా నమలగలగడానికి ఎంతో తోడ్పడతాయి. వయస్సుతోబాటు పళ్ళు రాలిపోవడం సహజమే. కానీ వయస్సులోవున్నవారికీ, పళ్ళూడిపోవడం, అనేకరకములైన పళ్ళ జబ్బులు రావడం అస్వాభావికం. తగిన శ్రద్ధ తీసుకోకపోవడం కూడా దీనికి ఒక ముఖ్య కారణం,

అసలు ఈ వ్యాసం రాయడానికి ముఖ్య కారణం ఒక పేషెంటు. ఒకనాడు నేను క్లినిక్‌లో కూర్చునివుండగా, ఒక అమ్మాయి వచ్చింది. నాజూగ్గా ఆ అమ్మాయి ఎంతో బాగుంది. ఏదో పంటినెప్పో ఏదో వచ్చి వుంటుందిలే అనుకున్నాను. తీరా ఆ అమ్మాయి నోరు విప్పితే ఘోరం. ఒక్కటీ శుభ్రమైన పన్ను లేదు. అన్నీ సగం విరిగి, కొన్ని పూర్తిగాపోయి, నల్లగా చాలా అసహ్యంగా వున్నాయి. క్షణం ఆమెపై నాకెంతో కోపం కలిగింది. ఈనాటి వైజ్ఞానికయుగంలో, వైద్యానికి కొదవా? మందులకు కొదవా? శరీరంలో ఏ భాగంలోనైనా సరే ఏ విధమైన తేడా కనిపించినా, వెంటనే దానికి చికిత్స చేయించుకోవాలి. పళ్ళను సురక్షితంగా వుంచాలీ అంటే, ముందు వాటిని శుభ్రంగా వుంచడం నేర్చుకోవాలి. పళ్ళు సరిగ్గా శుభ్రపరచకపోతే, వాటి మధ్యలో ఇరుక్కున్న భోజనపదార్థాలు కుళ్ళి, దంతక్షయానికి దారితీస్తాయి. ప్రతి ఉదయం, ప్రతి రాత్రి, పడుక్కునే ముందు పళ్ళు తప్పకుండా, మంచి పళ్ళపొడి గాని, వేపపుల్ల గాని టూత్‌పేస్టు గాని, ఎవరికి ఏది వాడితే దానితో శుభ్రంగా తోముకోవాలి. పూర్వకాలంలో ఈ రకరకాల పేస్టులు, పౌడర్లు ఎక్కడివి? స్వచ్ఛమైన వేపపుల్లలు, కచిక, మసిబొగ్గు, వుప్పు కలిపి మెత్తగా నూరి, ఆ పొడరుతో పళ్ళు శుభ్రపరచుకొనేవారు. ఆనాటి ప్రజల శరీర ధారుఢ్యం నేటి ఆధునికయుగంలో మనుషులకు లేదు. ఒక విధంగా చూడొస్తే ఆనాటి పద్ధతులే ఉత్తమమైనవి. ఉప్పు పళ్లకు ఎంతో మేలు చేస్తుంది. ప్రతిదినము పళ్ళు తోముకునే ముందు కొంచెం ఆవనూనెలో ఉప్పు కలిపి, ఒక రెండు నిముషాలు, బాగా పళ్ళను తోమితే, పళ్ళకి అసలు ఏ విధమైన రోగము రాదు. పయోరియా, ఇగుళ్ళు వాచడం, నెత్తురు, చీము రావడం వుంటే ఈ విధంగా రోజూ తోమితే పూర్తిగా తగ్గిపోతుంది. అనారోగ్యం వల్ల పళ్ల మీద నల్లని పదార్థం జమ అవుతూంటుంది. దాన్ని అశ్రద్ధ చెయ్యకూడదు. దానివల్ల దంతక్షయం, నోటి నించి దుర్వాసన మొదలవుతాయి. అలాంటప్పుడు, ఆవనూనె, ఉప్పు కలిపి రోజూ రెండుసార్లు తోమితే చాలా లాభం వుంటుంది.

చాలా మంది పళ్ళు తోముకోవడం, ఒక వాలాయతి అన్నట్లు చూస్తారు. బ్రష్ తియ్యడం, ఏదో రెండుమూడుసార్లు రాయడం. అంతే అయిపోతుంది. శుభ్రం. కానీ అలాక్కాదు. పళ్ళు అన్ని పక్కల్నించి శుభ్రంగా తోముకోవాలి. భోజనం కాగానే, పుల్లతోనో, పిన్నుతోనో పళ్ళు కుట్టుకునే అలవాటు వుంటుంది, చాలామందికి. కాని అది మంచి పద్ధతి కాదు. దానివల్ల అప్పుడప్పుడు ఇగుళ్ళు పాడవుతాయి.

మన శరీరానికి వ్యాయామం ఎంత అవసరమో మన పళ్ళకు కూడా వ్యాయామం చాలా అవసరం. ఎప్పుడూ మెత్త మెత్తని పదార్థాలే తింటూ వుంటే, పళ్ళకు ఎక్కువ నమల వలసిన పని వుండదు. అంచేత అవి వీక్ అయిపోతాయి. మధ్యలో గట్టిగా కరకర లాడే వస్తువులు, పచ్చి కూరలు, ముల్లంగి, కేరట్, కొబ్బరి మొదలయిన వస్తువులు కూడా తింటూ వుండాలి.

దంత క్షయానికి, మన అనారోగ్యం



# ఋతుక్రమం అలస్యమైతే ?

విచారపడవద్దు ప్రఖ్యాతిగాంచిన "దేవిపిల్సు" వాడండి

దేవి పిల్సు ముఖ్యంగా అలస్యమైన, క్రమముగాకాక పోయిన, బాధతోకూడిన, లేక ఆగిపోయినబహిస్టకు దేవిపిల్సు బాగుగ గుణమిచ్చును

DEVI Pills
INDICATED IN DELAYED SCANTY PAINFUL & ARRESTED MENSES
SEENU & Co.
DEVI DEVI DEVI DEVI DEVI

1 అన్ని సందర్భములలోను శీఘ్రముగాను, అమోఘముగాను పనిచేయును.
2 ఏస్థితిలోను ఆరోగ్యమునకు ఎట్టిహాని కలిగింపదు

FULL COURSE 28 TABLETS Rs.11/-
HALF COURSE 14 TABLETS Rs.6.50

ప్రతిచోటదొరకును

Mfrs.: SEENU & Co., MADRAS-81

Available at all leading Chemists & Druggists.

నా సౌకర్యం కోసం మరో సాధనం

Instam

ఈ నోరి. అది తక్షణ తయారీ చింతపండు

ఇన్‌స్టామ్ గృహిణికి వరప్రసాదం లాంటిది. [illegible] చింతపండు గుజ్జు పైగా, బజారు చింతపండులో ఉన్న మట్టి, బూజు, క్రిమికీటకాలతో [illegible].

ఇన్‌స్టామ్ చింతపండు మలినము లేకుండా శుద్ధము చేయబడింది. అందువల్ల ఎక్కువ మరగబెట్టనవసరం లేదు. ఇన్‌స్టామ్, సరాసరి సీసానుండి వంట పాత్రలో వేసుకోవచ్చును. అది వంట ముగిసే [illegible] చాలు. ఇట్టే కరిగిపోతుంది. ఎంతో తేలిక. ఎంతో రుచి. 8 మంది వంటకు (సాంబారు, రసం, పులిహోర - ఏదైనా) ఒక్క చెంచా ఇన్‌స్టామ్ చాలును.

శ్రీ వెంకటేశ్వర ఫ్రూట్ ప్రాసెసింగ్ (ప్రై) లిమిటెడ్,
[illegible], తూ. గోదావరి జిల్లా. ఆం. ప్ర.

ఇన్‌స్టామ్


## పళ్లు-జాగ్రత్తలు

కూడా ఒక కారణమే. అజీర్ణం వల్ల పళ్ళు పాడవుతాయి. ఈ విషయం మీద అమెరికాలోని ఫోరసాయిత్ ఇన్‌స్టిట్యూట్‌లోని డాక్టర్లు పరిశోధనలు జరిపి ఋజువు చేశారు. డా. హావ్ అనే సుప్రసిద్ధ డాక్టరు ముందుగా ఎలుకలపై ప్రయోగం జరిపారు. ఎలుకలకు కొన్నాళ్ళపాటు, అజీర్ణం కలిగించే ఆహారం పెట్టించాడు. దాని ఫలితంగా ఆరోగ్యంగా వున్న ఎలుకలకు 'పయోరియా' అనే పళ్ళ వ్యాధి మొదలైంది.

మనము తినే ఆహారం మీద కూడా మన పండ్ల రక్షణ ఆధారపడి వుంటుంది, మన భోజనంలో, ఖనిజ లవణాలు, కేల్షియమ్, ఫాస్ఫరస్, విటమిన్ డి, సి. విరివిగా వుండాలి, పళ్ళు దృఢంగా, ఆరోగ్యంగా, అందంగా వుండాలి అంటే, మన భోజనంలో పాలు, వెన్న, నారింజ, గుడ్లు; ఆకు కూరలు, బొబ్బాసి, నిమ్మకాయ, పెద్ద ఉసిరికాయ, అనాస, కమలాఫలము, మొదలైనవి వాడుతూ వుండాలి. కాల్షియమ్ తక్కువైతే కూడా చాలా రకాలైన పండ్ల జబ్బులు వస్తాయి. తీపిని ఎక్కువగా తినకూడదు పండ్ల జబ్బులు వున్నవాళ్ళు. పంచదార, బెల్లం తగ్గించడం మంచిది. తీపిని అరిగించాలంటే కాల్షియమ్ చాలా అవసరం. ఎక్కువగా తీపితింటే, కాల్షియమ్ నష్టమై, పళ్ళు అనారోగ్యంగా అయిపోతాయి. ఎందుకంటే పళ్లను దృఢంగా వుంచడానికి కాల్షియమ్ అనివార్యమైన రసాయనిక పదార్థం. ఒక ఆరోగ్యమైన వ్యక్తికి. ప్రతిరోజూ భోజనంలో 10 గ్రెయిన్ల కాల్షియమ్ అవసరం వుంటుంది. గోధుమ రొట్టె. అరటి పండ్లు. వేరుశనగ, కొబ్బరి వచ్చిమటర్లు మొదలైన వాటిలో కూడా కాల్షియమ్ విరివిగా లభిస్తుంది. చిన్న పిల్లలలో కూడా కాల్షియమ్ డెఫిషియన్సీ వుండకుండా చూసుకోవాలి.

ఎక్కువ చల్లని పానీయములు. ఐసు, ఎక్కువ వేడిగానున్న టీ, కాఫీ మొదలయినవి, వీలయినంత వరకు తగ్గించాలి వీటివల్ల పండ్లు దెబ్బతింటాయి. ముఖ సౌందర్యానికి పళ్ళు చాలా ముఖ్యం. అద్భుతమైన చిరునవ్వుకు, ముత్యాలవంటి పళ్ళ వరుస కోటికాంతుల [illegible]

# ఒక వారం విపరీతం

ఫాలాక్షుడు

## జనాభా!

మనదేశంలో జనాభా రానురానూ పెరిగిపోతోందని తత్సంబంధితులు వివరించిందట. 1961—71 ల మధ్య జనాభా 24.8 శాతం పెరిగిపోయినట్టు జనాభా లెక్కల కమీషను వెలడీ కరించింది. 1971 ఏప్రియల్ నెల మొదటి రోజు నాటికి దేశంలో 547,949,809 మంది మహాజనులున్నట్టు, ఇందులో 438,885,000 మంది గ్రామాలలో వుంటున్నట్టు 109,094,809 మంది పట్నాల్లో వుంటున్నట్టు నివేదిక వివరించిందట— వాటీజ్ దిస్! వో పక్క కుటుంబ నియంత్రణలు, గర్భస్రావాలూ మామంచిగా దేశంలో పని చేస్తున్నాయంటూ, మరోపక్క జనాభా లెక్కలిలా చూపిస్తుంటే ఎలా!

## విడాకులు పుచ్చుకున్నా వీడని వైరం

ఢిల్లీ భోలానగర్‌కు చెందిన కమర్ ఆల్‌జహా అనే ఆమెకు, మొరాదాబాదుకు చెందిన ఎహసెన్ అలి అనే ఆయనకూ మూడేళ్ళ క్రితం వివాహమయ్యిందట. వీరి దాంపత్య జీవితంలో రగడ జరిగి, సర్దుబాటుకాక, వారు విడాకులు పుచ్చుకున్నారట. ఆనక, ఆల్‌జహా వేరే అతన్ని వివాహమాడి, తన తండ్రి యింట్లోనే వుంటోందట. మొన్న 9 వ తేదీ సాయంత్రం ఆమె బజారునుంచి తిరిగి వస్తుండగా ఆమె మాజీ భర్త కత్తితో ఆమెను విచ్చలవిడిగా పొడిచి పారిపోయాడట.

## తక్కువ మార్కులతో పాసైన వారికి కాలేజీ!

యస్. యస్. యల్. సి. పరీక్షలో చాలా తక్కువ మార్కులు వచ్చి ప్యాసయిన విద్యార్థులకు మాత్రమే సీటు యివ్వబడును అనే పద్ధతిలో వో కళాశాల నిర్మించాలని తిరుచ్చి ఆలోచిస్తున్నదట— హావెల్లా యుడియా!




## టీచర్ పై అఘాయిత్యం తలపెట్టి ఉరివేసుకున్న విద్యార్థి!

వాలాజీపేటకు చెందిన పొన్నై అనే గ్రామంలో సెల్వం అనే 38 ఏళ్ళ ఆవిడ కోదండరామ కుప్పం స్కూలులో టీచరు పని చేస్తున్నదట. ఆమె ఒక రోజు కోదండరామకుప్పం స్కూలుకు వెళ్తుండగా తంగరాజు అనే వో విద్యార్థి ఆమె కూడా పడి, 'ఏమేయ్ ఆగాగు నిన్నే' అని గోల చేస్తే ఆమె ఆగి, వెనక్కు తిరిగి అతన్ని చీవాట్లు వేసిందట. దాంతో తంగరాజుకు కోపం వచ్చి ఆమెను కత్తితో పొడిచి పారిపోయి, ఆనక తనమీద హత్యా నేరం పోలీసు మోపుతుందేమోనని భయం వేసి, వూరు బయట చెట్టుకు వురేసుకు చచ్చిపోయాడట. ఇంతకూ సెల్వం ఆసుపత్రిలో కోలుకుంటోందట.

* * *

బెంగుళూరుకు చెందిన డాక్టర్ కోబ్రా అనే ఆయన పై చదువులకోసం అమెరికా వెళ్ళారట. అక్కడ ఆయన భార్య కారులో వెళుతూండగా జరిగిన ప్రమాదంలో ఆయన భార్య చనిపోయిందట.

## భర్తని చంపిన భార్య

ఎనిమిది నెలల క్రితం సెన్‌పాక్కంలో 25 ఏళ్ళ పళనియప్పకూ సంపూర్ణం అనే ఆమెకూ వివాహం అయ్యిందట. పళనియప్ప లారీ డ్రయివరు పని చేస్తున్నాడట. గత అయిదు నెలలుగా యిద్దరూ వాళ్వంతి అనే గ్రామంలో వుంటున్నారట. ఆ వూళ్ళోనే పక్కింట్లో వుండే వో లారీ డ్రయివర్ కుర్రాడిని సంపూర్ణం ప్రేమించిందట. ఈ ప్రేమించడం వో స్థితి మించడం వల్ల పళనియప్పకు తెలిసి సంపూర్ణాన్ని కొడవలితో చావబాదాడట. ఆ బాదడంలో ఆమె చేతులకూ, కాళ్ళకూ వంటిమీదాకూడా గాయాలయ్యాయట. ఆరాత్రి సంపూర్ణం ఆదమరచి నిద్రపోతున్న పళనియప్పను కొడవలితో పీకనరికి, అంతతో ఆగక, చేతుల్నీ, కాళ్ళనూకూడా నరికి చంపి, చనిపోతూ అతను చేసిన ఆర్తనాదాలకు చుట్టుపక్కలవాళ్ళు వారు పొగైతే వారి ముందునుంచే పారిపోయిందట.

* * *

## ఆఫీసు పేరిట వ్యభిచారం!

బొంబాయి నగరానికి చెందిన సావంత్ అనే ఆయన ఆయన భార్య విమలా కలిసి దాదర్‌లో వో యింట్లో చక్కటి ఆఫీసు పెట్టారట. వారి ఆఫీసు ఉదయం 11 గంటల నుంచి, సాయంత్రం ఆరు గంటల వరకూ పని చేసేదట. అయితే యీ చక్కని ఆఫీసు వెనుక చక్కనిచుక్కల సయ్యాటలున్నాయట. తరచి చూడగా, అది అసలు ఆఫీసుకాదని, ఆ పేర వో ముగ్గురు చక్కని చుక్కలతో ఆ దంపతులు వ్యాపారం చేస్తున్నారట. పోలీసులు వో వ్యక్తికి 50 రూపాయలిచ్చి లోపలకు పంపి,ఆనక వున్నపళాన వారూ జొరబడ్డారట. లోపల ఇంద్రలోకంలో తేలిపోతున్న వారినందర్నీ బంధించారట— ఓం శాంతి!

## నీటి కరువు

భద్రాచలానికి సుమారు 45 కిలోమీటర్ల దూరంలో కలచెర్ల అనే గ్రామంలో వేసవి ధర్మమాని



భావులన్నీ ఎండిపోడం వల్ల మంచినీళ్ళు బిందె ఒక్కింటికి 30 పైసలు చొప్పున అమ్మబడుతున్నాయట— బిందెకు ఎన్ని గ్లాసులు సార్!

## నిరాశతో ఆత్మహత్య

లక్నో నుంచి బెంగుళూరు వచ్చి వో అధునాతనమైన హోటల్లో బసచేసి, గుర్రప్పందాలు ఆటలో శక్తివంచన లేకుండా పాల్గొన్న 35 ఏళ్ళ సంగి అనే ఆయన ఆ ఆటలలో సర్వం పోగొట్టుకొని, ఆ నాలుగంతస్తుల హోటలు మీంచి దూకి ఆత్మహత్య చేసుకున్నాడట.

## శివమెత్తిన బాలుని కిరాతకం!

ఋషీకేశ్‌కు 20 కిలోమీటర్ల దూరంలో వున్న దర్పర్‌పూర్‌లో ప్రభాకర్ అనే బాలుడు శివం పూనిన వానిలా తనతల్లిదండ్రులను, అక్కను, ఇంటి నౌకరును 17వ తేదీ రాత్రి కాల్చిచంపేశాడట. తాతగారిక్కి కూడా అదేగతి పట్టించబోతే, ఆయన మాత్రం పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నారట.

# ఒకవారం విపరీతం

## ఒకే కాన్పులో అయిదుగురు పిల్లలు

పశ్చిమజర్మనీకి చెందిన వో అమెరికన్ యువతి మొన్న శనివారం 10వ తేదీన రాత్రి ఒకే కాన్పులో అయిదుగురు బిడ్డలను కన్నదట. తల్లీ పిల్లలూ కులాసయేనని ఫ్రాంక్‌ఫర్టు విశ్వవిద్యాలయానికి చెందిన ఆసుపత్రి అధికారులు అన్నారట. ఆమెభర్త హారీస్ బీన్ వో ఇంజనీరుట.

## కారు ప్రమాదంలో మరణించిన నౌకాదళాధికారి కుటుంబం

భారత నౌకాదళానికి చెందిన లెఫ్టినెంట్‌కమాండరు ఎస్.ప్రబెజా తన భార్యా పిల్లలతో ఢిల్లీనుంచి బొంబాయి వెళ్తుండగా (10వ తేదీన) వారి కారుకు మధుర సమీపంలో వో లారీ గుద్దిందట. ఫలితంగా ప్రబెజా, ఆయన కూతుళ్ళలో వో కుతురూ అక్కడికక్కడే చనిపోయారట. ఆయన భార్యా, మిగిలిన యిద్దరు కూతుళ్ళూ ఆసుపత్రిలో చనిపోయారట.

* *

గత 12, 13 తేదీలలో తిరుపతి పుష్కరిణిలో యిద్దరు, ఆనకట్ట వద్ద ఒకరు మునిగి చనిపోయారట. ఇంకో యిద్దరు ఆలయం చుట్టూ అంగప్రదక్షిణ చేస్తుండగా చనిపోయారట.

## బందిపోట్లని ఎదుర్కొన్న ప్రజలు!

నారాయణ్ గంజికి 10 కిలోమీటర్ల దూరంలో వున్న మనూమాబాదులో వో 13మంది బందిపోట్లు దోపిడీ చేసి పోతుండగా ఆ వూరివారంతా (ధైర్యమున్నవారే!) చేరి ఆ బందిపోట్లను ఆపి చెత్తచెత్తగా బాదారట. ఈ ఉద్యమంలో ఆరుగురు బందిపోట్లు చనిపోవడం, ఒకరు సజీవంగా పట్టుబడడం మిగతా ఆర్గురు పారిపోవడం జరిగిందట.

* *

తిరుపతి వెంకటరమణుని మే నెల ఆదాయం 46,25,162 రూపాయలని తేలిందట. గత సంవత్సరం మే నెలలో ఆయన ఆదాయం 44,19,796 రూపాయలేనట.

## బందిపోట్లకి పరాభవం!

కృష్ణఘర్‌కు చెందిన ఖన్‌పూర్ గ్రామం మీద వో 15 మంది బందిపోట్లు పడి, దోపిడీ చేస్తూండగా (19 వ తేదీ రాత్రి) వారి ఆయుధాలను చూసి కూడా బెదరకుండా, ఆ వూరి వారంతా చేరి, వారి మీద పడ్డారట. తత్ఫలితంగా ముగ్గురు బందిపోటు దొంగలు చనిపోయారట.

* * *

హోసూరు తాలూకా ఉద్దనపల్లి గ్రామం వద్ద రోడ్డు వారగా వో లారీ నిలబెట్టి దాని క్రింద దూరి, ఏదో మరామత్తు పని చేస్తున్నాడట ఒకాయన. అంతలో వో లారీ వచ్చి యీ లారీని వెనుక నుంచి మోదిందట. దాంతో ఆ లారీ కదిలి, దాని క్రింద పని చేస్తున్న వ్యక్తిమీంచి పోడం వల్ల, ఆ వ్యక్తి అక్కడికక్కడే మరణించాడట.

## హర్యానాలో అడుక్కోడం నేరం

హర్యానా ప్రభుత్వం భిక్షం ఎత్తడాన్ని నేరంగా శాసన రీత్యా రూపొందించిందట. తత్ఫలితంగా హర్యానాలో వుండే ఆ జాతి వారంతా మటుమాయమయ్యారట! ఏమయ్యుంటారు ? అంతా బయటూళ్ళకు వెళ్ళిపోయి వుండుంటారు.

## న్యూయార్కులో వినాయకుడి గుడి

న్యూయార్కులో భారతీయులు ఎక్కువగా నివసించే ప్రాంతంలో 50 వేల డాలర్ల విలువ చేసే 10 వేల చదురపడుగుల స్థలంలో శ్రీ మహాగణపతి దేవాలయం నిర్మించడానికి సర్వసన్నాహాలూ, జరుగుతున్నాయట.



## యాభైమూడో ఏట 12ఏళ్ళ బాలికను మూడో పెళ్ళి చేసుకున్న ఎం. ఎల్. ఏ.

అస్సాముకు చెందిన వో యం. ఎల్. ఏ.గారు తన 53వ ఏట 12 ఏళ్ళ చిన్నారిని వివాహం చేసుకున్నారట. ఈయనకీ శుభకార్యానికి ముందే యిలాంటి వేవో రెండు శుభకార్యాలయాయ్యట. ఆయన వివాహానికి ఆ యిద్దరు భార్యలు, బోల్డు మంది పిల్లలు, మనుమలు, మనుమరాళ్ళు అంతా హాజరయ్యారట. ఇన్ని వివరాలు యిచ్చిన అస్సాం ట్రిబ్యూన్ పత్రిక ఆ యం. ఎల్. ఏ. గారి పేర్మాత్రం బయటపెట్టలేదట.

## లారీ ప్రమాదంలో నలుగురి మరణం

నీలగిరి ప్రాడలూరు నుంచి కట్టెలు కోయంబత్తూరు తీసుకుపోతున్న వో లారీ మేట్టుపాళయం వద్ద 19 వ తేదీ రాత్రి రోడ్డు మలుపు తిరుగుతూ, వో పదడుగుల గోడను గుద్దుకుందట. తత్ఫలితంగా డ్రైవరుతో సహా మొత్తం నలుగురూ చనిపోయారట. ఆ లారీ బోల్తాపడడం వల్ల యీ నలుగురూ చనిపోయినట్టు వార్త.

## తమిళనాడులో అతివృద్ధుడు!

మైసూరు రాష్ట్రం మంగళాపురానికి చెందిన నారాయణన్ పొట్టి అనే ఆయన తమిళనాడుకు చెందిన కేరళాపురంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారట. ఆయన మొన్న 13వ తేదీన తన 140వ ఏట చనిపోయాడట. 140 ఏళ్ళు బతికిన యీ నారాయణపొట్టి తమిళనాడులో అందరి కంటె ఎక్కువ వృద్ధుడట, ఆయన భార్య వళ్ళియమ్మాళ్‌కి 97 ఏళ్ళట.



రవీంద్ర భారతిలో జరిగిన 20వ అలిండియా థియేటర్ కన్వెన్షన్‌లో ప్రదర్శించిన శ్రీకృష్ణ పారిజాతం నృత్య నాటకంలో ఒక దృశ్యం. ఇందులో పాల్గొన్న వారు శ్రీ వెంపటి చినసత్యందగ్గర శిక్షణ పొందారు. (ఫోటో: శ్రీధర్స్)




'లవ్ ఈజ్ బ్లయిండ్' అన్నారు—ప్రేమించటం చేతగానివారు. ఒట్టి బ్లయిండ్ కాదు, కలర్ బ్లయిండ్ కూడా అన్నారు, తెల్లమ్మాయిలు నల్లబ్బాయిలు లేక నల్లమ్మాయిలు, తెల్లబ్బాయిలు కలసి తిరగడం చూసి కొందరసూయాపరులు.

ఏదేమైనా నేనుమాత్రం దీనికి ఒప్పుకోను. లవ్ ఈజ్ బైండింగ్ అంటాను. అంటుకుంటే అరటికాయ మరకలాగ వదలదు.

మా అన్నయ్య లిద్దరూ ప్రేమించే పెళ్ళిళ్ళు చేసుకున్నారు. పెద్దన్నయ్యేమో మా ఇంట్లో అద్దెకుంటున్న వారమ్మాయిని ప్రేమించేసాడు. అద్దె ఎగ్గొట్టడానికి పిల్ల తల్లిదండ్రులు వేసిన పథకంరా ఇది అని మా బామ్మ ఎంత నెత్తి నోరు కొట్టుకున్నా లాభం లేకపోయింది.

పెళ్ళంటూ జరిగితే ఆ అమ్మాయితోనే లేకపోతే ఆజన్మాంతం బ్రహ్మచారి గానే వుండిపోతాను అని శపథం చేసిపారేశాడు.

పెద్దవాడికి పెళ్ళికాకపోతే తనకు పెళ్ళి లేక్పోతుందన్న భయంతో మా రెండో అన్నయ్య మా పెద్దన్నయ్య పక్షం తీసుకున్నాడు. అద్దెకుంటున్న వాళ్ళమ్మాయి అప్పుడప్పుడు తను పత్రికల్లో చూసి చేసిన వంటకాలు మా అమ్మకు రుచి చూపిస్తూ వుండటంవల్లో, మరేమోగాని అమ్మ కూడా అంత ప్రతికూలత చూపలేదు. ఇక బామ్మకు తప్పలేదు.

మా రెండో అన్నయ్య ముందు కాలేజీలో ఎవరో ప్రేమించి తర్వాత కొన్ని కారణాంతరాలవల్ల మా మామయ్య కూతుర్ని పెళ్ళాడేసాడు. ఎలా అయితేనేం ప్రేమించాడు. పెళ్ళి చేసుకున్నాడు.

నాకు కూడా ప్రేమించినమ్మాయినే పెళ్ళి చేసుకోవాలన్న కోర్కె బలంగా నాటుకుపోయింది. కాని అదేం శాపమో అవలే మా వీధిలోవుండే అమ్మాయిలు తక్కువ. ఉన్నవాళ్ళలో కొందరు నన్ను అన్నయ్య కింద, కొందరు తమ్ముడికింద జమకట్టి వదేసారు. ఇంకా కొందరు రౌడీ వెధవకింద చూస్తున్నారని నా అనుమానం.

ఇక అవమానం భరించలేక దేశాంతరాలు వెళ్ళిపోదామా అనుకుంటున్న సమయంలో పక్కవూర్లో టీచర్ ఉద్యోగానికి పిలుపొచ్చింది.

'ఎంత కావాలి??' అన్నాడు ఆ అధికారి.

'ఎంతిస్తారు?' అని విలేశాను నేను.

వాడు కొరకొర చూసి 'రెండు వందలిస్తాము. మీరు మామూలుగా జీతం ముట్టినట్లు సంతకంచేయాలి. మాటయాభయికే చేరతామని వచ్చేవారు కోకొల్లలు. ఏమంటారు?' అన్నాడు. ఇక పోసేదిలేక, అదే

మహా(ప్రసాదమని ఒప్పుకున్నాను. ప్రసాదా లెప్పుడూ తక్కువగానే పెడ్తారుకదా!

ఇలావుండగా ఓ నాడు నన్ను వెతుక్కుంటూ ఓ టెలిగ్రామ్ వచ్చింది. 'బామ్మ చావు బతుకులమధ్య వూగిసలాడుతోంది. వెంటనే 'రా' అనీ దాని సారాంశం. వెంటనే పదిరోజులు శెలవు పెట్టి ఆదరా బాదరా ఇంటికొచ్చాను. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. ఏం ఘోరం జరిగిపోయిందోనని లోప లికి మెల్లగా అడుగుపెట్టి లోపలి దృశ్యాన్ని చూసి కొయ్యబారిపోయాను. బామ్మ చావు బతుకుల మధ్యకాదు, ఉయ్యాల వంకమీద వూగుతూ వొక్క చప్పరిస్తూ కన్పించింది. నన్ను చూడంగానే గభీలున లేచి కూర్చుని బామ్మ 'ఓరీ ఎప్పుడొచ్చావురా? టెలిగ్రాం అందిందా?' అంది.

'అందింది గాని ఏం కొంప మునిగిందని అట్లా ఇచ్చారు' అన్నాను కోపంగా.

'అంత కోపం ఎందుకురా? అట్లా ఇస్తేగానీ నువ్వు రావాయె. అయినా నేనంత త్వరగా పోనులేరా. ఏదో నిన్నో ఇంటివా డిని చేసి నీ కడుపునో కాయ కాస్తే చూసి అప్పుడు...'

ఈ బామ్మలకు మరీ పూర్వపు వాస నలు వదలటం లేదు. కడుపున కాయ అంటే ఈ కాలంలో ఏ అల్సరో, క్యాన్సరో. అలా అనవద్దంటే వినరు.

తరువాత అసలు సంగతి చెప్పింది. తనూ మా నాన్న అమ్మ కలసి ముచ్చటగా మూడు సంబంధాలు చూసారట. అందులో ఒకటి అయినవారి సంబంధం. అంటే మా మామయ్య కూతురు. మిగిలిన రెండు పై సంబంధాలు. ముగ్గురిని చూసి, ఎవరినో ఒకర్ని చేసుకొని తీరాలి అని పట్టుపట్టింది బామ్మ.

నేనుకూడా పోనీ పెళ్ళి చూపుల్లో వచ్చినమ్మాయిని చూసి పెళ్ళి జరిగేదాక ప్రేమిస్తే సరి అని సమాధానపడ్డాను.

మొదట మామయ్య వాళ్ళ వూరికి వెళ్ళాను. ఎవర్నీ వెంట తీసుకుపోలేదు. ఇంట్లో అత్తయ్య ఒకత్తేవుంది. మామయ్య ఆఫీసు పనిమీద పక్కవూరి కెళ్ళాడట. ప్రమీల అదే మామయ్య కూతురు, స్నేహితు రాళ్ళతో సినిమా కెళ్ళిందట.

'ఒంటరిగా అల్లా ఆడపిల్లను పంపించ కిట్లేదత్తయ్యా. అసలే రోజులు మంచివికావు.

# వధువు కావలెను

ఆమధ్య ఇలానే ఓ అమ్మాయి ఒంటరిగా సినిమాకెళ్తే ఏమయిందో తెల్సా?' అని పత్రికలో చదివిన విశేషాలకు కొన్ని వింతలు జోడించి అత్తయ్యగారు పాడటమారంభించింది. ఇదంతా నేనెంత బాధ్యతకలవాడినో అన్న క్వాలిఫికేషను సంపాదించుకోవటానికే.

'ఒంటరిగా కాదు నాయనా ఎవరో స్నేహితురాలి పుట్టినరోజట. ఆ అమ్మాయే అందరినీ తీసుకెళుతూంటే తనూ వెళ్ళింది.' అందత్తయ్య.

ఇదీ మన మంచికే. ప్రమీల వచ్చేలోపల వీలా మాటాడాలో రిహార్సల్ వేసుకోవచ్చు.

చీకటిపడుతూండగా ప్రమీల వచ్చింది.

'హల్లో ప్రమీ! బాగున్నావా? పిక్చర్ ఎలావుంది?'

'నా మొహంలా వుంది' అంది మొహం చిట్లించి.

'అంటే చాలా బాగున్నదన్నమాట.'

'అయితే నీ మొహంలా వుంది' అనీ విస విస లోపలి కెళ్ళిపోయింది.

ఛఛ. కాలేజీలో చదువుతారేగాని వీళ్ళ కసలు సెన్స్ ఆఫ్ హ్యూమర్ లేదు. పెళ్ళ యిన తర్వాత నేర్పించాలి, అనుకుంటూ లోపలికొచ్చాను.

పెరట్లో మొహం రుద్దుకుంటూంది తను.

'అంతగా మొహం రుద్దకు. అరిగి పోగలదు' అన్నాను.

'అరిగిపోతే కొత్త సబ్బుందిలే' అంది నిర్లక్ష్యంగా.

'సబ్బుకాదు అరిగేది. నీ మొహమే' అని అక్కడనుంచి వచ్చేసాను.

ఎందుకన్నానా అనిపించింది. తనుకట్టుకు కాబోయే మొగుడ్ని పట్టుకుని అట్లా అన వచ్చా? అయినా నేనేమంత కానిమాట అన్నాను? జోకులు ఎలా తీసుకోవాలో నేర్పిస్తున్నా అని సర్ది చెప్పుకున్నాను.

ఆ రాత్రి భోజనాలయిందరాత మళ్ళీ కబుర్లలోపడ్డాం.

'అవును తర్వాత ఏంచేద్దామనుకుంటు న్నావు?' అనడిగాను నేనువచ్చిన పనికి నాందిగా.

'సీటువస్తే మెడిసిన్.'

లేకపోతే పెళ్ళా?? అనందామనుకున్నా గాని పాపం మరీ చిన్నపిల్ల సిగ్గుపడిపోతుంది కదాని వూరుకున్నాను. అయినా కొన్ని నీతులు బోధించి వదలిపెడదామని.

'మెడిసిన్‌లో సీటంటే తమాషాకాదు. బాగా చదవాలి. కనీసం హై సెకండుక్లాస్ రావాలి తెల్సా?' అన్నా.

'సర్లే ఇన్ని కబుర్లు చెప్తున్నావ్? నీకు పి.యు.సీ.లో ఏ క్లాసొచ్చింది?'

'హైథర్డ్ క్లాస్‌లే.'

'హైథర్డ్ క్లాసేమిటి బావా' అంటూ గంటసేపుదాక నవ్వుతూనేవుంది. నాకు చెడ్డకోపం వచ్చేసింది. యాభయిఏనిమిది అలా వచ్చినప్పుడు హై సెకండు క్లాసు వున్నప్పుడు, నలభైఏనిమిదివస్తే హైథర్డ్ క్లాస్ అనకూడదా.

అసలీ అమ్మాయికి బుద్ధిపూజ్యం. ఏదో పోనీ, మామయ్య కూతురుకదాని బోలెడు జోకులేద్దామనుకున్నాను. కాని పెళ్ళికాక ముందే ఈ అమ్మాయి యిలా మాటకు మాట జవాబిస్తూంటే ఆమూడు ముళ్ళు పడితే నా నోరు కదపనీదు.

ఇలా అయినవారి సంబంధం బెడిసి కొట్టింది.

'నిక్షేపంలాంటి సంబంధం చేసుకోనంటాం నేరా పాపి!' అంది బామ్మ.

'నీకు తెలియదు వూరుకో నేనొప్పుకున్నా సైన్స్—అదే జెనటిక్స్ ఒప్పుకోదు. పుట్టే పిల్లలు తెలివి హీనులుగా అంద హీను లుగా వుంటారు.'

మరి మన విజయమ్మ పిల్లలు అందంగా లేరూ వాళ్ళూ మేనత్త, మేనమామపిల్లలు కారూ?!' అని దృష్టాంతాలు చూపింది బామ్మ.

ఇంకా రెండు సంబంధాలు వున్నాయికదా. ఇది పోతేపోనీ అని బామ్మ నూరడించాను.

ఈసారి నన్ను ఒంటరిగా పంపించ డానికి సుతారామూ ఒప్పుకోలేదు బామ్మ. ఎందుకో మా అమ్మకూడా వద్దామను కుంది. కాని సమయానికి అంటే ఒయ్యే ల్సినరోజున నడుము పట్టేసుకుంది. మా నాన్నకేదో ఆఫీసు పని తగిలింది.

'పోనీ! మా స్నేహితుడిని వెంటబెట్టు కెళ్తాను' అన్నాను.

అయిష్టంగానే ఒప్పుకున్నారు ఇంట్లో వారు.

ఆ స్నేహితుడి పేరు సాయి. పిడొట్ట

# టాప్ రహస్యము!



క్రొత్త బినాకా టాప్‌లో మాత్రమే ఒక రహస్యమైన పదార్థము ఉంది కనుక యీ టూత్ పేస్టు మీ నోటిలో అన్ని మూలలకు, పళ్ల మధ్య చిన్న చిన్న సందులలోనికి చొచ్చుకొని పోయి, ఆ చోట్లలో ఉన్న సూక్ష్మ క్రిములను నాశనము చేస్తుంది. అందుకనే మీ నోరు రోజంతా సంపూర్ణముగా శుభ్రముగా, పూర్తిగా తాజాగా ఉంటుంది. అలా మీ నోటి ఆరోగ్యమునకు సంపూర్ణ రక్షణ కలుగుతుంది!

ఈ నిదర్శనమును మీరు చూడగలరు! పరిశోధనాగారములో జరిగే యీ పరీక్షను నేడే మీ యింట్లో చేసి చూడండి!



ఒక గాజు గిన్నెను తీసుకొని దానిలో నీరు పోయండి. బొగ్గు గుండను లేక రంగు పౌడరును నీటి మీద చల్లండి.



బినాకా టాప్‌ను కొంచెము నీళ్లలో కలపండి. ఆ ద్రావకము ఒక చుక్కను గాజు గిన్నె మధ్యలో వేయండి.



బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకు చేరి మురికిని పోగొట్టి, ఉపరితలమును స్వచ్ఛముగా, తేటగా చేస్తుందో మీరే చూడండి.




## బినాకా టాప్
సంపూర్ణ నోటి రక్షణ యొక్క రహస్యము

అనాయకుడు అన్నీ తెలుసుననుకొంటాడు కాని వాడికేం తెలియదు.

ఇద్దరం కలిసి రాజమండ్రికి వచ్చాము. సామాన్లు లాడ్జిలో పారేసి, ట్రిమ్ గా తయారయ్యాము, సాయి నాకంటె ఎక్కువగా తయారయ్యాడు. నే తెచ్చుకున్న పౌడరంతా వాడే వాడేసాడు. వద్దని చెప్దామనుకున్నా గాని బాధపడతాడేమోనని వూరుకున్నాను. ఇద్దరం కలిసి ఆ అమ్మాయి వాళ్ళుండే ఇల్లుకోసం వేట ప్రారంభించాము.

అదేమి వూరో ఒక్క ఇంటినెంబరు వరసన లేదు. ఇరవై రెండు నెంబరు ఇంటి పక్కన పట్టైయారు నెంబరున్న ఇల్లు. దానిపక్కన ఇంటినెంబరు వందలమీద ఉంది. మా అవస్థ చూసి వో ఆసామి జాలి పడి వాళ్ళింట్లో కుర్రాడిని పిలిచి వాసుదేవరావుగారి ఇల్లు చూపించి రమ్మన్నారు. కుర్రాడితో కలిసి ముగ్గురమవుతాము. అలా వెళ్ళటం నా కిష్టం లేదు.

'కుర్రాడెందుకండీ. అనవసరపు శ్రమ. ఇంటి గుర్తులు చెప్పండి చాలు' అన్నా.

'శ్రమేమిటండీ. మీకీ ఊరు కొత్త. అన్నీ సందులు, గొందులు ఫర్వాలేదు. తీసుకెళ్ళండి' అన్నారాయన.

ఇక తప్పేది లేక ఆ అబ్బాయి తో బయలుదేరాము. చటుక్కున వో ఆలోచన వచ్చింది. రిక్షాలో వెళితే సరి. రిక్షాఅబ్బితో కలిసి నలుగుర మవుతాము.

'రిక్షాలో పోదామా ?' అన్నా కుర్రాడితో.

'ఈ సందుల్లో రిక్షాలు పట్టవు సార్. నడిచే పోదాం' అన్నాడబ్బాయి.

సాయి నా బాధ గమనించి, 'ఏమిటోయ్ నీ చాదస్తం మహా, మహా రాజ్యాంగ చట్టాలనే సవరిస్తున్నప్పుడు, శాస్త్రాలను సవరించలేమా? వో రాయి తీసి నీ జేబులో వేసుకో. నలుగురమైనట్టు లెక్కవుతుంది' అన్నాడు.

వో రాయి తీసి జేబులో వేసుకొని నడక ప్రారంభించాము. వో రెండు, మూడు సందులు తిప్పి 'ఆ కనబడుతున్న పచ్చ గేటే సార్ వాసుదేవరావుగారిల్లు' అని వెనక్కెళ్ళి పోయాడు. ఆ అబ్బాయి వెళ్ళంగానే రాయి తీసి పారేసాను.

గేటు తీసి అడుగు పెట్టీ పెట్టంగానే వో కుక్క భౌమంటూ మా మీద కొచ్చి

# వధువు కావలెను

పడింది. అది కుక్కలా లేదు. తోడేలులా ఉంది. అది ఎగిరి నా షర్టు పట్టుకొంది. సాయి నన్ను గభాలున పక్కకు లాగాడు. కాని అప్పటికే జరగవలసిన అనర్థం జరిగి పోయింది. సాయి నన్నలా లాగడంతో నా షర్టులోని కొంతభాగం దాని నోట్లో ఉండి పోయింది.

ఇంతలో వో ముసలాయన 'షెయ్ టైగర్' అని అరవటం అది పిల్లిలా లోపల కెళ్ళి పోవటం జరిగింది.

నేను గబగబ చొక్కాయి ప్యాంటు లోకి తోసి 'టక్' చేసాననిపించాను.

'ఎవరు కావాలండీ?' అనడిగా రాయన, మమ్మల్ని పరిశీలనగా చూస్తూ. నేను మాట్లాడబోయాను. కాని గుండె దడ తగ్గక పెదవులుమటుకు కదిలాయి. మాట బయటకు రాలేదు.

సాయం చేయమని సాయిని మోచేత్తో పొడిచాను. వాడి పరిస్థితి ఇంచు, మించు ఇలాగే ఉంది. నగర్చుకొంటూ 'పేరు... సుబ్బారావు ... శేషాచలం గారబ్బాయి ...' అన్నాడు.

వెంటనే ఆయన మొహం మతాబులా వెలిగింది.

'ఓ మీరా! రండి...రండి' అంటూ లోపలకు తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు.

'ఇంట్లో అంతా కులాసానా బాబూ'

'కులాసాయేనండీ' అన్నాను.

'మీ నాన్నగారు బాగున్నారా?' అన్నా రాయన సాయి నుద్దేశించి.

సాయి నాన్నగారిని ఈయనెట్లా ఎరుగుదురబ్బా అని రవంత ఆశ్చర్యపోయాను.

కాసేపు అదీ, ఇదీ మాటాడినాక ఆయన 'అమ్మాయిని రమ్మనవే' అని లోపలకు కేక పెట్టారు.

మరో క్షణంలో గుమ్మం దగ్గర తల వంచుకొని వో అమ్మాయి ప్రత్యక్షమైంది.

మరీ అంత సిగ్గేమిట్రా అనుకొన్నాను. అసలు సంగతి వెంటనే తెలిసి పోయింది. సిగ్గు మాట అటుంచి. ఆ అమ్మాయి తలెత్తి నిటారుగా నిలబడిందంటే గుమ్మం తగులుతుంది. నట్లేటు వేసిన మొక్కలా ఎదిగిందా అమ్మాయి.

వో వేళ ఆ అమ్మాయి నమస్కరిస్తే ప్రతి నమస్కారానికి నేను మునికాళ్ళ మీద లేచి చేతులు పైకెత్తాలి. కాని దైవవశాత్తు ఆ అమ్మాయి నమస్కరించే స్థితిలో లేదు. రెండు చేతుల్లో రెండు పళ్ళేలు ఉన్నాయి.

'రామ్మా, జయా!' అన్నారు వాళ్ళ నాన్న. ఆమె చెరో ప్లేటూ అందించి కుర్చీలో కూర్చుంది.

సాయి కిచ్చిన పళ్ళెంలో ఫలహారాన్ని ప్రత్యేకించి వేసిన జీడి పప్పు, ద్రాక్షపళ్ళు ఎక్కువగా కనిపిస్తున్నాయి. నా కిచ్చిన పళ్ళెంలో అన్నీ సాదాగానే ఉన్నాయి. ఇలా ఇవ్వటంలో వాళ్ళ ఉద్దేశ్యం ఎంత కొట్టుకు చచ్చినా అర్థమై చావలేదు. కాని, ఆ అమ్మాయి ఓర చూపులు, వాళ్ళ నాన్న మాటలతో అసలు సంగతి బయట పడి పోయింది.

వీళ్ళు సాయిని పెళ్ళికొడుకు కింద జమ కట్టుకొన్నారు. వాడు మటుకు ఇవేమీ గ్రహించకుండా కూర్చుని ఫలహారం మింగుతున్నాడు.

ముసలాయన కూతురు గురించి గొప్పలు చెప్పుకొన్నాడు. 'మా జయ అన్నింటిలోనూ ఫస్టేనండీ. మొన్న బియ్యే యూనివర్సిటీ ఫస్ట్ వచ్చింది. ఇక ఆటలంటారా, ఈ మధ్య లేడీస్ క్లబ్బులో జరిగిన మ్యూజికల్ ఛెయిర్సులో ఫస్టు. ఇక వంటల సంగతి...'

ఈ సాయిగాడు నన్నేదో పొగడటం అనుకొని నాకు, ఆ అమ్మాయికి తారతమ్యాలు చూపిస్తున్నాడు.

'పరీక్షల్లో మీ అమ్మాయి మొదటిదైతే, పరీక్ష హాల్లోంచి బయట కొచ్చిన వాళ్ళలో మావాడే మొదటివాడు. మ్యూజికల్ ఛెయిర్స్‌లో మీ అమ్మాయి ఫస్టయితే, మా వాడూ వచ్చాడు ఫస్టు ఎటొచ్చీ అందరి కంటె ముందుగా బయటకు. వంటల్లో జయ గారు ఫస్టయితే తినటంలో వాడు ఫస్టు...'

నన్నో జోకరు కింద చూసి వాళ్ళిద్దరూ పగలబడి నవ్వారు. నాకు ఒక్క క్షణం అక్కడ వుండ బుద్ధి కాలేదు.

'పోదామా?' అన్నా సాయితో.

పిల్ల తండ్రి గేటుదాక సాగ నంపారు.

'ఒక్కమాట సార్' అన్నా ఆయనతో ఏమిటన్నట్టు చూసారు.

'మీరింతవరకు పెళ్ళికొడుకనుకుంటున్న

అబ్బాయికి ఇదరు పిల్లలు. భార్య కూడా ఇంకా బతికే వుంది. అసలు పెళ్లి చూపుల కొచ్చింది నేను' అని గబ గబ ముందుకెళ్లి పోయాను. ఆయన మొహం లోని రంగుల మార్పులు మీకు చెప్పక పోడానికి నేను మళ్లీ వెనకకు చూడకుండా వూరి కొచ్చేయటమే కారణం.

ఇలా రెండు సంబంధాలు పోవటంతో ఇంట్లో వారంతా నా మీద విరుచుకు పడ్డారు.

నిన్ను పెళ్ళిచూపుల కంపటం తప్పన్నారు.

నాకసలు పెళ్ళయ్యే రాత లేదన్నారు.

మేమే ముహూర్తాలు కూడా నిర్ణ యించి పిలుచుంటే బాగుండే దన్నారు. ఇలా నానా దుర్భాషలు ఆడారు.

ఆ ఆవత్సమయంలో రెడ్డి గుర్తు కొచ్చాడు. రెడ్డి, నేను స్కూలు ఫైనలు దాక కలసి చదువు కున్నాము. తెలివిగల రెడ్డి విద్య కన్న, సేద్యమే గొప్పదని గ్రహించి వాళ్ళ వూరెళ్ళి పోయాడు. ఊళ్లు దూరమైనా మా స్నేహం మటుకు దూరం కాలేదు. వెంటనే రెడ్డి సహాయం అర్థిస్తూ వాళ్ళ వూరికి ఉత్తరం వ్రాసాను. మూడోరోజు కల్లా రెక్కలు కట్టుకు వాలాడు.

పరిస్థితి అంతా వివరించాను.

'అసలీ పెళ్ళి చూపులంటేనే నాకు కిట్టదోయ్' అన్నాడు రెడ్డి.

'మరెలా? మా ఇంట్లో వాళ్ళూరు కోరే?'

'వాస్తవ్స్ పెళ్ళి చేసుకునేది నువ్వా, వాళ్ళా? అసలిలా నాలుగు గోడల మధ్య జరిగే ఈ తంతువల్ల నీకు ఆ అమ్మాయి గుణగణాలు ఏం తెలుస్తాయి?'

'నిజమే, కాని మరేం చెయ్యటం?'

'అందుకే నే చెప్పినట్లు చెయ్యి ముందు. ఆ అమ్మాయి ఫోటో, పేరు, చదువు, ఇంకా ఏవైనా వివరాలుంటే, అన్నీ నాకి య్యి. రేపే వాళ్ళవూరి కెళదాం. ఈ విషయం వాళ్ళకు తెలియనీకు. ఇక పెళ్లి చూపులు నేనో కొత్త పద్ధతిలో నడిపిస్తా. సరేనా?'

'సరే' అనక తప్పలేదు.

ఇద్దరం విశాఖపట్నం చేరుకున్నాము.

'సాధారణంగా ఇంట్లో పులిలా వుండే వారు బయట పిల్లిలా వుంటారు, ఇంట్లో పిల్లిలా వుండేవారు, బయట అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తారు. కాబట్టి అసలు రంగు కనుక్కోవాలంటే కాలేజీ కెళ్లి చూద్దాం.' అన్నాడు రెడ్డి.

ఐడియా నచ్చింది నాకు. ఇద్దరం వాళ్ళ కాలేజీకి వెళ్ళాము. బజారు కంటె అధ్వాన్నంగా వుంది క్లాసు. అల్లరి చూచి లెక్చరర్ ఎవరూ లేరేమో అనుకున్నాను. కానీ అంచనా తప్పయింది. ఎవరో ఆడ లెక్చరర్ బోర్డుమీద ఏదో వ్రాస్తూంది. పిల్లలు ఎవరికి వారు కబుర్లు చెప్పు కుంటున్నారు.

మమ్మల్ని చూడగానే ఒక్కసారి క్లాసులో అల్లరి తగ్గి గుసగుసలు మొదలయ్యాయి.

బోర్డుమీద వ్రాయటం మాని గుమ్మం వేపు చూసింది ఆవిడ.

'ఎవరు కావాలి?'

'మిస్ లక్ష్మి'

'ఏ లక్ష్మి? పూర్తిపేరు చెప్పండి. ఇక్కడ గజలక్ష్మి, జయలక్ష్మి, శ్రీలక్ష్మి, జ్యోతిలక్ష్మి, శాంతలక్ష్మి, ఆదిలక్ష్మి ఇంకా ఇలా పదిమందిదాక వున్నారు. మీకే లక్ష్మి కావాలి?' అంది.

పచ్చి వెలక్కాయ గొంతులో చిక్కి నట్లయింది.

పూర్తి పేరు తెలుసుకోనందుకు చాలా విచారపడ్డాను ఆక్షణంలో.

'మీ లక్ష్మికి ముందు, వెనక తల, తోక ఏమీలేదా?' అందామె అందరూ కిచకిచ మన్నారు. తలలు లేకపోయినా తోకలు మటుకు వున్నాయి.

తల కొట్టేసినట్లయింది. ఇద్దరం బయటకొచ్చాము.

'ఇక పెళ్లి చూపులొద్దు, ఏమొద్దు. జరిగిన అవమానం చాలు. ఇంటికి పోదాం పద' అన్నాను.

'ఇదీ ఓ అవమానమేనా? నేనెప్పుడు పరీక్ష వ్రాయటానికెళ్ళినా విద్యార్థులంతా నన్నే చూచరనుకొని నిలబడుతూండేవారు. ఆ అవమానానికంటే ఇదేమైనా ఎక్కువా?' అన్నాడు రెడ్డి.

నిజమేననిపించింది.

'అయితే ఇప్పుడు కాలేజీలో అమ్మాయి ప్రవర్తన బాగులేదని తేలిందా?'

'నేనట్లా అన్నానా? ఒకరిద్దరు నచ్చితే మొత్తాన్ని చెడ్డ లిస్టులోకి తోసెయటం న్యాయంకాదు. జరగవలసిందంతా ముందుంది. ఒకసారి అడ్రసు ఇవ్వు' అని నన్ను లాడ్జిలో వుండమని తను వధువు అన్వేషణకై వెళ్లాడు.

ఇకవిసాదట ప్రతివారిలో మెంచే మూడా అని నిశ్చయానికొచ్చాను.

రెండు, మూడు గంటలతర్వాత వగర్చుకుంటూ వచ్చాడు రెడ్డి.

ఏమ్మిటా ఏమన్నా తెల్సిందా? అవడిగాను.

'ఆహా. పూర్తి పేరు శ్రీ గజలక్ష్మి.'

'సాక్షాత్తు లక్ష్మీదేవన్న మాట.'

'కొద్దిగా లావు'

'బొద్దుగా ఉందను'

'కొంచెం నలుపు'

'కృష్ణుడు కుంచెడు నలుపు'

'తలలో తెల్ల వెంట్రుక లక్కడక్కడ'

'ఫర్వాలేదు. మల్లెపూలు పెట్టుకొంటే తెలియదు.'

'అయితే ఆ అమ్మాయి నీకు నచ్చిందన్న మాట. ఆ అమ్మాయి నిన్ను మెచ్చటమే తరువాయి. నీకు, ఆ అమ్మాయికి సాయంకాలం బీచ్ మీటింగ్ ఏర్పాటు చేసానోయ్' అన్నాడు రెడ్డి.

గుండె గుభేలుమంది.

'ఒంటరిగానా?'

'ఒంటరిగా కాదులే. నేనూ వస్తాను. అయినా ధైర్యే సాహసే లక్ష్మి అన్నారు పెద్దలు' అని ధైర్యం నూరిపోసాడు.

సాయంకాలం అయిదు గంటల కంతా

# వధువు కావలెను

రామకృష్ణ మిషన్‌కు చేరుకొన్నాము.

సరిగ్గా ఆరు గంటలకు వెంట నలుగు రమ్మాయిలు తోడురాగా ట్రాన్సిస్టరు లోని వార్తలతోపాటు వచ్చేసింది.

'ఈమె లక్ష్మిగారు...వీడు సుబ్బారావు...' రెడ్డి పరిచయం చేసాడు.

ఆ అమ్మాయిని చూడంగానే విశాఖపట్నం వెళితే సింహాచలం నుంచి పనస పండు వ్రటమ్మని మా బామ్మ చెప్పిన మాటలు గుర్తుకొచ్చింది.

కారణం పనస తొనలా నవ నవ లాడటం కాదు. పనస పండులా ఆవిడ గున గున లాడటం.

ఆమె వెంట వచ్చిన స్నేహితురాళ్ళను పరిచయం చేసింది.

'ఇది వీణ...ఇది వాణి...ఇద్దరూ మెడికోలు. ఇది సుశీల...ఇది సరోజ...నాక్లాస్ మేట్స్.'

ఆ కాబోయే డాక్టరమ్మలిద్దరూ నన్ను పేషెంటును చూసినట్టు చూసారు. మిగిలిన ఆ ఇద్దరు 'డిసెక్షన్' చేయబోయే ముందు జంతువును చూసినట్లు చూసారు.

'నాకు దాహం వేస్తోంది.' స్వగతంలా అందో అమ్మాయి.

'కాంటీనుకు పోదాం రండి' అన్నాను.

ఆరు మంది క్యాంటీను కెళ్ళాము.

'మనవాళ్ళు పెళ్లి చూపుల విధానాలను మార్చుకోవాలి.' రెండో ప్లేటు చిప్సుకు ఆర్డరిస్తూ అంది కళ్ళజోడమ్మాయి.

ఆడపిల్లంటే ఆట బొమ్మనా? పెళ్లి కొడుకువచ్చి చూస్తే చాలదన్నట్లు అతగాడి బంధువులు, పిల్లాజెల్లా అందరూ కలిసి ఓ లారీడు మంది వచ్చి కాఫీ టిఫిను తెరగా లాగేసి. తీరా పూరి కెళ్లి నచ్చలేదంటూ ఓ కార్డు ముక్క వ్రాసి పారేస్తారు' ఆవేశంగా అంది, కాఫీ చేసిన మూడో ప్లేటు జీడిపప్పు ముందుకు తన్నూ, ఓ రెండు జడలమ్మాయి.

'ఇప్పుడందుకు భిన్నంగానే జరుగుతూంది కథ!' అన్నాడు రెడ్డి. అందరూ ఒక్కసారి తినటం ఆపి రెడ్డిని తినేసేలా చూసారు. నాకొళ్ళంతా చెమటలు పోసేసాయి.

ఆ బల్లమీద కాసేపు నిశ్శబ్దం తాండవించింది.

'ఇక పోదామా! కాసేపు అలా ఇసుక మీద కూర్చుందాం' అన్నాను.

ఒక పదినోటు కొన్ని చిల్లర నోట్లు సమర్పించుకొని బయటకు వచ్చాను, బ్రతుకు జీవుడా అనుకుంటూ.

జన సమ్మర్దం లేనిచోట కూర్చున్నాము.

'ఈ వరకట్న పిశాచి ఈ దేశాన్ని ఎప్పుడు వదుల్తుందో' కయ్యానికి కాలు దువ్వుతున్నట్లు అంది లక్ష్మి.

'నాకు తెలియదండీ. బహుశా మరో వందేండ్లు పట్టొచ్చనుకుంటున్నాను' అన్నా.

'వంద కాదు కదా. వెయ్యేండ్లయినా మీ మగవారి నైజం మారదు.' తెలిసీ నన్ని ప్రశ్న ఎందుకేసింది?

ఇంతలో ఇంకో అమ్మాయి అందుకుంది.

'ఒంటరిగా కనబడ్డ ఆడపిల్లను ఏడిపించే ప్రబుద్ధుల నేం చేయాలి?'

'తెలియదండీ. నేను 'లా' చదవలేదు'

'ఉప్పు పాతర వేయాలి. పారిస్‌లో అదే, చేస్తారు' తనెళ్ళి చూసొచ్చినట్టుంది ఆ అమ్మాయి.

'మీరిచ్చిన సలహా బాగానే వుంది. కాని ఇలా చేస్తూపోతే కొన్నాళ్లకు ఉప్పు వెల చక్కెరధరను మించిపోతుందేమో' అనుమానాన్ని బయటపెట్టాడు రెడ్డి.



'మీకెలాటి పెళ్ళి ఇష్టం? అగ్ని సాక్షి, గుడిలో పూజారి సాక్షి, దేవుడు సాక్షి. పెళ్ళిళ్ళు అంటే నా కొళ్ళు మంట. రేపే దైనా జరిగితే కోర్టుకొచ్చి వీరిరువురూ భార్యాభర్తలని చెప్పగలరా? అందుకనే సింపుల్‌గా రిజిష్టర్ మ్యారేజి ఏంతో నయం' అంది గజలక్ష్మి.

ప్రశ్న, జవాబు ఆవిడే చెప్పినందుకు కొంచెం ఊపిరి తీసుకున్నాను.

'మరి బంధువులకు స్నేహితులకు పెండ్లి జరిగిందనెట్లా తెలిసేది?'

'ఏముంది. ఓ హోటల్లో వందమందికి డిన్నర్ ఏర్పాటుచేసేస్తే సరి' అంది కళ్ళజోడు.

'అయ్యో! డిన్నరంటే బోలెడు డబ్బు అందులో సగం డబ్బు వెచ్చించి బీదవాళ్ళకు అన్నదానం చేస్తే సేరు, ప్రఖ్యాతి పుణ్యం, పురుషార్థం' అన్నాడు రెడ్డి.

'అయ్యా రెడ్డిగారూ! మీరు కాసేపు వూరుకోండి. మాక్కావల్సింది రావుగారి అభిప్రాయం' అందామె కళ్ళెరచేసి తరువాత అందరూ కలసి నామీద ప్రశ్నలవర్షం కురిపించారు.

'స్త్రీకి ఆర్థిక స్వాతంత్ర్యం అక్కరలేదా?!

'పెళ్ళికాని పిల్ల మాతృత్వానికి నోచుకోకూడదా?!

'ఆధునిక యుగంలో స్త్రీపాత్ర ఏమిటి?'

ప్రశ్నల హోరులో పక్కనవున్నది సముద్రమన్న విషయమే మరిచిపోయాను. డిబేట్సులో ఇచ్చే సమస్యలన్నీ నాముందుపెడితే నేనేం జవాబీగలను?

వాళ్ళ ప్రశ్నలకు బుర్ర తిరిగిపోయింది. చెవులు పనిచేయటం మానేసాయి. కళ్ళు తిరిగిపోయాయి.

కళ్ళు తిరిగి యథాస్థానానికి వచ్చేసరికి డామ్మగొంతు కంచులా మోగుతూంది.

'...అవ్వ! వాళ్ళు ఆడపిల్లలేనా? కుర్రాడిః చేసి అన్నేసి మాటలంటారా! పిచ్చి వెధవ జడుసుకున్నాడు....కో అంటే కోటిమంది ఆడపిల్లలు. వెధవ సంబంధం పోతే పోయింది ...అమలాపురం సంబంధం క్షేమంగా వుంటుంది...' ఇంకా ఏదో అంటుంది.

నేను మటుకు ఇకప్పుడే పెళ్ళిచూపులకెళ్ళదలచుకోలేదు. మరోవారానికల్లా ప్రముఖ దినపత్రికలలో 'వధువు కావలెను' అన్న శీర్షికకింద నా వివరాలు పడిపోవచ్చాయి.

# కొన్ని సామాన్య వ్యాధులకు పథ్యాపథ్యములు

## సవాయి రోగులకు పథ్యాపథ్యములు

**పథ్యములు :**

సవాయి (సిఫిలిస్) రోగం గలవారు మంచి ప్రాత బియ్యపు అన్నంలో కందిపప్పుగాని, దాని కట్టుగాని, కలుపుకొని ఆవునెయ్యి వేసుకుని భుజించవచ్చును. లేత ముల్లంగి, పొట్లకాయ, బీరకాయల కూరలు తిన వచ్చును. ఆవు మజ్జిగా అన్నం తినవచ్చును. ఆరోగ్యవంతమైన మేక మాంసం తినవచ్చును. త్రాగుటకు బాగా మరగబెట్టి చల్లార్చిన నీరు వాడుతూండాలి.

**అపథ్యములు :**

సవాయి రోగం గలవారు క్రొత్త బియ్యపు అన్నం, చల్దన్నం తినకూడదు. ఉలవపప్పు, ఉలవగుండ అన్నంలో కలుపుకొని తినకూడదు. పెరుగూ అన్నం తినకూడదు. నూనె పిండి వంటలు తినకూడదు. అన్నంలో నూనె వేసుకోడం మానెయ్యాలి. వేపుడు కూరలు తినకూడదు. ఆవకాయ నంజుకో కూడదు. తియ్య గుమ్మడికాయ కూర తినకూడదు. మామిడికాయలు తినకూడదు. బాతు, కోడి పంది వీని మాంసాలు తినకూడదు. గాలిలో తిరగడం, చల్లని నీళ్ళు త్రాగడం, చల్లని నీళ్ళలో స్నానం చెయ్యడం, మైథునం యివన్నీ యీ రోగం గలవారికి అపథ్యములే.

(దేహమున నల్లగ స్ఫోటకపు పొక్కుల వలె బయలుదేరెడి 'చిట్లఫిరంగి' అనబడు సవాయి రోగం గలవారికి కూడా యివే పథ్యాపథ్యములు.)

## కోరుకు వ్యాధి గలవారికి పథ్యాపథ్యములు

**పథ్యములు :**

మంచి పాత బియ్యపు అన్నం, బార్లీ బియ్యపు అన్నం, గోధుమఅన్నం, గోధుమ రొట్టెలు, తినవచ్చును. కందిపప్పు, పెసర పప్పు, పెసరకట్టు అన్నంలో కలుపుకొని తినవచ్చును. బీరకాయకూర, పొట్లకాయ కూర, బూడిదగుమ్మడికాయ కూర, లేతముల్లంగి దుంపకూర, లేత మునగకాయకూర, అరటి కాయకూర, మట్టు బచ్చలి కూర, అరటి పువ్వుకూర, తినవచ్చును. చేదు, వగరు రుచి గల రసములు త్రాగవచ్చును. మరిగించిన బావినీళ్ళు త్రాగడం మంచిది.

**అపథ్యములు:**

గురుకరాన్నం, చల్దన్నం, తినకూడదు. బెల్లం పులుసు పెట్టి వండిన కూరలు తిన కూడదు. పుల్లని పెరుగు, మజ్జిగ, త్రాగ కూడదు. తియ్య గుమ్మడికాయ కూర తిన కూడదు. మూత్రవేగాన్ని నిరోధించకూడదు. ఎక్కువ శ్రమకరమైన పనులు చెయ్య కూడదు. స్త్రీ సంగమం, పగటినిద్ర, వ్యాయామం మానెయ్యాలి.

## సెగరోగులకు పథ్యాపథ్యములు

**పథ్యములు:**

సెగరోగం, (గనేరియా) గలవారు మంచి పాత బియ్యపు అన్నాన్నే తింటూండాలి. కందిపప్పు, పెసరపప్పు, పెసరకట్టు అన్నంలో కలుపుకొని తినవచ్చును. బీరకాయకూర, పొట్లకాయకూర, అరటికాయకూర, లేత ముల్లంగి దుంపకూర, టొమాటో కూర, ముల్లంగి ఆకులకూర, పెరుగు తోటకూర, తినవచ్చును. నీరుల్లిపాయలు తినవచ్చును. శర్కర, కలకండ, తాటికలకండ, మేకమాంసాన్ని తినవచ్చును.

**అపథ్యములు:**

నైత్యం, కాక, చేసెడి ఏ పదార్థాలు తినకూడదు. క్రొత్త బియ్యపు అన్నం తినకూడదు. ఉలవపప్పు, ఉలవకట్టు, ఉలవ గుండ అన్నంలో కలుపుకొని తినకూడదు. కొయ్యతోటకూర, కాకరకాయ కూర, తియ్య గుమ్మడికాయకూర తినకూడదు. మామిడికాయలు, ఆవకాయ తినకూడదు. బాతు, కోడి, పంది, వీటి మాంసాన్ని తినకూడదు. మరిగించని బావినీళ్ళు త్రాగకూడదు.

సేకరణ: ఆకుండి నారాయణమూర్తి






# 2

బస్సులోనుండి దిగీ దిగగానే అతడి కెదురుగా రెండు బోర్డులు కన్పించాయి. ఒకటి 'మద్ది బాలా త్రిపుర సుందరి గవర్నమెంటు పాలీటెక్నిక్ కాలేజి' అని వుంది. రెండోది 'ఆంధ్రా యూనివర్శిటీ పోస్టు గ్రాడ్యుయేట్ సెంటర్—గుంటూరు' అని వుంది. ముగ్గురూ 'స్పెషలాఫీసర్. పి. జి. సెంటరు — అన్న యారో మార్కును బట్టి లోపలికి వెళ్ళారు. పి, జి. సెంటరు పాలీటెక్నిక్ కాలేజికని కొత్తగా కట్టిన భవనంలో పెట్టారు. ఆ భవన నిర్మాణం యింకా పూర్తి కాలేదు. ఎక్కడ చూసినా సిమెంటు దుమ్ము. హడావుడిగా తిరుగుతున్న పనివారు, వైరింగు పూర్తికానందున చుట్టలు చుట్టలుగా పడున్న వైర్లు, జంపర్లు కొడుతున్నందున 'ధన్ ధన్' మని చెవులు చిల్లులు పడే చప్పుళ్ళు... ఆ కాలేజి పది రోజుల్లో తెరుస్తారంటే నమ్మ శక్యం కాకుండా వుంది.

అక్కడ జీతం కట్టడానికి వచ్చినవాళ్ళు మరో పదిమంది దాకా వున్నారు. జీతం కట్టడానికి వెళ్ళబోతూ, మళ్ళీ ఒక్కసారి సత్యం ముఖంలోకి చూచాడు విద్యార్థి ఏం చెయ్యమంటావన్నట్లు ... అతడింకా సందిగ్ధంలోనే వుండడం చూసి నవ్వొచ్చింది సత్యానికి.

'సి యిష్టంరా ...' అన్నాడు సమాధానంగా.

లోకన్‌బాబు కూడా యించుమించు అదే అభిప్రాయం వెలిబుచ్చాడు.

వాళ్ళిద్దరూ లోపలికి వెళ్ళిపొయ్యారు... విద్యార్థికి ఏటు పాలు పోలేదు ... తల్లికి చెప్పకుండా, తల్లి యిష్టానికి వ్యతిరేకంగా చేరడం సాహసమేమోననిపిస్తోందతడికి ... కానీ అంతదూరం వచ్చాక వెనుకాడడం, చిన్నప్పటి నుండీ వున్న తన అభిలాషను ఆశయాన్ని వదులుకోడానికి కూడా మనసొప్పటం లేదు విద్యార్థికి.

చివరికి ఏమైతే అయిందని అతడూ లోపలకు వెళ్ళాడు. 'స్పెషలాఫీసరు'తో యింటర్వ్యూ అయిపొయ్యాక అతడు జీతం కట్టడానికి వచ్చాడు.

'మీ పేరు ?' ప్రశ్నించాడు అక్కడున్న క్లర్కు.

'రమేష్ చంద్ర విద్యార్థి.'

తర్వాత డిపార్ట్‌మెంట్ అదీ అడిగాడు ... అతడిచ్చిన రశీదు పూర్తిచేసి జీతం కట్టబోతుంటే విద్యార్థి చేతులు వణికాయి. జేబులో చెయ్యి పెట్టిన అతడ్ని మళ్లీ ఎన్నో భయాలూ, సంకోచాలూ చుట్టుముట్టాయి...ఈచదువు సాగేదేనా?.. లేక అమ్మ అన్నట్లు... తను అనవసరంగా డబ్బు వృధా చేస్తున్నాడా?...

అతడు ఆలోచనలో వుండగానే, 'అర్జెంటు వాళ్ళు నూటనలభై యారూ, యాభై కట్టాలండీ' అంటూ డబ్బు అందుకోడానికి చెయ్యిచాపాడు క్లర్కు.

జేబులో వున్న విద్యార్థి చెయ్యి యాంత్రికంగా రెండువందరూపాయిల నోట్లు తీసి అందించింది. అతనికిమాత్రం ...ఎక్కడో ఎవరో తుమ్మినట్లు, గడియారం గంటలు అలాగంటకొట్టినట్లు అనిపించింది. అది భ్రమో నిజమో అతడికే తెలియదు. రశీదు తీసుకుని బయటకు వస్తుంటే అతడికి మొయ్యలేని బరువేదో నెత్తికెత్తుకున్నట్లు అనిపించింది, బరువుగా బయటకు నడిచాడు... అక్కడ అప్పటికే సత్యం, లోకన్ వచ్చివుండడంతో ముగ్గురూ కాలేజిదాటి బస్సుకోసమని రోడ్డు మీద చింతచెట్టుక్రింద నిలబడ్డాను.

చుట్టూచూస్తే...ఆ మధ్యాహ్నపు ఎండలో నీలిచీరలు కట్టుకున్నట్లున్న కొండబారులు, విధికి ఎదురాడి తలవంచని వీరవనితల్లా ధీమాగా వున్నాయి. ఆ చుట్టూ వున్న తాటితోపులుచూస్తే కొండలరాణి నిలబెట్టిన సైనికపటాలంలా వున్నాయి... విద్యార్థి అలాగే వాటివైపే చూస్తూ నిలబడ్డాడు...ఇంతలో సత్యం...

'అయితే యిప్పుడు యింటికే వెళ్తావా?' అని అడిగాడు.

'లేదు. మామయ్యా వాళ్ళవూరు వెళ్ళాలి. వెళ్ళి మావయ్యతో మాట్లాడి రమ్మనే అమ్మ పంపించింది నన్ను. అందుకే వచ్చాను నేను. కానీ సీటువస్తే మానుకోడానికి మనస్కరించక, బస్సుస్టాండుకు వెళ్దామనుకున్నవాడిని, బాంకికి వెళ్ళి డబ్బు 'డ్రా'చేసి వస్తుంటే నువ్వు కన్పించావు... అప్పుడు నాన్నగారు పోయ్యాక డెత్ కమ్ గ్రాట్యుయిటీ పెన్షను వచ్చిందిగా...దాన్ని యిక్కడ బాంకిలో నాపేరనే వెయ్యమంది అమ్మ...అందులోది తీశాను జీతం కట్టడానికి ...ఇప్పుడు మావయ్యా వాళ్ళవూరువెళ్ళి, రెండేళ్ళు ఆగమని చెప్తాను ... చూద్దాం ఏమంటాడో...'. అన్నాడు విద్యార్థి...

'సరే...ఆగస్టు ఫస్టున కాలేజి తెరుస్తారట...అప్పుడు గనుకవస్తే మారూమ్‌కు రా...నేను నిన్ననే గదికి తాళం వేసుకున్నాం ...నీకు గది దొరికేదాకా మా గదిలో వుండచ్చు...' అని అడ్రసు యిచ్చాడు ...

'సరే.'నన్నాడు విద్యార్థి...

ఇంతలో సిటీబస్సు వచ్చింది. ఈసారి బస్సు ఖాళీగా వుండడంతో ముగ్గురూ హాయిగా కూర్చున్నారు. విద్యార్థి మార్కెట్ దగ్గర దిగిపొయ్యాడు. అక్కడినుండీ సరాసరి బస్సుస్టాండుకు వెళ్ళాడు...మేనమామగారి వూరు సిరిపాలెం అంత బస్తీకాదు. అంత కుగ్రామమూ కాదు. అది ఒక బ్లాక్ హెడ్‌క్వార్టర్సు.

విద్యార్థి మేనమామ యింటికి చేరేసరికి సాయంత్రమైంది. ధనంజయరావుగారు కాంట్రాక్టు పనులమీద ఎక్కడికో వెళ్ళారు. ఆయన భార్య సుబ్బలక్ష్మమ్మగారు విద్యార్థిని ఎంతో మర్యాదగా ఆహ్వానించారు. అతడికి మేడమీద గదిలో అన్ని వసతులూ ఏర్పాటు చేశారు.

ధనంజయరావుగారి యిల్లు చాలా పాతదే ...వెనుకభాగమంతా దేశవాళీ పెంకుటిల్లు ...అయితే ఆయన 'సమితి' కాంట్రాక్టులు తీసుకోడం మొదలెట్టాక, వెనుక పెంకుటిల్లు వంటకూ భోజనాలకూ, ధాన్యం, పెసలూ, మినుగులూలాంటివి పెట్టడానికి వుంచి, ముందువైపు చిన్న డాబా వేయించాడు. ఆ డాబాపైన వేయించిన రెండు గదులూ ఒకటి కూతురికీ, రెండోది కొడుక్కు అని కట్టించాడుగానీ, కూతురు జయలక్ష్మి గుంటూరులోనే వుండి చదువుకుంటోంది...ఎప్పుడో సెలవులకు వచ్చినప్పుడే వాడేది. ఒక కొడుకు తనకు గది కావాలని పేచీపెట్టే వయసు కాదు కనుక, ఆ రెండుగదులూ అతిథులకని ప్రత్యేకించేవాళ్ళు.

విద్యార్థి గదిలో కడుగుపెడ్తుండగానే విరజాజుల వాసన గుప్పుమని కొట్టింది. ఆశ్చర్యంతో తిరిగిచూస్తే అప్పుడే మెట్లు దిగి వెళ్తోంది ఓ చక్కనిచుక్క ... ఆ ప్రొఫైల్లో చూస్తే కోటేరు పోసినట్లు ముక్కూ ఎత్తయిన వక్షోజాలు. చక్కని పిరుదులు...మలిచిన అజంతా శిల్పంలా వున్న ఆ అమ్మాయిని అలాగే చూస్తూ నిలబడి పొయ్యాడు విద్యార్థి...అతడు జయలక్ష్మిని చూసి చాలా రోజులైంది ... జయలక్ష్మి యింత చక్కగా వుంటుందని అతడు కలలోకూడా అనుకోలేదు...

ఆ సాయంత్రమంతా అతడి కళ్ళు పదే పదే ఆ సౌందర్యదేవతకోసం ఆత్రుతగా వెదకసాగాయి... కానీ మళ్ళీ భోజనాలప్పుడు తప్ప కన్పించలేదు...అతడు అత్త అమర్చిన



విందును ఏం ఆరగించాడోగానీ, అతడి కళ్ళుమాత్రం, జయలక్ష్మి ముగ్ధమోహన రూపంతో విందుచేసుకున్నాయి ... అతడి మనసు చేపపిల్లల్లావున్న ఆ సోగకళ్ళు విప్పి ఒక్కసారి తనవైపుచూస్తే చాలని, గులాబీ రేకుల్లావున్న ఆ బుగ్గలు సొట్టలుపడేలా ఒక్కసారి తననిచూసి నవ్వితే చాలని, లక్కపిడతలా వున్న ఆ చిన్ననోరువిప్పి తనను పలుకరిస్తే చాలని పదేపదే కోరుకోసాగింది. భోజనాలప్పుడు తల్లి, 'బావను పలుకరించ వేమే?' అన్నప్పుడు చిన్నగానవ్వి వూరుకుంది తప్ప మళ్ళీ పలుకరించలేదు ... కనీసం విద్యార్థి పలుకరించడానికి కూడా అవకాశం యివ్వలేదు...

ఆ రాత్రి భోజనలయ్యాక విద్యార్థి చాలాసేపు బయట వచార్లు చేస్తూనే వున్నాడు. జయలక్ష్మి తన గదిలోకి వెళ్తుందేమోనని... కానీ జయలక్ష్మి మేడమీదకు రానే లేదు... ఆరాత్రి ధనంజయరావుగారు చాలా ప్రొద్దుపొయ్యాక వచ్చారు ... మర్నాడు కూడా ఆయన అల్లుడ్ని పలుకరించడానికి తప్ప మాట్లాడ్డానికి తీరికలేదు ... విద్యార్థికి జయలక్ష్మి దూరంనుండి కన్పించడం తప్ప పలుకరించడానికి అవకాశం యివ్వలేదు ... ఆ అమ్మాయిని చూసేకొద్దీ విద్యార్థికి, యింకా యింకా చూడాలని, పలుకరించాలని... యింకా ఏవేవో కోరికలు ఎక్కువవుతున్నాయి...

వారంరోజులుగా అతడి మనసులో చెలరేగుతున్న సంఘర్షణ, ఏదో సాధించాలని అతడు పడుతున్న తపన, అన్నీ మర్చిపొయ్యాడు....విడ్మిబెమ్మ కార్డు వచ్చినప్పటి నుండి పి. జి. సెంటరు చుట్టూ గిరికీలు కొడుతున్న అతడి మనసు ఒక్కసారి యీ అపరంజి బొమ్మకు సెటిలైట్‌లా ప్రదక్షిణాలు మొదలుపెట్టింది. ఆ మధ్యాహ్నం జయలక్ష్మి కనబడుతుందేమో వొంటిగా వన్న ఆశతో క్రిందే తచ్చాడుతూవున్న విద్యార్థికి ప్రక్క గదిలో జయలక్ష్మి, 'అమ్మా! నన్నెందుకమ్మా అనవసరంగా పిలిపించారు. ప్రాకవతల క్లాసులు పోతయి. నాన్నగారితో చెప్పు నేను వెళ్ళిపోతానని...' అని తల్లితో చెప్పడం, ఆవిడ 'ఈ రెండు రోజులకే క్లాసులు పోతాయంటున్నావు. రేపు పెళ్ళయితే యింకేం చేస్తావ్?' అని అడగడం విన్పించింది.

# విద్యార్థి

విద్యార్థికి వెంటనే ఆ గదిలోకి వెళ్ళి, అత్తగారు పెళ్ళి మాటలు ఎత్తగానే సిగ్గుతో కుంచించుకుపోయి నేలచూపులు చూస్తున్న జయలక్ష్మి విరుపెక్కిన బుగ్గలలోని గులాబీలను చూడాలనిపించింది. కానీ అటు వెళ్ళలేకపొయ్యాడు... తను ప్రయత్నించేకొద్దీ పక్కకు తప్పుకుపోతున్న లక్ష్మి రేపు శాశ్వతంగా తనదయ్యాక తప్పక శిక్షించాలనిపించింది.

ఆ రోజు మధ్యాహ్నం మేడమీద కూడా

## అనుకోలేదు నేస్తం

మూగ నోయిన
నీ హృదయ విపంచిని
మహోదయ రాగానికి శ్రుతిచేస్తావను
కున్నానే గాని,
చైతన్య స్వరాలను విస్మరించి
వైరాగ్యాన్ని గానం చేస్తావని
అనుకోలేదు నేస్తం!

వెల వెల బోతున్న
నీ హృదయ ప్రాంగణంలో
మానవతా గులాబులు పూయిస్తావను
కున్నానే గాని
స్వార్థపు ముళ్ళకంచెలు పెంచుకుంటూ
మహోన్నత భావాల్ని పరిధుల్లో బంధి
స్తావని
అనుకోలేదు నేస్తం!

తమస్సులో సుషుప్తమైన
నీ హృదయాంతరమందిరాంతరాల్లో
జ్ఞానదీధీతులు జాగృతపరుస్తావను
కున్నానే గాని
క్రోధాగ్ని జ్వాలలు జ్వలింప జేసి
భవితవ్యాన్ని బూడిద చేసే రుద్ర
భూమివై పోతావని
అనుకోలేదు నేస్తం!

అంతు తెలియని
నీ హృదయకాసారంలో
కారుణ్యపు జలరుహాలు వికసింపజేస్తా
వనుకున్నానే గాని,
కార్పణ్యపు గ్రాహ్యాలు పెంచుకుంటూ
మోసాల మొగసాలలో బానిసలా పడి
ఉంటావని
అనుకోలేదు నేస్తం!

—ఓలేటి శ్రీనివాసరావుఖాను

చాలాసేపు ఎదురు చూస్తూనే వున్నాడు లక్ష్మికోసం...ఇంత అందాన్ని తనకు ఎంత తొందరగా సొంతం చేద్దామా అని ఆత్మ ఆరాటపడుతుంటే...తను ఎంత మూర్ఖంగా వద్దన్నాడు, అని పశ్చాత్తాపం కూడా పడసాగాడు. అతడికి లోకన్‌బాబు సలహా పదే పదే జ్ఞాపకం రాసాగింది. అలా ఆలోచిస్తూ చాలాసేపు మేలుకువగానే వుండి...ఎప్పటికో నిద్రపొయ్యాడు విద్యార్థి.

అతడికి మెళుకువ వచ్చేసరికి పడమటి దెస ఆకాశం నారింజపండు రంగు చీరకట్టి మధుర మనోహరంగా వుంది. అలా కిటికీ గుండా ఆకాశాన్ని చూస్తూ పడుకునివున్న విద్యార్థికి అలలు అలలుగా వస్తున్న సన్నజాజుల వాసన తగిలింది ... ఒక్కసారి హుషారుగా లేచాడు. కానీ అలికిడయితే ఆ లేడిపిల్ల పారిపోతుందని తెలుసు కాబట్టి చడీ చప్పుడూ లేకుండా లేచి నిముషంలో బట్టలు మార్చుకుని తల దువ్వుకొని బయటకు వచ్చాడు...

లక్ష్మి మేడ మీద తన గది కానుకుని వున్న వరండాలో, ఒక గార్డెన్ చేర్‌లో కూర్చుని, కుండీలలో విరబూసిన చేమంతుల్ని తదేకంగా చూస్తూ ఏదో ఆలోచిస్తోంది. తెల్లని హాఫ్‌వాయిల్ చీరలో, తామర తూడుల్లా వున్న ఆ నాజూకైన చేతుల్లో ఒక చేతికి రిస్ట్‌వాచి, రెండో చేతికి వొంటిరంగుతో పోటీ పడుతున్నట్లున్న రెండుజతల బంగారు గాజులు ... చెక్కిట చెయ్యిజేర్చి అలా విచ్చిన చేమంతుల్ని దీక్షగా చూస్తున్న లక్ష్మి ఏదో దివ్యలోకాల్లోంచి దిగి వచ్చిన అప్సరసలా అనిపించింది విద్యార్థికి.

అడుగుల సవ్వడి విన్న లక్ష్మి విద్యార్థిని చూడగానే లేచి, ఆ కుర్చీ చూపిస్తూ, 'రా బావా కూర్చో.' అంది తను పక్కనున్న పిట్టగోడ మీద కూర్చుంటూ.

'బావా' అన్న పిలుపు విద్యార్థి గుండెల్లో వీణ మీటినట్లయింది. అతడు పరవశించి పొయ్యాడు. అలా దూరంగా జరిగి కూర్చోకుండా దగ్గరకు లాక్కోవాలనిపించింది అతడికి. అయినా నిగ్రహించుకుని, కళ్ళతోనే లక్ష్మి అందాన్ని తాగేస్తూ తన్మయుడై కూర్చున్నాడు...

'ఏం బావా యిలా వచ్చావ్ ?' ముఖం మీదకు చిరునవ్వు తెచ్చుకుంటూ అడిగింది

# మీ తలనొప్పి అంతా




# ఒకే ఒక సారిడన్‌తో

ట్రేడ్ మార్కు 'రోష్'

# మటుమాయమై పోతుంది

మీకు ఏ కారణము వల్ల తల నొప్పి వచ్చినా సారిడన్ దగ్గర వుంచుకోండి. మీకు తల నొప్పి, ఒళ్ళు నొప్పి, పళ్ళ నొప్పితో బాటు వుండే భారమును లేక అసౌఖ్యము కలిగిన రోజులలో వుండే బాధను పోగొట్టి, హాయి నవోత్సాహములను కలిగించుటకు సారిడన్ ప్రత్యేకంగా సూత్రీకరింపబడినది. అదే సారిడన్ ప్రత్యేకత-అది మిమ్ము చురుకుగా, ఉత్సాహముతో వుంచును.




ఒకే ఒక సారిడన్ వాడుము
'రోష్' తయారీ

**సారిడన్_ఉపశమనమును, నవోత్సాహమును, హాయిని కలిగించును**

R.F.383

# విద్యార్థి

లక్ష్మి

'ఏం రాకూడదా ?' ఎదురు ప్రశ్న వేశాడు విద్యార్థి...

'అహా...రాకూడదని కాదు...కానీ ఏదో అంటారుగా...నా రకవారు మహాత్ములు...'

'మరే ... ఊరకనే పిలిపించరు కదా మహానుభావులు...' లక్ష్మి వైపు కొంటెగా చూస్తూ అన్నాడు విద్యార్థి.

లక్ష్మి చూపులు వాల్చేసింది.

'అన్నట్టు మంచి మార్కులతో బి. ఏ. పాసయ్యావులుగా...కంగ్రాట్స్.'

'అభినందనలు యింత ఆలస్యంగానా తెల్పేది!...ఇంతకూ ఏ యియర్ చదువుతున్నావు ?'

'సెకండియర్ బి. ఏ.'

'అయినా కో—ఎడ్యుకేషనున్న కాలేజిలో చేరావేం ?'

'ఏం బావా చేరకూడదా ?' ఎదురు ప్రశ్న వేసింది లక్ష్మి. అలా అంటున్నప్పుడు పెదిమలపైకి వస్తున్న నవ్వును మునిపంటితో అదిమిపట్టిన లక్ష్మిని చూస్తుంటే పండిన ఎర్ర టొమాటో పండులా వున్న ఆ పెదిమల్ని తన పెదవులతో శిక్షించాలనిపించింది విద్యార్థికి. కానీ తమాయించుకున్నాడు.

'అహా...చేరకూడదని కాదు... దేశంలో యిన్నిచోట్ల 'వుమెన్స్ కాలేజి'లున్నాయి. వుమెన్స్ కాలేజి కావాలని గోల చేస్తారు కానీ, తీరా పెట్టాక కో—ఎడ్యుకేషను 'ప్రిఫర్' చేస్తారేమానని...' అన్నాడు.

'మా నాన్నగారు గుంటూరులో ఆ కాలేజీలోనే యింటర్మీడియెట్ చదివారు గదా...అందుకని...నన్నూ ఆ కాలేజీలోనే చేర్పించారు.'

'హాస్టల్లోనా ?'

'కాదు. హాస్టలు భోజనం సరిపడకపోతే, నేనూ మా క్లాస్‌మేట్ యిద్దరం కలిసి ఓ చిన్న యిల్లు తీసుకున్నాం...ఆ అమ్మాయి అమ్మగారు మాకు తోడుంటున్నారు.'

'ఏ పేటలో ?'

'అరండల్ పేట ... అడ్రసు యిస్తాను. ఎప్పుడన్నా గుంటూరు వచ్చినప్పుడు రా బావా.'

విద్యార్థికి తను పి. జి. సెంటరులో చేరిన సంగతి చెప్పాలనిపించింది. కానీ... అది అయ్యేదో పొయ్యేదో ముందుగా బయట పెట్టటమెందుకని వూరుకున్నాడు. లక్ష్మిని చూశాక అతడికి తొందరపడి జీతం కట్టానేమో అనిపిస్తోంది. ఆ డబ్బుతో యీ అందాలరాణికి ఒక చక్కటి వుంగరం తెచ్చి, ఆ సన్నని వేలికి తొడిగివుంటే, ఆ స్పర్శతో మేను పులకలెత్తి తను తన్మయుడై వుండేవాడు ... అనుకున్నాడు. విద్యార్థి, లక్ష్మి వేసిన 'బ్రా', కట్టిన వాయిల్ చీరలోంచి కవ్విస్తున్న యవ్వనాన్ని పరవశుడై చూస్తూ...

'ఏం బావా అలా చూస్తున్నావ్?' అన్న లక్ష్మి ప్రశ్నకు, 'ఏనాన్నాళ్ళిలా వువ్విళ్ళూరుతుండమంటావ్?...నువ్వు ఎంత త్వరగా నాదానివవుతావా?' అని చూస్తున్నాను అని చెబ్దామనిపించింది కానీ...అతడికి తెలియని ఏదో శక్తి అడ్డు వచ్చినట్లయి అనలేక పొయ్యాడు...అందుకని మాట మార్చేసి...

'నే వచ్చేసరికి ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్టున్నావ్ ?' అని అడిగాడు.

లక్ష్మి ముఖంలో నవ్వు తరిగి చిన్నబోయింది. మబ్బులుకమ్మిన చందమామలా అయి, బరువుగా నిట్టూర్చింది.

'నా స్నేహితురాల్ని గురించి ఆలోచిస్తున్నాను.'

'ఏమైందో పాపం ఆ స్నేహితురాలికి?'

'వేళాకోళం కాదు బావా...' లక్ష్మి కళ్ళు అశ్రుసిక్తాలయినాయి 'ఆ అమ్మాయి నా ప్రాణ స్నేహితురాలు.. ఇద్దరం ఒక్కటిగా...తనే నేనుగా...నేనే తనుగా మసలిన వాళ్ళం ... తనిప్పుడు చాలా చిక్కుల్లో పడింది. తనను గురించే ఆలోచిస్తున్నాను.'

తదేకంగా లక్ష్మినే చూస్తున్న విద్యార్థి జవాబు చెప్పలేదు. అతడు మాట్లాడక పొయ్యేసరికి తలెత్తి ఆర్ద్రనయనాలతో అతడివైపు చూచింది. ఆ చూపతో కరిగిపొయ్యాడు విద్యార్థి. అంతవాకా మంచులో తడిసిన కలువరేకుల్లా వున్న ఆ కళ్ళపైన ఓ చిన్నముద్దు..అలా..అలా..పెట్టుకోనిస్తే తప్ప, మీ స్నేహితురాలి కథ వినని పేచీ పెట్టాలన్న మనసుకాస్తా కరిగి, సరే చెప్పమన్నట్టు చూశాడు...

'ఏం లేదు నా ఫ్రెండుకు మేనరికం వుంది...కానీ...తను...తను ... యింకోరికి మనసిచ్చింది...అతడ్నే పెళ్లి చేసుకోవాలనుకుంది... ఈ విషయం యింట్లో ఎవ్వరికీ తెలియదు, ఇప్పుడు...వాళ్ళ బావ ... అన్ని విషయాలూ మాట్లాడుకుని ముహూర్తం పెట్టుకోడానికి వచ్చాట్ట ... ఏం చెయ్యమంటావ్...అంటూ వ్రాసింది.'

తప్పు చేస్తున్నదానిలా తలవంచుకుని లక్ష్మి గబగబా చెప్పుకుపోతుంటే. విద్యార్థికి ఎవరో కొరడాతో చెళ్ళున కొట్టినట్లగుంది. గాఢనిద్రలో వున్నవాడిని ఎవరో నిర్దాక్షిణ్యంగా ఎత్తికుదేసినట్లయి ... మనసును ఆవహించుకున్న మత్తు కాస్తా దిగిపోయింది.

తను ఏమనుకొని వచ్చాడు?...ఏవిధంగా దిగజారి పొయ్యాడు?... ఆ కథలోని అంతరార్థం ఏమిటి?...నిజంగా తన కేమయింది యీ రెండురోజుల్నుండి? ... ఎందుకిలా భ్రమలో పడిపొయ్యాడు తను?...

కొద్ది నిముషాలు యిద్దరి మధ్యా నిశ్శబ్దం తాండవించింది. లక్ష్మి వంచిన తల ఎత్తలేకపోతోంది...విద్యార్థి తన్నుతాను



...ని గ్రహించుకుని కాస్సేపున్నాక మెల్లిగా నవ్వాడు ... ఆ నవ్వుతో అంతవరకూ గంభీరంగా వున్న వాతావరణం కాస్త తేలిక పడింది... ఆ తర్వాత మెల్లిగా. 'లక్ష్మీ!...' అని పిల్చాడు.

భయం భయంగా తలెత్తింది లక్ష్మి...

'వాళ్ళ బావకూడా ముహూర్తం పెట్టుకోడానికి రాకుండా ... అలాంటి విషయమేదో చెప్పడానికి వచ్చి...తనతో మాట్లాడడానికి సమయం కోసం చూస్తున్నాడేమో కనుక్కున్నదా మీ ఫ్రెండు? ...' అని అడిగాడు.

లక్ష్మి సజల నయనాలలో మెరుపు లాంటి సంతోషం తొంగిచూసింది.

'అందుకే వచ్చి వుంటాడంటావా బావా?'

'కాదని నమ్మకం లేదుగదా?...'

లక్ష్మి ఎంతో ఆశతో చూస్తోంది అతడివైపు...యింకా ఏమన్నా చెబుతాడేమో అని...ఇంకా ఏదో అడగాలని ... ఏమేమో చెప్పాలని వుంది ఆ అమ్మాయికి... కాని లక్ష్మికి ఎటువంటి అవకాశం యివ్వకూడదని విశ్వమూర్తి పట్టుదల ... కొన్ని నిముషాలలా గడిచాక ఆ నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ...

'ఒకవేళ అలాంటి అభిప్రాయం ఏమీ లేక వాళ్ళబావ తననే పెళ్ళాడాలనే నిశ్చయంతో వచ్చివుంటే, వాళ్ల తల్లితండ్రులు ఆ సంబంధమే చెయ్యాలని పట్టుదలగా వుంటే ఏం చెయ్య దల్చుకొందట మీ ఫ్రెండు?'

ఆల్చిప్పల్లాంటి కనురెప్పలు అల్లాడిస్తూ ఎదురుగా చూసింది లక్ష్మి అతని కళ్లలోకి...'అతడూ అదే నిశ్చయంతో వుండి ... తల్లిదండ్రులు పట్టుబడితే... ఎవరు మాత్రం...ఏం చెయ్యగలరు తల వంచక...కానీ...కానీ...మనసులేని పెళ్లిని చేసుకుంటే అతడికి మాత్రం సుఖముంటుందా?' అంటూ బరువుగా నిట్టూర్చింది లక్ష్మి.

'హుఁ...ఊఁ...' కూర్చున్న కుర్చీమీద తమాషాగా వేళ్లతో రెండుసార్లు కొట్టి, నిరసనగా, కసిగా. ఒక నవ్వు నవ్వి లేచాడు విద్యార్థి... 'వస్తాను.' అంటూ తనగదిలోకి వెళ్లిపోయాడు.

పైన తిరిగే సీలింగుఫాను ... కిటికీలోంచి వస్తున్న చల్లటిగాలి ... 'రెఫ్రిజిరేటరు'లోంచి తెప్పించిన చల్లటి మంచు గడ్డలాంటి మంచినీళ్ళు యివేవీ అతడికి చల్లదనాన్నివ్వలేక పోయ్యాయి... అత్తగారు వెండిపళ్లెంలో పెట్టి పంపించిన జీడిపప్పు పకోడీలను ఒక్కటి కూడా నోట పెట్టకుండా అవతలికి నెట్టేశాడు...ఒక్క గుక్క మాత్రమే కాఫీ చప్పరించాడు.




"బరకగా ఉండే పాత కాలపు పళ్ల పొడులు మీ చిగుళ్లకు పళ్లకు చెరుపు చేస్తాయి..."

కాల్గేట్ టూత్ పౌడరుతో మీ చిగుళ్లను, పళ్లను కాపాడు కోండి. చెడు శ్వాసను అరికట్టండి!

పాతకాలపు బరకగా ఉండే పళ్ల పొడులు మీ చిగుళ్లకు, దంతాలకు చెరుపు చేస్తాయి, పళ్లపై నుండే ఎనామెలును అరగదీస్తాయి. కాల్గేట్ టూత్ పౌడరు అతి మెత్తగా ఉంటుంది. దాని లోని నురుగు నిచ్చే పదార్థం మీ పళ్ల మీది పాచి పొరలను తొలగిస్తుంది. వాటిని తెల్లగా శుభ్రంగా చేస్తుంది. అది మీ చిగుళ్లను మృదువుగా తోముతుంది. కాల్గేట్ లోని పుష్కలమైన నురుగు నిచ్చే చర్య పళ్ల సందుల లోనికి చొచ్చుకొనిపోయి చెడు వాసనను, దంతక్షయ కారకములైన సూక్ష్మ క్రిములను తొలగిస్తుంది. అందువల్లనే, కాల్గేట్ టూత్ పౌడరు చెడు శ్వాసను తక్షణమే అరికట్టి, దంతక్షయమును నివారిస్తుంది. దాని చల్లని, ఉల్లాసకరమైన రుచిని మీరెంతో మెచ్చుకుంటారు కూడా!

...పొదుపైన అధునాతన దంత సంరక్షణ ఉండగా, పాత కాలపు పళ్ల పొడి వాడటం దేనికి!

మీ కుటుంబం కోసం, ఎకానమీ సైజు కాల్గేట్ టూత్ పౌడరు కొనండి ఈ నాడే! నెలల తరబడి వస్తుం దొక డబ్బా!






అతడి అహం దెబ్బతిన్నది ... చాలా గట్టి దెబ్బ తిన్నది!... ఆపిల్ల...తనకోసమే పుట్టినట్లుగా పెంచబడ్డ యీపిల్ల...తన అభీష్టాలను ఆశయాలను కూడా... అవలికి నెట్టి ఆకర్షణలో పడ్డ తనను తృణీకరిస్తుందా?...

హుఁ...ప్రేమించిందిట... ప్రేమించింది! ఏం తనకు అందం లేదా? చదువులేదా?... ఆలికి అన్నం పెట్టగలిగేటి ఆస్తి లేదా?... పిల్లని కాలేజీలో చేర్పేది చదువుకోడానికా లేక ప్రేమ కలాపాలు సాగించి...చిన్నప్పటి నుంచీ పెంచుకున్న మమతల తీవెల్ని కూకటి వేళ్ళతో సహా పెకిలించేసి, అందరి గుండెల్లో అశాంతి మంటలు రేపి...హుఁ...ప్రేమట...ప్రేమ!...

చూస్తాను యీ ప్రేమలెలా సాగుతాయో..మామయ్యతో వెంటనే ముహూర్తం పెట్టించమని చెప్తాను. ఆ మూడు ముళ్ళూ పడ్డాక చెప్పుకింద తేల్లా...నలిపి... నలిపి...కసి తీర్చుకుంటాను ... చూస్తాను ఏం చేస్తారో యీవిడా, యీవిడ ప్రియుడు!...

విద్యార్థి మనసులో కందిరీగల్లా ముసురుకుంటున్నాయి విషపు టాలోచనలు...అతడి మనసు అల్లకల్లోలంగా వుంది. ఈ గజిబిజి ఆలోచనలు మర్చిపోవాలని ఏదో ఒక పుస్తకం తీసి తిరగెయ్యసాగాడు...అందులో ఒక కథ...మనసొకచోటా మనువొకచోటా అయి తన జీవితం నరకం చేసుకుని భర్త జీవితం నాశనం చేసిన మగువ గథ!...

పుస్తకం విసిరి గిరవాటేశాడు ... ఆలోచనల యినుప చక్రాల క్రింద అతడి బుర్ర పగిలిపోతోంది.

అవును లక్ష్మిమీద కసి తీర్చుకోడం కోసం తన జీవితం ఎందుకు నరకం చేసుకోవాలి?... అది అర్థం లేని పని... అందుకని మామయ్యతో చెప్పేస్తేసరి... అయ్యో తన కూతురు యిలా ఘనకార్యం వెలగబెట్టిందట ... మనసు మాత్రమే పారేసుకుందో...శీలం కూడా పారేసుకుందో ఎవరి కెరుక...కనుక యీ ఆఘ్రాణిత పుష్పం నాకొద్దని...

కానీ—తండ్రిముందు లక్ష్మి నిజం చెబుతుందని నమ్మకమేమిటి?...అప్పుడు తను రెండందాల చెడడా?...పోనీ మామయ్య ముందు లక్ష్మి ఒప్పుకుంటుందనే అనుకున్నా...అప్పుడు ఒక ఆడది తనను తిరస్కరించినట్లు కదూ? ... అది తన కెంత అవమానం!... యిలా ఆలోచనలు సాగిపోతూనే వున్నాయి.

(ఇంకా వుంది)

## కలరా-ఎల్-టార్

—సి. రమేష్‌నారాయణ

ప్రస్తుత సమాజంలో కలరా వ్యాధిని గూర్చి తెలియని వారు, వినని వారు లేరేమో! నిజానికి వ్యాధి 'కామా' ఆకారంలో వుండే బాక్టీరియములవల్ల వస్తుందని, 1883వ సంవత్సరంలో తొలిసారిగా రాబర్ట్ కోష్ అన్న జర్మన్ వైద్యుడు శాస్త్రీయంగా గుర్తించాడు. ఈ రోగ లక్షణాలు 'విషూచిక మన్న' పేరుతో 2500 సంవత్సరాల క్రితమే శుశ్రుతునిచే వర్ణించబడ్డాయి. శాస్త్ర రంగంలో మానవుడు సాధించిన ప్రగతి ఫలితంగా చాలా వరకు తగ్గు ముఖం పట్టిన ఈ ఒకనాటి మహామ్మారి రోగం, ఈనాడు చెదురుగా కనబడుతూందని భావించబడుతున్నది.

ఇట్టి పరిస్థితుల్లో పాత సీసాల్లో క్రొత్త మందు లాగా ఈ వ్యాధి కలరా—ఎల్—టార్ అన్న పేరుతో ప్రపంచానికి 1961 నవంబరు నెలలో బాహాటంగా వెల్లడయ్యిందనవచ్చు. ఆ సమయంలో హాంకాంగ్ నగరంలో కలరా వ్యాధి సోకిన రోగులనుండి తీయబడ్డ రోగ క్రిములు మనదేశంలో కలకత్తాకు చెందిన భారతీయ వైద్య పరిశోధనా సంస్థకు పంపబడ్డాయి. అక్కడ కొనసాగిన మైక్రో—బయాలజీ పరిశోధనల్లో ఇవి 'పారా—కలరా' అంటూ పిలువబడే ఈ వ్యాధిని కలిగించే రోగక్రిములుగ గుర్తించబడ్డాయి. ఈ రోగ కారక క్రిములను 'ఎల్‌టార్‌వైబ్రియో' అంటారు.

కలరా—ఎల్—టార్ అనే ఈ వ్యాధి ఎంత భయంకరమైనదంటే 1961వ సంవత్సరంలో ఫిలిప్పైను దీవుల్లో ఇది సోకి పూర్తిగా ఐదు మాసాలు తిరక్క ముందే పది వేలమంది రోగుల్లో 1300 మంది పైగా మరణం పాలయ్యారు. తర్వాత 1963 నందు బర్మా, 1964లో ఇండియా, పశ్చిమ పాకిస్తానుల్లోను 1965 నాటికి ప్రపంచ వ్యాప్తంగా 21 దేశాలందు, 1966లో ఇరాక్ లోను వెన్వెంటనే వ్యాప్తినొందింది. భారత దేశంలో ఈ రోగ వ్యాప్తికి ముఖ్యకారణం కలకత్తా నగరమని వైద్య నిపుణుల విశ్వాసం. ప్రపంచ ఆరోగ్య సంస్థ ఈ రోగపరిశోధనలపై ప్రత్యేక శ్రద్ధ వహించటమే గాక కలకత్తాలోనే 'ఇంటర్నేషనల్ రెఫరెన్స్ సెంటర్'ను స్థాపించింది కూడా.

నిజానికీ వ్యాధికి, సాధారణ కలరాకు భేదమంటూ లేదు. ఈ నాడు ఈ వ్యాధి సోకిన ఎడల తొలి దశల్లోనే నిరపాయంగా వ్యాధి నివారణ గావించుకొనే అవకాశాలు హెచ్చుగ నున్నాయి. ప్రస్తుత వైద్య విధానాల్లో ఎల్—టార్ రోగులకు సెలైన్, ఆంటిబయోటిక్స్ కూడిన ట్రీట్‌మెంటు నిస్తారు. విపరీతపు వాంతులు, మల విసర్జనల ద్వారా, నష్టపోయిన ద్రవ పదార్థాల లోపం దేహంలో భర్తీ చేయుటానికి సెలైన్ ద్రావణాన్నిస్తారు. ఈ పద్ధతి ప్రసిద్ధ వైద్య శాస్త్రజ్ఞుడగు సర్‌లియొనార్డ్ రోజర్స్‌చే ప్రవేశపెట్టబడింది. టెట్రాసైక్లిన్ క్లోరాంఫినికాల్ వంటి యాంటీ బయోటిక్‌లు సత్వర నివారణ కొరకు ఉపయోగిస్తారు. వాక్సినేషన్ పద్ధతికూడా వ్యాప్తిలో వుంది.

ఈ వ్యాధి నివారణ చర్యల్లో చాలా ప్రపంచ రాజ్యాలు ప్రస్తుతం ఆసక్తిని కనబరచే ముఖ్యాంశాలు—పరిశుభ్రమైన మంచినీటి సరఫరా, కలుషిత పదార్థాలు తీసివేసేపద్ధతి. డ్రెయినేజి విధానాలు అభివృద్ధి పరచటం లాంటి వనొచ్చు. ఈవిధానాలు అవలంబించటం ద్వారా భారతదేశంలో కూడా చెప్పుకోదగ్గ వ్యాధి నివారణ గమనించబడింది.

వీటన్నింటికన్నా ముఖ్యంగా ప్రజల ఆరోగ్యాన్నే ధ్యేయంగా గుర్తించుకొని సమాజ శ్రేయస్సుకు పాటుపడే ఆరోగ్యశాఖ, దానికి సంబంధించిన అధికారులు గావించే చర్యలు ఈ వ్యాధి నివారణ చర్యల్లో ప్రముఖపాత్ర వహిస్తాయి. అందులకు తగిన అవకాశాలు, శ్రద్ధాసక్తులను ప్రభుత్వం కూడా కనబరుస్తుందని ఆశిద్దాం మరి!

# అనుకున్నది-అన్నది!



కె. రామలక్ష్మి

'తప్పకుండా రావాలొకసారి. వీలైతే రేపు రండి' అనేసి వాలుక్కుర్చుకున్నాను. ఆ షాపులో వ్యక్తి నాకేమంత పరిచయం లేదు. నాకంతగా చూడాలనీ లేదు. అయినా మర్యాదకి అనేశాను. 'వచ్చి ప్రాణంమీద కూర్చుంటారు కబోలు' అనుకుంటూనే— ఆహా—మీరు తప్పక రావాలి. అని ఆహ్వానిస్తాం. ఎందుచేత? మర్యాద కోసం. అంతే ... ఆలోచించి చూడండి. అనాలనుకున్న దానికీ, అన్నదానికీ ఎన్నెన్ని సందర్భాలలో పొంతన వుండదో. ఇదోరకం భాష. చైతన్యవంతమైన సాంఘిక కార్యక్రమాలలో ఈ భాష ధారాళంగా అందరికీ వస్తుంది ... ఎప్పుడూ అలంకరించిన బొమ్మలా చూసే స్నేహితురాలు గజిబిజిగా కన్పిస్తే—పలకరించండి 'హడావిడిగా వరుసెత్తుకొచ్చావోయ్' అంటూ మనం అడక్కుండానే వివరిస్తుంది. మనం ముఖుకు తక్కువ తిన్నామా? 'లేదోయ్ ఎంతో అందంగా కన్పిస్తున్నావు' అంటాం. అంతే కాని 'నిజమే. యిలా వున్నావేమిటి? నేనూ ఆశ్చర్యపడ్డంతేనే' అని ఎందుకు నిజం చెప్పలేమో అర్థంకాదు. ఎవరినేనా అనుకోకుండా చూస్తే—ఆనెగారి నిజ పరిస్థితి ముఖంమీద కొట్టవచ్చినట్టు కన్పిస్తున్నా—ఏమిటో అంటామేగాని ఏమిటిలా వున్నావు? అని ముఖుకు అడగం. ఈ ద్వంద్వార్థ భాష చిన్నతనం నుంచే అలవడుతూ వస్తుందనుకుంటాను. బాగా చదివే విద్యార్థిని పరీక్ష ఎలా రాశావని అడగండి. 'పాడు చేశానండి పోయినా ఆశ్చర్యం లేదు' అంటాడు. అతగాడికి తెలుసు వచ్చినట్టు పాసవుతానని! గర్వం అనుకుంటారేమో నిజం చెప్తే అనుకుంటాడు. ఎందుకో? అడిగినా అడక్కపోయినా కొందరు ఏమిటో 'పయ్యా పైసా లేదు'. నిజమే చాలామందికి ఉండకపోవచ్చు. కాని లక్షో అరో మూలిగేవాళ్ళు కూడా అంటే వింతగా వినిపిస్తుంది. ఇంట్లో కూర్చుంటే హాయిగా వుంటుందని చదువుకున్న ఏ పెళ్ళాం ఒప్పుకోదు. ఏదో గత్యంతరం లేక అని మనని నమ్మించాలని చూస్తుంది. విశ్రాంతిగా ఓ సినిమా చూడడానికి, రేడియో వినడానికి, పుస్తకం చదువుకోడానికి టైముందంటే ఏం? తప్పు కాదే! ... ఎన్నిసార్లు నచ్చని వంటకాలు — బాగున్నాయంటూ విందుల్లో తింటారు మగవాళ్ళు? అవే యింటిదగ్గిర భార్యలుచేస్తే పళ్ళెలు ఎగురుతాయే!

అన్నిటికంటే దారుణం 'మరిచిపోయాను' అన్నది, ఇష్టంలేదు. అయినా వంక — మరిచిపోడం!

కొన్ని సందర్భాలలో యిలాంటి చిన్న సదబద్ధాలు — దయకు మారు పేరుగా ఉంటాయనుకోండి. నా స్నేహితురాలి కూతురొకసారి నా కిష్టమైన బొమ్మ పగులకొట్టింది. ఏం చెయ్యను? 'పోనిదూ, దుమ్ము దులపడానికొకటి తగ్గించింది' అన్నాను వేదాంతిలా. అదే నా కూతురైతే వీపు పగుల్ను! కాని సంభాషణల్లో దొర్లే యిలా సగం నిజాలు, పూర్తి అబద్ధాలు— తగ్గించుకుంటే పోను. స్వేచ్ఛగా ఎవరితోనైనా మాట్లాడవచ్చు. అన్నది — అనుకున్నదీ చూడండి — 'ఎంత బాగున్నావోయ్?! (అబ్బ లావెక్కావే! అని) 'భాగుంది బాగుంది' (ఏడిసినట్టుందని!) 'ఎంత అందంగా చుట్టుకుందో సిగ! (కుండ బోర్లించినట్టుంది! అని) 'రేపొస్తానుగా?' (రేపంటే వచ్చే ఏటిలోగా అని!) ఇలాంటి వెందుకు? మనని ఎదుటివారిని కూడా మోసం చేసుకుందుకు!



దొంగ కాదండీ కార్టూనిస్టు మామీద కార్టూనులు వేస్తున్నాడు, తనను ఎవరూ గుర్తుపట్టకుండా మొహంమీద గీతలు గీసుకున్నాడు!



# మహామనిషి

సుందరరామయ్య

తూర్పుదిక్కు నుదుట ఎర్రటి కుంకుమను దిద్దుకొంది.

రాత్రంతా గాఢ నిశిదిలో విశ్రాంతి తీసుకొన్న ప్రకృతి కన్య బద్ధకంగా ఒళ్ళు విరుసుకొంది.

'టప, టప'మంటూ రెక్కల శబ్దంతో పక్షులు ఆహారం కోసం పరుగులు తీస్తున్నాయి.

రోడ్డుమీద జనసంచారం క్రమేపీ పెరగ సాగింది.

'టక్, టక్'మని కొయ్య కర్రతో శబ్దం చేసుకొంటూ ఆంజనేయస్వామి గుడి దగ్గరకు చేరుకొన్నాడు రంగడు.

ఉత్సవసమయం కావటంచేత స్వామి వారికి లోపల పూజలు జరుగుతున్నాయి.

స్వామి దర్శనంకోసం భక్తులు మెల్ల మెల్లగా వస్తున్నారు.

భుజాన వున్న జోలెని క్రింద పెట్టి మెల్లగా మెట్లమీద చతికిలబడ్డాడు రంగడు.

జోలెలోవున్న గిన్నెను బయటకు తీస్తుండగా 'బాబూ! దిక్కులేనిదాన్ని! పైసా యివ్వండి!' అనే మాటలు విన్పించాయి.

చటుక్కున ప్రక్కకు తిరిగి చూశాడు.

కంచాన్ని ముందు పెట్టుకొని కూర్చున్న స్త్రీ ఆకారం కన్పించింది.

రంగడు ఆ అమ్మాయిని మరింత పరిశీలనగా చూశాడు.

సంస్కారహీనమైన జుట్టు—

శరీరాన్ని దాచలేకపోతున్న జాకెట్టు—

దారిద్ర్యపు రంగును పులుముకొన్న చీర—

మనిషి చామనఛాయ అయినప్పటికీ ఆమెలో ఏదో ప్రత్యేకమైన ఆకర్షణ వున్నదన్పించింది రంగడికి. అమాయకంగా కన్పించే ఆమె ముఖానికి కంటిచూపును కరువుచేసినందుకు దేవునిమీద విపరీతమైన కోపం కల్గింది రంగడికి.

రెండుకళ్ళావున్న మానవుణ్ణి మోసం చేయగల ప్రబుద్ధులున్న ఈ సంఘంలో కళ్ళులేకుండా ఈమెలా బతుకుతుందో?

ఆమె కసలు 'నా' అనేవాళ్ళెవరూ లేరా?

ఒంటరిగానే జీవిస్తుందా?

మంచి వయస్సులోవున్న ఈ పిల్ల ఈ పాపపు లోకంలో ఎలా మసలుకోగల్గుతుంది?

'ఒరేయ్ అబ్బీ!' ఇదిగో రెండుపైసల బిళ్ళ! నీవో పైసా తీసుకొని ఆ గుడ్డి దానికో పైసా యివ్వు!' అంటూ ఓ బామ్మగారు అరిచేసరికి ఆలోచనలతో సతమతమౌతున్న రంగడికి చిరాకు వేసింది.

'నాదగ్గర చిల్లరలేదు! ఆ యిచ్చేదేదో ఆవిడకేయివ్వండి!' అన్నాడు కొంచెం నిర్లక్ష్యంగా.

'హోరినీ! ఎంత పొగరురా? అందుకనే ఆ దేవుడు నీకిలాంటి కుంటిబతుకు నిచ్చాడు. చిల్లరుంచుకొని కూడా లేదంటావా? వరే! నీ రోగం కుదురుస్తానుండు! ఈ రెండు పైసలూదానికేయిస్తా'అంటూ బామ్మగారు రెండుపైసల బిళ్లలు కంచంలో వడేసింది. వెళూ, వెళ్తూ రంగడివైపు ఓ కోర చూపు విసిరి 'ఒరేయ్! అడుక్కుతినే వాళ్లకు అదురుబాటు పనికి రాదురా!' అని గొణుక్కొంటూ వెళ్ళిపోయిందావిడ.

'ఎవరూ బాబూ నువ్వు?' అని ఆ కళ్లులేని అమ్మాయి పిలవగానే రంగడు కొంచెం ప్రక్కకు జరిగి 'ఏం?' అని అడిగాడు.

'ఆ పైసలన్నీ నా కిప్పించి ఎన్నో మాటలు పడ్డావు.'

రంగడు నవ్వాడు.

'నీ మాటలతీరు చూస్తుంటే నీకింకా లోకజ్ఞానం లేనట్లుందే? ఇలాంటి మాటలు పడటం మనకలవాటయిపోయిందిలే! ముష్టి రెండుపైసలివ్వగానే మనం వాళ్ల బానిసల మైపోయినట్లు నోటికొచ్చినట్లు వాగేస్తారు.'

'ఏనాడో పాపం చేసుకోబట్టే ఇలా అడుక్కుతింటున్నాం!'

'ఏం? అడుక్కుతినటం నీక్కూడా యిష్టంలేదా?'

'మరోదారిలేక అడుక్కుతింటున్నాను. పాపం! నీకు కాళ్లులేవా?'

'ఈ లోకంలో మనలాంటి అడుక్కుతినేవాళ్లకు కొన్ని అర్హతలు కూడా వుండాలి! ఇప్పుడు వీళ్లంతా మనకు పైసలు వేస్తున్నారంటే కారణం ఏమిటనుకొన్నావ్? నీమీద, నామీద వున్న జాలితో కాదు! నీ గుడ్డికళ్లమీద నా కుంటికాళ్లమీదున్న సానుభూతితోనే!'

'నీకు కాళ్లులేవు! నాకు కళ్ళులేవు. ప్రతిమనిషికీ ఏదో లోపం వుండాల్సిందేనా?'

'పైకి కన్పించే లోపాలంటే ఫర్వాలేదు. అందువల్ల ఆ లోపం వున్నవాళ్లు మాత్రమే బాధపడ్తారు. కాని కొంత మంది పెద్ద మనుషుల్లో పైకి కన్పించని లోపాలు ఎన్నో దాగుంటాయి. వాటివల్ల ఎదుటివారి జీవితాలు ఎన్నో నాశనమైపోతాయి!' అన్నాడు రంగడు చుట్టను నోట్లో పెట్టుకొంటూ.

'ఒరేయ్! మీ రిక్కడికి అడుక్కు తించావికొచ్చావా? లేక కబుర్లు చెప్పుకోటానికొచ్చావా? అవతలకు పోండి!' అని కసురుకొంటూ గుళ్లోకి వెళ్లాడు ఓ ముసలాయన.

'ఇప్పుడు కేకలేశాడు చూశావా?' అని రంగడు అంటుండగనే ఆ అమ్మాయి 'నాకు కళ్లులేవుగా! నేనెక్కడ చూశాను?' అని ఎదురుప్రశ్న వేసింది.

'ఆ... అదృష్టవంతురాలివి! పోనీ ఆయనమాటలైనా విన్పడ్డాయా?'

'ఆ'

'ఆయన వృత్తి, మన వృత్తి ఒకటే!'

'అంటే...'

'అడుక్కుతినటం!'

'మరయితే యిసురుగా మాటాడుతాడే?' అమాయకంగా అడిగింది. రంగడు గట్టిగా నవ్వాడు.

'ఆయన ఈ వూళ్లోనే మరో గుళ్లో పూజారిలే! దేవుడిపేరిట అడుక్కుతింటున్న విషయాన్నే మర్చిపోయి, బిచ్చగాళ్ళను చూసి కసురుకోటం ఆయనగారి కలవాటయిపోయింది.'

'నీకు చాలా సంగతులు తెలుసే! అందమైన పలువరుసతో చిరునవ్వు నవ్వుతూ అంది.

'అప్పుడే ఏమైంది? ఈలోకంలో ఇంకా ఇలాంటి వింత మనుష్యులున్నారో నీకేం తెల్సు? అడుగో! మాటల్లోనేవచ్చాడు మరో పెద్దమనిషి!' అంటూ తన చూపును ఓ భారీశరీరంవైపు మళ్లించాడు రంగడు.

'నీకు ఎంత చెప్పినా ఇంతేరా! వెధవ ముఖం నువ్వునూ! నిన్న సాయంత్రమునగా చెప్పాను బజారుకెళ్లి కొబ్బరికాయలు కొనుక్కురమ్మని! నామాట విన్నావూ? ఇప్పుడు చూడు! కాయకు పదిపైసలు ఎక్కువ తగలేసి ఈ చిన్నచిన్నకాయలను తెచ్చావు!' అంటూ విసుక్కొంటూ లోపలికెళ్లాడు ఆ వ్యక్తి. అతనివెనుకే అతని నౌకరు కొబ్బరికాయలను పుచ్చుకొని అనుసరించాడు.

'విన్నావుగా, ఆ మాటలు! ఆయనగారొస్తే నేను గిన్నెను కూడా దాచేస్తాను!' అన్నాడు రంగడు.

'ఎందుకని?' ఆశ్చర్యంగా అడిగింది.

'ఆయనసలు ధర్మమేచేయడు! ఒకవేళ చేసినా, తీసుకోటం నా కిష్టంలేదు.'

'యింతగావుందే!'

'అసలు వాడెలాంటివాడో తెల్సుకొంటే నువ్వుకూడా నాలానే చేస్తావులే! వాడిది కసాయిగుండె! జాలి, కరుణ అంటేనే వాడికి తెలీదు! వడ్డీవ్యాపారంచేసి రెండు మేడలు కట్టాడు. పేదవాళ్ళ రక్తాన్ని వడ్డీరూపంలో పీల్చే, వాడిలాంటి జలగలంటే నా కసహ్యం!'

'ఇవన్నీ యింటుంటే నాకు భయమేస్తుంది!'

'ఎందుకు?'

'ఈ మనుషులమధ్య ఎలా బతకాలా అని?'

'ఏం? నీకెవ్వరూలేరా?'

'లేరు!'

'మరి ఇంతకాలం ఒంటరిగా ఎలా జీవిస్తున్నావ్?'

'మొన్నటిదాకా మాతాత వుండేవాడు!'

'అయితే అతను చచ్చిపోయాడా?'

'అవును! అందుకనే రైలెక్కి యీ వూరికొచ్చేశాను.'

'ఇంతకూ మీదేవూరు?'

'సీతాపురం.'

'అలాగా! అయితే మావూరి పక్కవూరే నన్నమాట!'

'నిజంగానా?'

'అవునుగాని నాతోవస్తావా?'

'ఎక్కడికి?'

'మా ఇంటికి.'

'నీకు యిల్లుకూడా వుందా?'

'ఏం? ఉండకూడదా?' నవ్వుతూ అడిగాడు రంగడు.

'ఎక్కడ?'

'క్రిష్ణానదిమీద! గవర్నమెంటోళ్లు కట్టించారులే!'

'కబుర్లు బలేగా చెబుతుండావే!' అంటూ ఫక్కున నవ్వింది.

ఆ నవ్వులు రంగడి హృదయంలో తేనెజల్లులైనాయి.

'నీవు నవ్వితే చాలా బాగుంటావు పిల్లా!' అన్నాడు పరిహాసంగా.

'నాపేరు పిల్లకాదు! నుబ్బులు!'

'మరి నా పేరేమిటో చెప్పమంటావా?'

'ఊఁ'

'రంగడు!'

'అది సరేకాని పైసలేమీ పడటంలేదే?' అంటూ కంచంలోని చిల్లరను తడుముకొంది.

'భక్తులసంఖ్య తగ్గిపోయిందిగా, ఇక పోదాం పద!'

'ఎక్కడికి?'

'స్టేషన్‌కాడికి!'

'అక్కడ పైసలు బాగా దొరుకుతాయా?'

'డబ్బులమాట ఎలావున్నా, అక్కడ అడుక్కోవటమే నా కలవాటు!'

'మరి యీ గుడికాడికెందకొచ్చావ్?'

'నిన్ను కలుసుకొందామని!'

సుబ్బులు మళ్ళీ తియ్యగా నవ్వింది.

'నీకంతా ఎగతాళేనా?'

'కాదు సుబ్బులూ! నువ్విలా నవ్వుతుంటే నాకెంత ఆనందంగా వుందో తెలుసా? నా కష్టాలన్నింటినీ మర్చిపోతున్నాను. అసలు అడుక్కుతింటున్నానన్న విషయమే గుర్తుండటంలేదు.'

'నీ మాటలు యింటుంటే నాక్కూడా సంతోషమవుతోంది! నాకు మంచి తోడు దొరికావు! ఆ సామే నిన్ను నా కాడకు బంపాడు.' అంటూ ఊతకర్రకోసం చేతులతో భూమ్మీద తడుముకొంది. ప్రక్కనే పడున్న కర్రముక్కను ఆమె చేతి కందించాడు రంగడు.

సుబ్బులు మెల్లగా లేచి నిలబడింది.

గిన్నెను జోలెలో పెట్టుకొని రంగడు కూడా మెల్లగా లేచి నిలబడ్డాడు.

ఇద్దరూ రోడ్డుమీదికొచ్చి స్టేషన్ వైపు నడక సాగించారు.

* * *

'సుబ్బులూ! ఇవ్వాళ నీకో శుభవార్త చెప్పనా?' అంటూ హుషారుగా వచ్చాడు రంగడు.

# మురాడో మనిషి

'ఏంటి మావా?'

'కొత్తగుళ్ళదగ్గర నిన్న ఒక పెళ్ళయిందిలే! ఆ ధర్మాత్ముడు రేపు మనలాటోళ్ళందరికీ సంతర్పణ చేస్తున్నాడు.'

'పెళ్ళి భోజనమా?'

'అవును సుబ్బులూ! కడుపు నిండే భోజనం!'

'వద్దు మావా!' అంది సుబ్బులు అయిష్టంగా.

'అదేమిటి సుబ్బులూ!'

'అవును మావా! రేపొక్క రోజు భోజనాని కలవాటు పడితే రోజూ అలాంటిదే తినాలనిపిస్తాది! వద్దు మావా! ఆ యిందు భోజనాలొద్దు. నీ చేతికూడే నా కమృతంలాగ వుంటాది.'

'నీవు చెప్పిందీ బాగానే వుంది కాని వచ్చిన అవకాశాన్ని పోగొట్టుకోవడం దేనికి? సర్లే! అది రేపటి సంగతిగా!' అంటూ మెల్లగా చతికిలపడి కూర్చుని తన జోలెలోని గిన్నెను తీసి సుబ్బులుకు అందించాడు.

'ఏంటి మావా? ఇవ్వాళ సంపాదన తగ్గిపోయినట్టున్నాదే!' అంది గిన్నెను తడిమి చూస్తూ.

'నీవు నా పక్కన లేని లోటు ఇవ్వాళ కన్పడింది సుబ్బులూ!' అన్నాడు రంగడు కృష్ణానది వైపు చూస్తూ.

'అందుకనే నేను కూడా నీతో వస్తానంటే వొద్దన్నావు!'

'పిచ్చిదానివే! పొద్దున్న నీ పరిస్థితి ఎలా వుందో మర్చిపోయావా?' ఆ రకంగా అడుక్కు తినటానికొస్తే మూడ్రోజులు ముసుగు తన్ని పండుకొనేదానివి! ఇప్పుడు నీ ఒంట్లో ఎలా వుంది? జ్వరంతగ్గిందా?' అని అడుగుతూనే ఆమె చెయ్యి పుచ్చుకొని పరీక్షించాడు.

'పరవాలేదు మావా! నాకు జ్వరం మధ్యాహ్నమే తగ్గిపోయిందిలే' అంది సుబ్బులు తన చేతిని లాక్కొంటూ.

'ఏమైనా ఈ స్థలం మనకు అచ్చిరాలేదు సుబ్బులూ! మనం వెంటనే ఇంకో చోటుకి మకాం మార్చేద్దాం!'

'నా మూలంగా నువ్వు కూడా చానా బాధలు పడుతున్నావు మావా!' సుబ్బులు కంఠంలో కృతజ్ఞత ధ్వనించింది.

'పిచ్చిదానా! ఇందులో నేను బాధ పడేదేముంది? నేను ఒంటరిగాణ్ణి కాబట్టే ఈ బ్యారేజీ మీద ఇంతకాలం గడిపేశాను. కాని నువ్వు ఆడదానివి! ఇలాంటి స్థలం నీకు పనికిరాదు. బందరు రోడ్డులో వో షెడ్డు ఖాళీగా ఉంది. రేపట్నుంచీ మన మకాం అక్కడే!'

'పొద్దున్నుంచీ వొంటరిగా ఉండాలంటె నాకేంటో భయమేసింది మావా! నువ్వు లేక పోతే నాకు ఏంటోగా ఉంటాది! రోగ మొచ్చినా సరే నేను కూడా నీతోనే తిరుగుతా!' అంది సుబ్బులు రంగడి చేతిని తన చేతుల్లోకి తీసుకొంటూ.

'నాకు మాత్రం నిన్ను వదిలి వెళ్ళాలని ఉంటుందనుకొన్నావా సుబ్బులూ! బజార్ల వెంట తిరిగితే నీకు జ్వరం ఎక్కువవుతుందేమో నని వొద్దన్నాను. ఇవ్వాళ నేను బజారు పోతే అట్లమ్మే అప్పలమ్మ ఏమని అడిగిందో తెలుసా?' అని అడిగాడు.

'ఏమంది మావా?' ఆత్రంగా అడిగింది సుబ్బులు.

'ఏరా అబ్బీ! ఇయ్యాళ నీ పెళ్ళాం రాలేదే?' అని అడిగింది.

సుబ్బులు సిగ్గు పడింది.

ఆమె సిగ్గుతో మల్లెమొగ్గలా ముడుచుకు పోతుంటే రంగడికెంతో ఆనందం కల్గింది ఊహ కందని మధురమైన భావనలు అతని



మనస్సును గిలిగింతలు పెట్టాయి.

'పో మావా! అన్నీ అబద్ధాలే చెబుతావ్!' బుంగమూతి పెట్టి తల ప్రక్కకు త్రిప్పుకొంది సుబ్బులు.

'అబద్ధాలు చెప్పవలసిన అవసరం నాకేమీ లేదు. కావాలంటే రేపు ఆ అప్పలమ్మను నువ్వే అడుగు! సరే కాని ఆ మాట వింటేనే అంత సిగ్గుపడి పోతున్నావు కదా! రేపు నిజంగా పెళ్ళికూతురివైతే ఇంకా ఎలాగుంటావో?'

ఆ మాటలు వినగానే సుబ్బులు ముఖం చిన్నబోయింది.

'అంతటి అదృష్టం నా కెక్కడిది మావా?' ఆమె కంఠంలో నిరాశ ధ్వనించింది.

'అదేమిటి సుబ్బులూ?'

'అవును మావా! అందరిలా నాక్కూడా కళ్ళుంటే ఆ ముచ్చట తీరేది!' అంటూ తల వంచుకొంది.

'బాధ పడకు సుబ్బులూ! నీ ముఖానికి కళ్ళు లేకపోతే మాత్రమేం? నీ మనస్సుకే కళ్ళున్నాయి! ఈ లోకంలో కళ్ళుండికూడ గుడ్డివాళ్ళగా బతుకుతున్న మనుషులకంటె నువ్వెంతో నయం! పెళ్ళి చేసుకొంటానని నువ్వు చెప్పాలే కాని సంబంధాన్ని చిటికెలో కుదురుస్తాను' అన్నాడు రంగడు ఆమె ముఖంలోకి చూస్తూ.

'అయితే నాకు నచ్చినోణ్ణి తెస్తావా?'

'నీకు నచ్చినోడా? అంటే ఎలా ఉంటాడో చెప్పు?'

'చెప్పమంటావా? అయితే విను! మాయ, మర్మం తెలియనోడు, ఎప్పుడూ కబుర్లు చెప్పి నవ్వించేవోడు, కుంటుకొంటూ నడిచేవోడు...'

'సుబ్బులూ!' అంటూ ఆశ్చర్యపోయాడు రంగడు.

'ఏం మావా? నా రాజకుమారుడు నీకు నచ్చలేదా?'

'అది కాదు సుబ్బులూ! ఈ కుంటోణ్ణి చేసుకొని ఏం సుఖపడ్తావ్?'

'మావా! ఈ ఊరికి రాగానే నన్ను ఆదుకొన్నావు నువ్వు. నీ తోడే దొరక్కపోతే నా నేమై పోయేదాన్నో? నీలాంటి దేముడికి పెళ్ళాం కావటం కూడా అదృష్టమే మావా!'

రంగడు యేమీ మాట్లాడలేకపోయాడు.

'ఏం మావా? మాటాడవేం? నన్ను చేసు

# ఆంధ్రసచిత్రవారపత్రిక

# డిటెక్టివ్ నవలల పోటీ!

## ఉత్తమ రచనకి

## రు. 1,116 బహుమతి

*డిటెక్టివ్ నవలా రచయిత(త్రు)లకి మంచి అవకాశాన్ని, ప్రోత్సాహాన్ని కలిగించడానికి ఈపోటీ నిర్వహిస్తున్నాము. పోటీలో ఉత్తమ నవలగా ఎన్నికైన రచనకి రు. 1,116 లు బహుమతి యిస్తాము. రచయిత(త్రు)లందరూ ఈ అవకాశాన్ని వినియోగించుకొని పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చెయ్యగలరని ఆశిస్తున్నాము.*

### నిబంధనలు

1 పోటీకి పంపే నవలలు 75 ఠావు (ఎక్సర్‌సైజు నోట్‌బుక్ పేజీకి లెక్కింపు) లకి మించి ఉండరాదు.

2. రచనలు వాస్తవానికి దగ్గరగా ఉండి, తెలుగుదనం నిండి ఉండాలి. స్వంతరచనలు తప్ప అనువాదాలు, అనుసరణలు అయి ఉండకూడదు. ఇంతకుముందు ప్రచురణ అయి ఉండకూడదు.

3. నవల తమ స్వంత రచనేనని దేనికీ అనుసరణకాని, అనువాదం కాని కాదని రచయిత(త్రి) హామీ రాసి పంపాలి. ఈ హామీలు నవల వ్రాత ప్రతిమీదే రాసి ఉండాలి. హామీలేని రచనలు పోటీకి అంగీకరింపబడవు.

4. నవల వ్రాతప్రతిమీద, కవరుమీద, 'డిటెక్టివ్ నవలలపోటీకి' అని స్పష్టంగా రాయాలి. రచయిత (త్రి) పేరు, చిరునామా కూడా వ్రాతప్రతిమీద స్పష్టంగా రాయాలి.

5. రచనలని 'సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1కి' పంపాలి. వ్యక్తులపేర పంపరాదు.

6. ఉత్తమ రచనకి సంబంధించిన తుది నిర్ణయం ఆంధ్ర సచిత్ర వారపత్రిక సంపాదకునిదే. ఈ విషయమై ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపడానికి వీలులేదు. పోటీకి సంబంధించిన ఏ విషయం గురించీ ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం లేదు.

7. బహుమతి పొందని నవలల వ్రాత ప్రతులని మేమే తిప్పి పంపే ఏర్పాటు చేస్తాము. కానీ వాటివిషయంలో మేము ఎలాంటి బాధ్యతనీ స్వీకరింపలేము. రచయిత (త్రు)లు తమరచనలతో పాటు, తగినన్ని స్టాంపులు అతికించిన స్వంత చిరునామా కల కవర్ని జతపరచనవసరం లేదు.

8. <u>పోటీకి గడువు తేదీ 30—9—1972.</u> ఆ తర్వాత మా కార్యాలయం చేరిన రచనలని పరిశీలించడం జరుగదు.

9 పోటీలో బహుమతి పొందిన డిటెక్టివ్ నవల ప్రచురణ 1973 సంక్రాంతి సంచికలో ప్రారంభిస్తాము

## ముగింపు తేదీ 30-9-1972

**రచయిత(త్రు)లందరూ మాతో సహకరించి ఈ పోటీని జయప్రదం చెయ్యవలసిందిగా కోరుతున్నాము.**

కోటం ఇష్టం లేదా?'

'అంత మాటనకు సుబ్బులూ! నీలాంటి భార్య దొరకటం కూడా అదృష్టమే! నిన్ను తప్పకుండా పెళ్ళి చేసుకొంటాను!'

'నిజంగానా మావా?' ఆనందాశ్చర్యాలతో ప్రశ్నించింది.

'నిజం సుబ్బులూ! రేపు ఆ దుర్గమ్మ తల్లిదగ్గర మనం పెళ్ళిచేసుకొందాం' అంటూ ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకొని సుస్మితంగా ముద్దు పెటుకొన్నాడు రంగడు.

'చానా చల్లటి కపురు చెప్పావు మావా!' అంటూ సుబ్బులు అతని ఒడిలోకి వాలిపోయింది.

* * *

'ఇక అడుక్కుతిని మనమేమీ సంపాదించలేం సుబ్బులూ' కష్టపడి ఏదైనా పని చేసి సంపాదించాల్సిందే!' నిట్టూర్చాడు రంగడు.

'అదేంటి మావా? నువ్వు చూస్తే అవిటివాడివి. నేను చూస్తే గుడ్డిదాన్ని! పనిచేసి సంపాదించాలంటే మనకెలా కుదుర్తాది? ఆ దేముడు మనిద్దరికీ అన్యాయం చేశాడు.'

'బాధపడకే! అదృష్టం కలసిరావాలే కాని మనక్కూడా మంచిరోజులు రాకపోతాయా? మన చీకటి బ్రతుకుల్లోకి వెలుగు తప్పకుండా వస్తుంది.'

'ఏమిటో మావా! నామూలంగా నువ్వు బాట్లుపడుతుంటే నా గుండె తరుక్కుపోతుంది. అడుక్కు తినటానికి నేనుకూడా వత్తానంటే నువ్వొప్పుకోటంలేదు! ఎందుకు మావా అంత భయం?'

'భయంకాదే పిచ్చిదానా! ఈ లోకం సంగతి నీకు బాగా తెలీదు! వయస్సులో వున్న ఆడది కన్పడిందంటే అందరి కళ్ళు అటే వుంటాయి. ప్రతోడు కొరచూపు చూస్తాడు. వాళ్ళందరూ నిన్నలా చూస్తుంటే నా మనస్సు సహించదు.'

'ఏమో మావా! నే పెళ్ళాన్నయికూడా నిన్ను సుఖపెట్టలేకపోతున్నాను. చాకిరీ అంతా నువ్వే చేస్తున్నావు. నీకు బరువయిపోయి నిన్ను బాధపెడుతున్నాను.'

'సుబ్బులూ! ఇప్పుడంటే అన్నావు కాని మరెప్పుడూ అలాంటి మాటలనకు. నాలో ఏనాడో చచ్చిపోయిన మనసును మళ్ళీ తిరిగి బతికించావు. జీవితమ్మీద నాకు ఆశను కల్పించావు. త్వరలో మన కష్టాలన్నీ తీరిపోతాయి. నేను వ్యాపారం చేద్దామనుకొంటున్నాను.'

'ఏం, యాపారం మావా?'

'వేరుశనక్కాయల వ్యాపారం! ఇవ్వాళ షావుకారుగార్ని కల్సుకొని మాటాడాను! వేరుశనక్కాయలు, బఠాణీలు అప్పు మీద యివ్వటానికి ఒప్పుకొన్నాడాయన.'

'కాలులేనోడివి! యీధుల్లో తిరిగి ఎలా అమ్ముతావు మావా?'

'వీధులు తిరగాల్సిన అవసరమేముందే? ఏ సినామాహాలుదగ్గర కూర్చునైనా అమ్ముకోవచ్చు! ప్రస్తుతానికి ఈ వ్యాపారమే బాగుండేటట్లుంది! ఏంచేస్తాం? బ్రతుకు తెరువుకోసం ఏదో ఒకటిచేయాలిగా! ఆనాడే నేనింకా బాగా చదువుకొనివుంటే ఏదైనా ఉద్యోగం దొరికి బాగుపడేవాణ్ణి!'

'ఏంటి మావా! అంత చక్కగా కపుర్లు చెబుతావు! చదువుకో లేదంటావేం?' అమాయకంగా అడిగింది సుబ్బులు.

'చదివాను సుబ్బులూ! కాని పూర్తిగా కాదు.'

'సగమే చదివి మానేశావా?'

'అవును!'

'ఎందుకని మావా?'

'దానికంతా పెద్దకథ వుందిలే!'

'నేను తెల్సుకోకూడదా మావా?'

'అంతా ఎన్నాక నన్ను అసహ్యించుకొంటావేమోనని భయపడుతున్నాను!'

'అదేవిటి మావా? నీ మనస్సెలాటిదో నాకు తెలీదా?'

'నిజమే! నా మనస్సును సరిగ్గా అర్థం చేసుకొన్నది నీ వొక్కదానివే! నీకు తప్పకుండా నా కథ చెప్పాల్సిందే! మా నాన్నకు నేనొక్కణ్ణే కొడుకు కావటంచేత చిన్నప్పట్నుంచీ చాలా గారాబంగా పెంచాడు. మాకున్న ఎకరం ఆస్తితోనే నన్ను పెద్ద చదువులు చదివించాలని ఆశపడ్డాడు. మా వూళ్ళోవున్న బడిలో చదువైపోయాక పొరుగూరిలో వున్న పెద్దబడికి పంపించాడు. ఎట్లాగయితేనేం తొమ్మిదోక్లాసువరకు చదివాను. అక్కణ్ణుంచి నా చదువు సాగలేదు. రెండుసంవత్సరాలు వరుసగా గాలివానలొచ్చి పంటలు పోవటంతో మేము అప్పుల పాలయ్యాము. సంసారం గడవటమే కష్టమైపోయింది. చివరకు భూమినికూడా తాకట్టు పెట్టాల్సిన పరిస్థితి ఏర్పడింది. భూషణంగారనే పెద్దరైతుదగ్గర మా భూమిని తాకట్టుపెట్టి డబ్బు తెచ్చాడు. మా పరిస్థితి ఇలా వుండగానే పంచాయితీ ఎన్నికలొచ్చాయి. సన్నకారు రైతులందరికీ మా నాన్నంటేఎంతోగౌరవంవుండేది. మానాన్నను కలుపుకొంటే పేదరైతులఓట్లన్నీ సంపాదించవచ్చునిరెండుపార్టీలవారు అనుకొన్నారు. ఆవూరి మునసబుగారిది ఒకపార్టీ! భూషణంగారనే మోతుబరిరైతుది ఇంకొకపార్టీ! ఇద్దరూ మేకతోలు కప్పుకొన్న పులులే! ఊరిని అభివృద్ధి చేస్తామని గుళ్ళు కట్టిస్తామని, బళ్ళు పెట్టిస్తామని, చందాలు వసూలుచేసి స్వాహాచేసేవాడు మునసబు. వాడి తమ్ముడు అంటే ఎన్నికల్లో నిలబడ్తున్నవాడు నీతి లేనోడు! మాపల్లెలో వయస్సులోవున్న ఆడపిల్లలంతా వాడిపాలే! ఇక భూషణం సంగతి చెప్పనక్కర్లేదు! పిల్లిద్దరికంటే దుర్మార్గుడు. పేదరైతుల రక్తాన్ని వడ్డీ రూపంలో తాగేవాడు. వడ్డీవ్యాపారంచేసి లక్షాధికారయ్యాడు. అలాంటి రాక్షసుల మధ్య మానాన్న నలిగిపోయాడు.

ఓరోజున భూషణం మా నాన్నను పిలిపించి పేదరైతుల వోట్లన్నీ తనకు పడేలా చేస్తే తనకివ్వాల్సిన బాకీలన్నీ వదులుకొంటానన్నాడంట! నా సుఖంకోసం కలవరించే నాన్న తాకట్టుపెట్టిన పొలమ్మీద ఆశపడి మాటిచ్చేశాడు. మా నాన్న భూషణంవైపు తిరిగిపోయాడన్న వార్త మునసబుగారి ముఠాక్కూడా తెల్సిపోయింది. ఇంటికి వస్తుండగా మధ్య దార్లో కాపేసి మా నాన్నను దారుణంగా చంపేశారు. దాంతో నాలో కసి పెరిగిపోయింది. మా నాన్నను హత్య చేసిన వారిపైద ప్రతీకారం తీర్చుకోటానికి బయల్దేరాను. ఫలితంగా ఈ కాలు పోగొట్టుకొన్నాను. ఐదునాలో పగ చల్లారలేదు. ఆస్పత్రిలోంచి బయటకు వచ్చాక, నా కాలు విరగ్గొట్టిన వాడి రక్తాన్ని కళ్ళ జూసే ఉద్దేశంతో కత్తి తీసుకొని బయల్దేరాను. కాని నా చేతగానితనం, తొందరపాటు, ఉద్రేకం నా జీవితాన్ని నాశనం చేశాయి. నామీద హత్యా

కేసు బనాయించి నన్ను జైలుకి పంపించింది ఈ సంఘం. స్వార్థపరులైన ఈ మానవులు చేసిన కుట్ర ఫలితంగా నేను బికారినయ్యాను. గిన్నె చేతో పట్టుకొని వీధులెంట తిరగాల్సిన దౌర్భాగ్యం కల్గింది.' —క్లేశంతో ఊగిపోయాడు రంగడు.

'నీ కథ యింటుంటే నాకేడుపొస్తుంది మావా! నీవు నా కంటె ఎక్కువే బాధలు పడ్డావు!' విచారంగా పల్కింది సుబ్బులు.

'కాని ఇంత జరిగినా నా కోర్కెను తీర్చలేక పోయాడు ఆ దేవుడు. నా తండ్రి ప్రాణాలను తీసి, నా కాలిని విరగ్గొట్టిన ఆ దుర్మార్గుని రక్తం నా కళ్ళతో చూడ లేకపోయాను.'

'ఏం? ఆడు మళ్ళీ కనపడలేదా?' పరారీ ఐపోయాడా?'

'అవును! ఈ లోకంనుంచే పరారీ అయ్యాడు.'

'అంటే...'

'చచ్చిపోయాడు.'

'పీడ వదిలిపోయింది. అలాంటోడు బతికుంటే ఇంకా ఎన్ని ప్రాణాలు తీసేవాడో?'

'అలాంటోణ్ణి ఇప్పుడు తల్చుకోవటం కూడా పాపమే!' అంటూ చుట్ట కోసం [illegible]సిను జేబు తడుముకొన్నాడు.

'అరెరె! వీటి సంగతే మర్చిపోయాను' అంటూ జేబులోంచి ఓ పొట్లాన్ని తీసి విప్పాడు.

'ఏంటి మావా?'

'నీకు రబ్బరు గాజులు తెచ్చాను సుబ్బులూ! ఏదీ నీ చేతులిలా యివ్వు!' అంటూనే సుబ్బులు చేతులను తన చేతుల్లోకి తీసుకొని గాజుల్ని తొడిగాడు రంగడు.

* * *

'ఇంత కాలానికి మనకో ఇల్లు దొరికినందుకు నాకు బలే ఆనందంగా ఉంది మావా!' అంది సుబ్బులు ఏలూరు కాల్వ ప్రక్కనే ఉన్న కొత్త గుడిసెలోకి ప్రవేశిస్తూ.

'ఇదంతా నీ చలవే సుబ్బులూ! నీవు ఒంటరిగా ఆ షెడ్డులో ఉండటం నాకిష్టం లేకపోయింది. [illegible] నాగయ్యతో ఏదైనా ఇల్లుంటే చూడమని చెప్పా! 'ఎవరిదో ఇల్లెందుకు? మా ఇంటి పక్క ఇల్లు ఖాళీగానే ఉంది. దాన్ని నీకిప్పిస్తాను!' అన్నాడు. ఇక్కడైతే మనకే లోటూ ఉండదు. ఈ కాల్వగట్టున మనలాంటి పేదోళ్లు చాలామంది ఉంటున్నారు. ఏ ఆపదొచ్చినా ఆదుకొంటారు. అందులో నీవు వత్తి మనిషివికూడా కాదు! ఈ సమయంలో ఆడతోడు కూడా అవసరం. నాగయ్య పెళ్లాం బిడ్డలుకూడా చాలా మంచోళ్ళు! ఇక మనకేవీ దిగులక్కర్లేదు! ఆ దేవుడి దయవలన వ్యాపారంకూడా బాగానే నడుస్తోంది!' అన్నాడు రంగడు చుట్ట పొగ వదుల్తూ.

'ఏమైనా నీవొక్కడివే పాటుపడటం నాకేం బాగోలేదు మావా! నేను కూడా ఏదైనా సాయంచేస్తా!'

'నువ్వా? సర్లే! తర్వాతచేస్తే చేద్దువు గాని! ఇప్పుడుమాత్రం అలాంటి ఆలోచనల్ని పెట్టుకోకు! నీ కడుపులోవున్న కొడుకు కోప్పడతాడు!'

'పో మావా!'

'ఏం కూతురు కావాలా?' సుబ్బులు బుగ్గను గిల్లుతూ అడిగాడు.

'అబ్బ! చేయి వదులు మావా!' అంటూ రంగడి చేతిని విడిపించుకొంది సిగ్గుపడుతూ.

రంగడు నవ్వాడు.

'మావా! నీలాంటి దేముడు నాకు దొరుకుతాడని నేనెప్పుడూ అనుకోలేదు. మా తాత చచ్చిపోయాక నాక్కూడా చద్దామన్పించింది. కాని చావలేకపోయాను. నీ కోసమే బతికున్నానేమో!.' అంటూ రంగడి చేతిని తన చేతుల్లోకి తీసుకొంది ఆప్యాయంగా.

'మీ తాత తప్పితే నీకెవ్వరూ లేరా?'

'ఎవరైనావుంటే నేనొంటరిదాన్నెందుకయ్యేదాన్ని? ఆ వచ్చినోళ్ళు నేను ఒంటరిదాన్ననేగా నన్ను నాశనం చేయటానికొచ్చింది' అంది సుబ్బులు కంట తడి పెట్టుకొంటూ.

'సుబ్బులూ! ఏమిటి నీవనేది?' ఆశ్చర్యంగా అడిగాడు రంగడు.

'అవును మావా! ఇంతకాలం నీకు చెప్పనేలేదు! మాతాత సారా కాసి మా వూళ్లోనే అమ్మేవోడు! తాగటానికెంతో మంది వచ్చేవోళ్ళు! అందులో యిద్దరు రౌడీ యెధవల కళ్ళు నామీదపడ్డాయి. మాతాత వుండగానే నామీద చేయివేయబోయి



తన్నులు తిన్నారు. అప్పట్నుంచి నామీద కసిని పెంచుకొన్నారు. తాత చచ్చిపోయాక నేను ఒంటరిదాన్నయ్యాను. ఆ సమయంలో ఆ యెధవలు నన్ను బలవంతం చేయబోయేసరికి కేకలు పెట్టాను. చుట్టుపక్కలోళ్ళొచ్చి నన్ను కాపాడారు. ఇక నాకక్కడ వుండ బుద్ధికాలేదు. యెంటనే ఆవూరొదిలే వచ్చాను.'

'అయితే నీకు తల్లిదండ్రులెవ్వరో, తోబుట్టువులెవ్వరో కూడా తెలీదన్న మాట.'

'అసలు నాకెవ్వరూ లేరంట! మా తాత చెప్పేవోడుగా! మా అమ్మ నన్ను కనేసి చచ్చిపోయిందంట! మా అయ్యేమో నా చిన్నప్పుడే ఒకడ్ని చంపి జైలుకెళ్ళి అడనే చచ్చిపోయాడంట!'

ఆ మాటలు వినగానే రంగడి కనుబొమలు ముడిపడ్డాయి. అతని మనస్సులో ఏదో అనుమానపు రేఖ మెరిసింది.

'మీ అయ్య పేరేమిటో తెలుసా?'

'గంగన్న!'

'గంగన్న! వాడే...వాడే మా నాన్నను చంపిన పాపాత్ముడు!' అంటూ గట్టిగా అరిచాడు రంగడు.

'మావా!' భయంగా అరిచింది సుబ్బులు.

'నా కాలు విరగ్గొట్టిన రాక్షసుడు కూడావాడే! సుబ్బులూ! నువ్వా కసాయోడి కూతురివా? ఇంతకాలం నాకెందుకు చెప్పలేదు?' అంటూ పిచ్చివానిలా జుట్టంతా చిందరవందర చేసుకొన్నాడు.

గతస్మృతులు అతని మనస్సులో మెదిలాయి.

కత్తులు...కర్రలు...తండ్రి శవం...రక్తం...ఆస్పత్రి...జైలు— అన్నీ అతని కళ్ళముందు కదలాడాయి.

ఆ క్షణంలో అతని మెదడు మొద్దుబారిపోయింది.

మానిపోతున్న గాయానికి ఎదురు దెబ్బ తగిలినట్లయింది.

సుబ్బులు పిలుస్తున్నా విన్పించుకోకుండా 'టక్ టక్' మంటూ శబ్దం చేసుకొంటూ బయటికి వెళ్ళిపోయాడు రంగడు.

* *

చీకటి పడింది.

బ్యారేజ్ మీద లైట్లు వెలిగాయి.

వచ్చేపోయే వాహనాలతో రోడ్డంతా సందడిగా వుంది.

పక్కనేవున్న ఫుట్‌పాత్‌మీద పండుకొన్న రంగడు మెల్లగా కళ్ళు విప్పాడు. చల్లటి పిల్లగాయువులు నదీతరంగాలను తాకుతూ హాయిగా వీస్తున్నాయి. ఒకప్పుడు ఆ వాతావరణానికి రంగడెంతో మురిసిపోయాడు. కాని ఆ క్షణంలో మాత్రం అతను బాహ్యప్రపంచాన్నే మర్చిపోయాడు. రెండ్రోజుల క్రితం అతని మనస్సులో ప్రారంభమైన పెనుతుఫాను ఇంకా తగ్గుముఖం పట్టలేదు. సుబ్బులు రూపాన్ని తల్చుకొంటే చాలు చచ్చిపోయిన గంగన్న రూపమే అతని కళ్ళముందు మెదుల్తోంది! మనస్సులో ద్వేషం పగ నిప్పులా మండుతున్నాయి. అటు వ్యాపారం చేయటానిక్కాని ఇటు ఇంటికి వెళ్ళటానిక్కాని అతనికి మనస్కరించటంలేదు.

అదోరకమైన ఉన్మాదావస్థలో ఆ బ్యారేజ్ మీద మన్ను తిన్న పాములా పడున్నాడు. వేళకింత తిండితినాలనే తలంపుగాని, ఇంటిదగ్గర నిండు గర్భిణిగా వున్న భార్య స్థితి ఎలావుందోనన్న దిగులు గాని అతనికి లేదు!

నిర్మలంగా వున్న ఆకాశంలో ప్రకాశిస్తున్న నక్షత్రాలవైపు కాస్సేపు చూస్తూండిపోయాడు.

'ఒరేయ్, రంగా!' అన్న నాగయ్య కేక విన్పించగానే ఉలిక్కిపడి లేచాడు రంగడు. ముఖంలోని నీరసాన్ని, విషాదాన్ని గమనించిన నాగయ్య,

'అరె! అదేమిట్రా అలా మారిపోయావ్? నీ కోసం వెదకనిచోటంటూ లేదు! ఈ రెండురోజుల్నుంచీ ఎక్కడ తిరుగుతున్నావ్? అసలు ఇంట్లోంచి ఇలా ఎందుకొచ్చేశావ్?'

'నాగయ్య మావా! నా జీవితానికి శాంతి లేదు! సుఖంలేదు! నన్నిలా బ్రతకనియ్యి!'

'రంగా! తప్పు తెల్సినవాడివే ఇలా దిగాలు పడిపోతే ఎలా? పాపం! సుబ్బులు నాకు జరిగిందంతా చెప్పింది. ఆ పిల్ల తండ్రి పాపాత్ముడే కావొచ్చు! ఆ మాత్రానికి దాని జీవితాన్నే నాశనంచేస్తావా? దానితండ్రి చేసిన నేరానికి అది బలి కావాలా?'

'గంగన్న చచ్చినా, నాలోని పగ చావలేదు మావా! నేనీ దౌర్భాగ్యస్థితికి రావటానిక్కారణం ఆ గంగన్న! అలాంటోడి కూతురు నా పెళ్ళామన్న విషయం గుర్తుకొస్తేనే నా శరీరం మండిపోతుంది!'

'రంగా! ఈ పరిస్థితుల్లో నువ్వా పిల్లను దిక్కు లేనిదాన్ని చేస్తావా? నువ్వులేకుండా అదెలా బతగ్గలదనుకొన్నావ్? ఇంటికి వెళ్దాం పద!'

'నేను రాలేను మావా! మా జీవితాలు ఇలా చీకట్లో నాశనం కావాల్సిందే!'

'పిచ్చివాడా! ఎల్లకాలం ఒకేరీతిగా వుండదు! మనిషై పుట్టాక కష్టనష్టాలు లేకుండా వుంటాయా?' ఇక మీకు యే దిగులూ అక్కర్లేదు! మీ జీవితాల్లోకి వెలుగొచ్చింది. మీ ఇంట్లోకి మూడో మనిషి అడుగు పెట్టాడురా!'

'ఏంటి మావా, నీ వనేది?'

'నీకు కొడుకు పుట్టాడ్రా!'

'నిజంగానా!' అప్రయత్నంగా అనేశాడు.

'నిజంరా! బుల్లోడు ఎంత బాగున్నాడనుకొన్నావ్? చక్రాల్లాంటి కళ్ళు—గుండ్రటి ముఖం—బలే ముద్దొస్తున్నాడనుకో! నీ కొడుకుని చూద్దువుగాని! పద! వెళ్దాం!' అంటూ మెల్లగా రంగడి భుజమ్మీద చేయి వేసేడు నాగయ్య.

ఆ మాటలు విన్నాక రంగడి ముఖంలో మార్పు వచ్చింది.

తుఫాను వెలసిన తర్వాత ఏర్పడే ప్రశాంత వాతావరణం అతని మనస్సులో చోటు చేసుకొంది. ఏవేవో మధుర భావాలు అతని హృదయంలో గంతులు వేయసాగాయి.

మనిషి నీరసంగా వున్నప్పటికీ, అమితమైన ఉత్సాహాన్ని తెచ్చిపెట్టుకొంటూ హుషారుగా లేచి నిలబడ్డాడు.

'ఈ లోకంలో ప్రతి మనిషికి మరో మనిషి తోడు అవసరమే! అంతే కాదు! సుఖమొచ్చినా, కష్టమొచ్చినా పంచుకొనేందుకు మూడో మనిషి కూడా ముఖ్యమే! మనిషికీ మనిషికీ మధ్య వచ్చిన చిక్కులను విడదీసి తీర్పు చెప్పటానికే కాదు, [illegible] మొగుడు పెళ్ళాల మధ్య వచ్చిన మనస్పర్థలను సర్దటానిక్కూడా మూడో మనిషి అవసరం ఎంతైనా ఉంది' అని మనస్సులోనే అనుకొంటూ, తన వెనకే వస్తున్న రంగణ్ణి చూసి చిన్నగా నవ్వుకొన్నాడు నాగయ్య. ●

# వారఫలం

**21-7-1972 శుక్రవారం మొదలు**
**27-7-1972 గురువారం వరకు**

**మేషం:** కొన్ని వ్యవహారాల్లో ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉండదు. పుణ్య కార్యాలు చేస్తారు.

**వృషభం:** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో చికాకులు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**మిధునం:** మీరు అనుకొనేది ఒకటి జరిగేది మరొకటి కావచ్చును. పాటివారితో వాద ప్రతివాదాలు తగవు. ప్రయాణాలు ఫలిస్తాయి. వ్యాపారంలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రాగలదు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**కర్కాటకం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. మిత్రుల సహాయం లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు లాభించగలవు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

**సింహం:** అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. పాటివారిలో గౌరవం లభిస్తుంది. వారం మధ్యలో వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురి కాగలరు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కన్య:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ఆర్థిక వ్యవహారాల్లో మొగ మాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. సంతోషకరమైన వార్తలను వింటారు.

**తుల:** మీ ఆలోచనలు ఫలిస్తాయి. వృత్తిలో ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. వారం ఆఖరులో స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. బంధు మిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం:** వృత్తిలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు. రాజకీయ వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పాటి వారిలో గౌరవం లభిస్తుంది.

**ధనుస్సు:** నమ్మిన వారివల్ల ఇబ్బంది కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో అనుకూలత లభిస్తుంది. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుండదు. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మకరం:** మీ కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా వుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం మధ్యలో అధిక వ్యయం జరుగుతుంది. మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కుంభం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో మీరు శ్రమ పడినా ప్రయోజనం ఉండదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**మీనం:** వ్యాపారంలో అనుకూల వార్తలను వింటారు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహిత్య కళా రంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు—బంధు మిత్రులను కల్సుకొంటారు. ప్రయాణాలోచనలు చేస్తారు.

—మహేష్


మూలశంకకు
త్వరగా
నమ్మకమైన
హెడన్‌సా
విరేపనముతో
చికిత్సను పొందండి
- శస్త్రచికిత్స
అవసరములేదు!
Bensons-2141-TEL

35 సం॥ అనుభవం
వరిబీజము బుడ్డలు బీజకుట్టు
మొదలగు వ్యాధులకు ఆపరేషన్
లేకుండా గ్యారంటిగా బాగుచేయబడును
రాజ్ అండ్ కో ఆసుపత్రి
గౌలిగూడ సిటి బస్ డిపో ఎదురుగ,
రామ్ మందిర్ రోడ్, హైదరాబాద్-12 ఆ.ప్ర
ఆఫీస్ ఫోన్: 42870 ఇంటి ఫోన్: 38544

మీకు సంతానం లేదా?

...ఉత్తమ ...వ్యవధానముల విఖ్యాతి నిరాశచెందిన సోదరీమణులు, మా సలహో సర్వీస్ పొందిపులచే, దేశములో పలు ప్రాంతముల స్త్రీలు, సంతానవతులై పంపిన ప్రశంసా పత్రములు అనేకము గలవు. ఉచిత సలహో. వివరములకు:
శ్రీనాగార్జున మూలికా కుటీరం
రైల్వే స్టేషన్‌వద్ద — రాజ్యాశ్రయం పేట,
తెనాలి - 2.




**జరిగిన కథ**

మాధవరావు ఆ వూళ్ళోకి స్కూలు మాస్టారిగా వచ్చాడు. ఎవరికో ఉపకారం చెయ్యాపోతే అతను ఇక్కట్టుకు గురి అయ్యాడు. రామ్మగారు అతన్ని యింటికి తీసుకువచ్చింది. అనురాధ తొలి చూపుల్లోనే అతన్ని ఆకర్షించింది. ఆ తర్వాత అతనిదగ్గర చదువుకోవడం ఆరంభించింది. రంగరాజు కొడుకు రాజారావు బోర్డుకి ప్రెసిడెంటుగా నెగ్గాడని ఆమె చాలా బాధపడింది. మాధవికి పెళ్ళయి అత్తవారింటికి వెళ్ళిపోయింది. రాజారావు రాధని నిర్బంధించాడు. మాధవరావుకు సంబంధించిన ఒక రహస్యాన్ని వెల్లడించాడు. రాధ నమ్మలేదు. రాజారావు అత్యాచారం చెయ్యబోగా ఆమెకి స్పృహ తప్పింది. మాధవరావు ఆమెని రక్షించాడు. దెబ్బలు తగిలిన మాధవరావు రాధ సపర్యలో కోలుకుంటాడు. మాధవరావు తల్లి విషాదగాథ రాధని కలచి వేస్తుంది. శశికళతో తన పరిచయాన్ని రాధకి వివరిస్తాడు మాధవరావు. అతని కథంతా చెప్పుకు వచ్చాడు. అప్పగారు ఎలా వంచించిందీ వివరించాడు. అనురాధకి ఇప్పుడు అతనిమీద అభిమానం మరింతగా పెరిగింది. వారిద్దరికీ పెద్దలు వివాహం నిశ్చయించేశారు.

# 22

నా పెళ్ళి నిశ్చయమైందన్న శుభవార్తని మధూకి, వేణుగోపాల్‌కి తెలియపరిచాను.

కామేశంగారి సీతమణి వచ్చి అడిగింది. '...నేను విన్నది నిజమేనా?'

'నీ వెప్పుడేది విన్నా నిజం కాకపోయింది కనుకనా! విన్నది చెప్పు ముందు' అన్నాను చిరునవ్వుతోనే.

'మాస్టారితో నీ పెళ్ళి నిశ్చయమైందటగా!'

'అవును.'

'అయితే ఆయన నిన్ను వలలో వేసుకున్నాడా? లేక నువ్వే ఆయన్ని వలలో వేసుకున్నావా?' అని నవ్వుతూ అంది ఆమె.

'ఎవరిని ఎవరు వలలో వేసుకుంటేనేం చివరికి ఒకే వలలో చిక్కుకొన్నాం.'

'ఈ విషయం తెలిసి రాజారావుకు మతి పోయినట్లయింది పాపం!'

'ఏం నీ కంత సానుభూతి!'

'ఎంతయినా నువ్వంటే మహా యిష్టం కదా!'

'అతని గొడవలు ఎనకెందుకు పోనిద్దూ'

'నేను చెప్పేది నీ కర్థం కాలేదు రాధా! కబురంపి బెదిరించి మాస్టారిని లొంగదీసుకోవాలని అనుకొన్నాడుట రంగరాజు గారు, కాని, ఆయన వెడితేగా? అందు కని...'

'... ఆయనకు ఒంట్లో బాగో లేక నిన్నటివరకు అసలు బడికే వెళ్ళటం లేదు ఇంకెక్కడికి వెడతారు?'

'అదిసరే...నీ పెళ్ళి నిశ్చయమైందని తెలిసాక మా నాన్నగారు ఎలక్షన్లలో ఓడిపోయినందుకు దుగ్ధతో మీ నాన్నగార్ని లొంగదీసుకొని ఇలాంటి వ్యతిరేకపు పనులు చేస్తున్నారనుకుంటున్నారు వాళ్ళు. మా నాన్నగారు చేసిందేమీ లేకపోయినా నలుగురెదుటా డాక్టరుగారు మంచిపని చేసారని అనడంతో అందరూ రంగరాజుగారిని ఏడిపించాలనే మా నాన్నగారేదో చేసారనుకుంటున్నారు...'

నాకు చిరాకు కలిగింది. '...వాళ్ళ మాటకేమిగాని నువ్వనుకోవటం లేదు కదా నిజమేదో నువ్వే నలుగురికి చెప్పు ఆ తర్వాత అదే అందరికీ బోధపడుతుంది...'

'...ఇదిగో రాధా! నేనిల్లా అంటున్నానని కోపగించుకోకు ... అక్కడి మాటలిక్కడికి చేరవేస్తున్నానని నువ్వు నాపై కోప్పడినా నీకు మంచి జరగాలనే నా తాపత్రయం! మాస్టారిని ఈ వూరు నుంచి ట్రాన్స్‌ఫర్ చేయించటానికి ప్రయత్నాలు చేస్తున్నాడుట రంగరాజు... ఆ సంగతి నీతో చెప్దామని వచ్చాను...'

నేను తెల్లబోయాను ఆమెమీద విసుక్కున్నానే కాని ఆ విషయం చెప్పినందుకు ఆమెకు కృతజ్ఞత తెలపకుండ ఉండలేక పోయాను.

సాయంత్రం అతను స్కూలు నుంచి రాగానే ఈ విషయం చెప్పాను.

'...నేనూ విన్నాను రాధా! నువ్వనవసరంగా కంగారుపడకు ... అల్పులు ఎన్నో చేయగలమని తామనుకుంటారు. చివరికి వారు చేయగలిగేదేమీ ఉండదు— అని నీతో నేనొకసారి అనలేదూ! ..రంగరాజుగారు చేయగలిగేది కూడ ఏమీ ఉండదు.... ట్రాన్స్‌ఫర్ తప్పనిసరి అయితే నేను వాళ్ళకంటిని వాళ్ళే పొడుచుకునేలా చేస్తాను...పిచ్చిదానా! నిన్ను నన్ను దేవుడు కూడ వేరుచేయలేడు... అనవి విషయాలేవీ నువ్వు పట్టించుకోకు' అన్నాడతను.

ఎటువంటి సమస్యనయినా నిబ్బరంగా ఎదుర్కొనే ధైర్యం అతనికి ఉంది. అటు

వంటి వ్యక్తి స్నేహంలో నా జీవితంలో ఒక అధ్యాయం గడిపాను...మా కుటుంబ సమస్యలనెన్నిటినో పరిష్కరించుకున్నాను ...దేనికీ భయపడనవసరం లేకుండా త్వరలో అతడే నావాడవుతున్నాడు ఇంక భయం దేనికి! ఆ తృప్తితో మనస్సు కుదుటపరచుకున్నాను.

నాల్గు రోజుల్లో మాధవీ, వేణుగోపాల్ నుంచి అభినందన లేఖలువచ్చాయి. వారి పరిహాసాలతో వలపు తలపులు మేలుకలెత్తాయి. మనస్సులో రమ్యహర్మ్యాలను నిర్మించుకొని మధురోహాలల తూగుటుయ్యాలలో ఊగులాడను.

రాఘవరావుగారి సలహామీద ఇంటికి ఎలక్ట్రికల్ వైరింగు పూర్తి చేయించారు నాన్నగారు. చాలారోజులుగా వాయిదా వేస్తూవచ్చారు. కాని, శుభకార్యాలు రానున్నయని ఆయనకే వేషప్రుష్టి దగ్గరుండి పని జరిపించారు. విద్యుద్దీపాలకాంతులతో ఇంటికి క్రొత్త అందంవచ్చింది. మా మనస్సులకు సరిక్రొత్త ఆనందం ఇచ్చింది!

*　　*　　*

శుభాలుకూడ ఒకదానివెంట ఇంకొకటి ఉప్పొంగివచ్చి ఉక్కిరి బిక్కిరి చేస్తుంటాయి ఒక్కోసారి.

కులాసాగా తిరుగుతున్న పిన్ని ఒకరాత్రి వేళ గంటసేపు నెప్పులతో బాధపడి మంత్రసాని వచ్చేలోపలే సుఖప్రసవమయింది. ఆడపిల్ల పుట్టింది.

'...మళ్ళీ సరోజిని పుట్టిందిరా అబ్బాయీ!' అని బామ్మ అన్న మాటలతో మా గుండెలు గుమ్మడి పళ్ళంతయ్యాయి.

మాతృ శ్రీ అయిన గర్వంతో పిన్ని కళ్ళు వింతకాంతుల్ని విరజిమ్మాయి. ఇల్లెగిరిపోయేలా ఏడుస్తున్న పాపాయిని చూసి నేను ఎగిరి గెంతినంత పనిచేసాను. కొన్నేళ్ళుగా కరవైన కళాకాంతులు ఇంటిలో వెల్లివిరిసాయి,

తెల్లవారేసరికి అభివమానులంతా అభినందనలందజేస్తుంటే నాన్నగారు ఉక్కిరిబిక్కిరయ్యారు.

'...రాధమ్మ పెళ్ళయి అత్తారింటికి వెళ్ళిపోకముందే ఆలోటు భర్తీచేయటానికి శేఖరానికి పాపాయి పుట్టింది' అన్నారు రాఘవరావుగారు.

పురుడు పదిరోజులు ఇంట్లో వాడావిడితో సరిపోయింది నాకు. పదకొండవ రోజున పిన్నికి నీళ్ళుయిపోయాక బామ్మ పట్టుమీద బాలసారె జరిపించారు. నాన్నగారు పాపాయికి 'సరోజిని' అని పేరు పెట్టారు.

పెద్దలంతా ఉండగా రాఘవరావుగారి సలహామీద శాస్త్రులుగారిచేత మా పెళ్ళి ముహూర్తం పెట్టించారు నాన్నగారు. అప్పటికప్పుడే మాధవి కార్యానికి కూడ ముహూర్తం పెట్టించారు రాఘవరావుగారు. మే నెలలో రెండు శుభకార్యాలు జరగాల్సి



పెద్దలు నిర్ణయించారు.

సాయంత్రం పిన్ని గదిలోకి వెళ్ళాను. పాపాయి ఇంకా నిద్రలేవలేదు. బాలింతరాలుగా పిన్ని ముఖం వింత శోభతో ప్రకాశిస్తోంది. ఆమె పరాకుగా ఇంటికప్పుపైపు చూడటం గమనించాను. ఆమె కనుకొలకుల్లో రెండు అశ్రువులు చూసి నా మనస్సు చివుక్కుమంది.

మంచం పట్టెపై దగ్గరగా కూర్చుని పిన్నిని తట్టి పలకరించాను.... 'ఎందుకలా ఉన్నావు పిన్నీ!' అని కాగితంపై వ్రాసి ఇచ్చాను.

ఏమీలేదన్నట్లు సంజ్ఞచేసింది. నేను పట్టించి అడిగినమీదట తానిలా వ్రాసి చూపించింది.

'...పాపపుట్టిందని సంతోషంగా ఉన్నా నన్ను చూడటానికి వచ్చే వాళ్ళెవరూ లేరు గదా?...అని అసంతృప్తిగా ఉంది.'

నాగుండె నీరయింది. ఏమని ఆమె కోదార్చాలో తెలియలేదు. 'నువ్వు బాధపడకు పిన్నీ! నీకు మేమంతా కావాల్సిన వాళ్ళము కామా? ఈ సంతోషసమయంలో నువ్వు గతాన్ని గుర్తుచేసుకొని బాధపడటం నాకు బాగోలేదు' అని వ్రాసి చూపించాను.

'మీరున్నారనే నాకు ధైర్యం ...' ముఖాన్ని ప్రసన్నం చేసుకుంటూ నా చేతిని తన పెదవులకు రాచుకుంది ఆమె.

మరోసారి పాపాయి గురించి తన భయాన్ని వెలిబుచ్చింది...'నా పాపకూడ నాలా మూగదయిపోదుకదా! నేనెటువంటిదాన్నయినా దేవ

# రాగధార

తలవంటి మీరంతా నా చుట్టూ ఉన్నారు కనుక నాకు ఏ బాధలులేవు. కాని ... ముందు ముందు నా పాప ఏటువంటి కష్టాలు పడాల్సివస్తుందో!'

నేను విచలితురాలినై ఆమె నోదారుస్తూ ఇలా వ్రాసిచ్చాను. 'నోరున్నవాళ్ళకు మూగవాళ్ళను పుట్టించిన దేవుడు మూగవాళ్ళకు మూగవాళ్ళనే పుట్టిస్తారని ఎందుకనుకోవాలి పిన్నీ! పాపాయి చక్కగా మాట్లాడుతుందని శాస్త్రులుగారు జాతకచక్రం వేసి చెప్పారు...నువ్వేమీ భయపడకు అపురూపంగా పుట్టిన పాపాయి భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది.'

నామాటల కామె ముఖం తేటపడింది. ఆమెలో కలిగిన శంకలవంటివే నాలోనూ కలిగి ముందు మధనపడ్డాను. కానీ, విచిత్రమైన భగవల్లీల గుర్తుకువచ్చి సమాధానపడ్డాను. జీవితం వడ్డించిన విస్తరిలా ఉన్న వాళ్ళు వికృతమనస్కులయి ఇతరులను కష్టపెట్టి తాము కష్టాల్లో ఇరుక్కోవటం నాకు తెలుసు. ఆ విధిని వాళ్ళు తప్పించుకోలేకపోయారు. ఏ అంగవైకల్యమున్నా అభిమానుల ఆదరణతో తమ దుఃఖాలన్నీ మరచి బ్రతుకును బంగారుబాటగా చేసుకున్న వాళ్ళనూ చూశాను. మా ఇంటిలోనే అటువంటి వ్యక్తులుండటం స్వానుభవంపై నాకు తెలుసు. విధి చిన్నచూపు చూసినా ఆత్మీయుల ఆశ్రయ

వలో జీవితాన్ని వాళ్ళు పూలనావగా చేసుకున్నారు. ఈ విమర్శలో విధియొక్క అద్భుతచర్యలు నాకు చక్కగా అవగాహనమయ్యాయి. దుఃఖితహృదయులు దిగజారిపోకుండా విధి ఎప్పుడూ ఒకమార్గాన్ని చూపిస్తూనే ఉంటాడు...తన్ను వారికి గుర్తుచేస్తుంటాడు. ఆ నమ్మకమే వారిని అతనికి దగ్గరగా తీసుకువెడుతుంది.

అందుకనే పిన్నికోసమయినా పాపాయి జీవితాన్ని ఉజ్వలపరచమని దైవాన్ని ప్రార్థించాను.

* * *

పరీక్షలు వ్రాసి వచ్చింది మాధవి. ఇంక నా పెళ్ళి నెలరోజులుంది. జరగబోయే శుభకార్యం గురించి ఏదో పరిహాసంగా మాట్లాడుతోంది ఆమె. ఆమె చమత్కారపు లకు నవ్వుకుంటూ నేను పూర్తిగా ఆమె ఒడిలో వివశురాలినై ఉన్నాను.

ఇంతలో రాజా తుపాకి గుండులా లోపలికి దూసుకు వచ్చాడు. వాడి ఒగర్పు చూసి నేను కంగారుగా పైకిలేచి 'ఏమిట్రా ఆ కంగారు? ఏం జరిగింది?' అని అడిగాను.

'...మరేమోనే ... మరేమోనే ... మన మాస్టారు...' వాడు ఆయాసపడుతున్నాడు.

నా గుండె గుభిల్లుమంది. '...మాస్టారికేమయిందిరా...చెప్పు...' అని దాదాపు అరిచాను.

'మాస్టారికేమీ కాలేదక్కా!... ఆయన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేశారుట ... స్కూల్లో అంతా గొడవగా ఉంది...'

అతని క్షేమవార్త విని కొంత కుదుటపడినా రాజీనామా ఇచ్చాడని విని తెల్లబోయాను. అలా ఎందుకు జరిగిందో అర్థం కాలేదు.

'...నువ్వు అనవసరంగా కంగారు పడకే అనూ!...అదే నిజమయితే ఇంకాసేపట్లో అతనే వచ్చేస్తాడుగా! ఏమిటో కనుక్కుందాం...' మాధవి మాటలు పూర్తికాకుండానే సీతామణి వచ్చింది. '...ఇదిగో నేను చెప్పింది నిజమయింది చూశావా?...' అని అంటూ.

'ఏమిటి?' అన్నాను అన్యమనస్కంగా.

'మాస్టారిని ట్రాన్స్‌ఫరు చేయించాలని రంగరాజు ప్రయత్నాలు చేస్తున్నాడని నేనన లేదూ? ఇవేళ ఆర్డర్సు వచ్చాయిట....'





అంది సీతారాణి.

'అయితే, అందుకనే ... ఆయన రాజీనామా ఇచ్చి ఉంటారు...' అన్నాను నేను.

'వెనక ముందు ఆలోచించకుండ ఏమిటా పని?...' అని విసుక్కుంది మాధవి.

'...ఏరా రాజా! మాస్టారింకా అక్కడే ఉన్నారా? వస్తున్నారా?...' అని ఆమె అడిగింది.

'హెడ్మాస్టారి గదిలో ఉన్నారు...మాస్టర్లంతా అక్కడే ఉన్నారు...మా స్కూలు ప్రెసిడెంటు లేడూ? వాడేమో బయట పిల్లలందర్నీ పోగేసి ఏదో చెప్తున్నాడు వాళ్ళకందరికీ...స్కూల్లో అంతా గొడవగా ఉందనుకో!' అన్నాడు రాజా.

మేమంతా ముఖా ముఖాలు చూసుకున్నాము. 'అయితే, పెద్ద గొడవయ్యేలా ఉందన్న మాట!' అంది మాధవి.

నేనాత్రుత నాపుకోలేక, 'నువ్వు బళ్ళోకి పోయి ఏం జరుగుతోందో చూసి రారా రాజా!' అన్నాను. వాడు ఒక్క గెంతులో వీధిలోకి వెళ్ళిపోయాడు.

సాయంత్రం నాన్నగారు, అతను కలసి వచ్చేవరకు నా మనస్సు మనస్సులో లేదు.

'ఏమిటి నాన్నా? ఆయన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారుట?'

'అవునమ్మా! ఇక్కడ నుంచి ట్రాన్స్ఫర్ చేసారు. ఉన్నాడుగా ప్రబుద్ధుడు! ఏ విధంగానయినా మనల్ని పరాభవించాలనుకుంటున్నాడు. కాని, ఇప్పుడు వాడికే పరాభవం జరిగింది. అతను రాజీనామా ఇచ్చి బుద్ధొచ్చేలా చేసాడు...'

'...అయితే మరి...' ఏమనాలో తెలియలేదు నాకు.

'ఇది కాకపోతే ఇంకొకటమ్మా! టౌన్లో కాలేజీలోనే రెండు ఖాళీలున్నాయిట. ఎప్పటి నుంచో అక్కడివాళ్ళు రమ్మని అతన్ని పిలుస్తున్నారు. అక్కర్లేదన్నవాళ్ళని వీళ్ళని పట్టుకొని ప్రాకులాడట మెందుకు? ఇంత కన్న పెద్ద ఉద్యోగము...కోరి పిలుస్తున్నప్పుడు కాలేజీలో చేరటమే మంచిది కదా!... పైగా ఇక్కడికేమంత దూరం కూడా కాదు. నువ్వు మమ్మల్ని చూడాలనుకున్నా, మేము నిన్ను చూడాలనుకున్నా అరగంట ప్రయాణం...'

ఊళ్ళోని ఉద్యోగం పోగొట్టుకున్నామని విచారంగా ఉన్నా నాన్నగారతని చర్యను హర్షించటం నాకు తృప్తి కలిగించింది.

కాని, రాజు వచ్చి '... రేపు మా





కాశ్మీర్ బొకే యొక్క అవ్యక్త మధుర సౌరభాలకు వశ్యులై పొండి. మీ సేద దేర్చి, మీకు ఊరట గూర్చి, మిమ్ము చల్లగా, ఉల్లాసవంతంగా ఉంచగల, పూరేకుల వలే మృదువైన, సౌందర్య సాధకమైన టాల్కు. సౌమ్యముగా అంటి పెట్టుకొనియుండే దాని వినూత్న సుమ సౌరభం గంటల తరబడి అవ్యక్తంగా మిమ్ముల నావరించి యుంటుంది.




క్రొత్త సర్వశ్రేష్ఠమైన సుమసౌరభముల
సమ్మోహనకరమైన సమ్మేళనం!

CB.G.24 TE

స్కూల్కి స్ట్రైకు అట అక్కా!...' అని చెప్పేసరికి ఆశ్చర్యపోయాను.

'ఏం, ఎందుకని?...

'...మాష్టారిని వూరు నుంచి వెళ్ళనివ్వకుండా చేయాలని...'

నాకు అంత ఆశ్చర్యంలోను నవ్వు వచ్చింది.

'అనవసరంగా పిల్లలంతా ఆవేశపడుతున్నారు...' అన్నాడతను.

వెనకాలే వచ్చిన హెడ్మాస్టరు, ...అవసరమైతే పెద్దవాళ్ళే ఆవేశపడతారోయ్' అని నవ్వారు. ఆయన వెంట రాఘవరావుగారు, కర్ణంగారు, మరో ముగ్గురు మాష్టర్లు వచ్చారు. అంతమంది రావటంతో అక్కడ నిలబడలేక లోపలికి వెళ్ళిపోయాను.

రెండు గంటలసేపు పెద్దలంతా బయట మాట్లాడుకుంటూనే ఉన్నారు. వాళ్ళ సంప్రదింపులను బట్టి నాకు జరిగినదంతా తెలిసింది.

ట్రాన్స్ఫర్ ఆర్డరు రాగానే హెడ్మాస్టరు రంగరాజుగారి దగ్గరకి వెళ్ళి తనకాయన చేసిన ప్రయత్నాలేమి తెలియనట్లు, '.. మా స్కూల్లోని అతిముఖ్యమైన టీచరుని బదిలీ చేస్తున్నారు. ముఖ్యంగా ఇది విద్యార్థులకు దెబ్బ. మీరు కలగజేసుకుంటే ఆయన్నిక్కడ ఉంచుచేయించవచ్చు.' అని సలహా యిచ్చారుట.

# రాగధార

తానంత కంటె తెలివిగా, '...ఇటువంటి చిన్న విషయాల గురించి పెద్దవాళ్ళనేమని పట్టుకు ప్రేలాడుతాము. పొనిద్దురూ!...' అన్నాడుట రంగరాజు.

'... అందరి మంచికోసం చెప్పాను. ఆపైన మీ యిష్టం...' అని హెడ్మాస్టరు వచ్చేసారు.

కర్ణంగారు చేసిన ప్రయత్నాలు కూడ వృధా అయ్యాయి. కామేశంగారితో లాలోచీపడి కర్ణంగారు తన్ను లొంగదీయాలనుకుంటున్నాడని నిష్ఠురమాడాడట రంగరాజు. '.. ఒక మంచి పనికి నలుగురి అభిప్రాయం అడగటం మంచిది కాని ఒక చెడ్డపనికి ఎవరి సలహాని అడగనక్కరేదు. మీరు పదవిలో ఉన్నవాళ్ళు కనుక ఊరు మంచి కోసం మీ యందుండే గౌరవం కొద్దీ ఈ సలహా ఇచ్చాను. ముందు ముందు పరిస్థితులెలా ఉంటాయో చెప్పలేను. కాని, బడిపంతులు కదా అని చిన్నచూపు చూడకండి. ఎటువంటి పరిణామాలనయినా మనం ఎదుర్కోవలసి వస్తుంది...' అని హెచ్చరిక చేసారు కర్ణంగారు.

సాయంత్రం స్కూలు పిల్లలంతా కలసి హెడ్మాస్టరుగారి దగ్గరకి వెళ్ళి, 'మాధవరావు మాస్టారు రాజీనామా ఇవ్వటం మా దురదృష్టం. ఆయన్ని వెళ్ళకుండ చూడండి.' అని ప్రతిమాలేరు.

'...ఆయన్నిక్కడ నుంచి ట్రాన్స్ఫర్ చేసారు కదామరి! అందుకనే ఆయన రాజీనామా ఇచ్చారు' అని హెడ్మాస్టరు అన్నారు.

'అయితే ట్రాన్స్ఫర్ ఆపుచేయించటం ఎలా?' అని విద్యార్థులు అడిగారు.

'ప్రెసిడెంటుగారు తలుచుకుంటే అదెంతపని?' హెడ్మాస్టరు పిల్లల్ని ప్రోత్సహించినట్లే చేసారు.

'అయితే రేపు మేము స్ట్రైక్ చేస్తున్నాం మాస్టారూ!...' అని విద్యార్థి నాయకుడు చెప్పాడు.

'మీకోసం మాధవరావు మాస్టారిని ఇక్కడ ఆపుచేయటమే నా ఉద్దేశ్యం కూడ. కాని, మీరు ఎటువంటి దౌర్జన్యాలకు దిగటం నా కిష్టం లేదు. మీరు ప్రశాంతంగా స్ట్రైక్ చేస్తానంటే నాకభ్యంతరం లేదు. మీ అభిప్రాయాన్ని వెంటనే డి.ఇ.ఓ. గారికి తెలియబరుస్తాను' అన్నారుట హెడ్మాస్టరు.

విద్యార్థి నాయకుడు స్ట్రైక్ నోటీసు ఇవ్వటం, హెడ్మాస్టరు వెంటనే ఆ విషయాన్ని డి. ఇ. ఓగారికి తెలియబరచటం జరిగింది. ఈ బదిలీని వెంటనే రద్దు చేయకపోతే విద్యార్థుల సమ్మె తీవ్రతరం కావచ్చని హెడ్మాస్టరుముందే డి.ఇ.ఓగారికి హెచ్చరిక చేసారు.

'...మా విద్యార్థులపై నాకు విశ్వాసమున్నా స్ట్రైక్ అన్నాక కొందరి అల్లరి మితిమీరుతుందేమోనని నా భయం. అందులో దేశం నలుమూలలా చిన్నదానికి చితకదానికి పిల్లలు స్ట్రైక్లోకి దిగటం అనేకచోట్ల దారుణ సంఘటనలు జరగటం మనం వింటూనే ఉన్నాము. మన జాగ్రత్తలో మనం ఉండటం మంచిది. అవసరమయితే వెంటనే పోలీసులకి కబురు పంపవలసి రావచ్చు...' అన్నారు హెడ్మాస్టరు.

'...జరగబోయేది ఎలా ఉన్నా ముందు మీరు మాటలతో హడలగొట్టేస్తున్నారు మాస్టారూ!' అన్నారు రాఘవరావుగారు నవ్వుతూ.

'లేదండి. చిన్నపామునయినా పెద్ద కర్రతో కొట్టాలన్న సామెత మరచిపోకండి. విద్యార్థుల కోరికలెంత సబబయినప్పటికీ దౌర్జన్యం మంచిది కాదు కదా!



అనలయినంటి ఈ పరిస్థితికి రాకుండానే పెద్దలు వాళ్ళ కోరికల్ని తీర్చివేయాలి. అది ఇప్పుడు జరగలేదు. ఇక పరిస్థితి ఎదుర్కోవటమే గతి... మా స్కూలు పిల్లల్లో నా కెటువంటి దురభిప్రాయమూ లేదు...కాని. వాళ్ళే పరిస్థితిలోనయినా సహనాన్ని కోల్పోతే?...అదే నా భయం!...'

హెడ్మాస్టారి సందేహాలు నిజమయ్యాయి.

ఆ మరునాడే వేయిమంది స్కూలు పిల్లలు ఊరంతా నినాదాలుచేస్తూ ఊరేగింపుగా ప్రెసిడెంటుగారింటికి వెళ్ళారు. తనకేమీ తెలియదు పొమ్మన్నాడుట ఆయన.

'...మాధవరావు మాస్టారి ట్రాన్స్‌ఫర్ ఆపువేయించినట్లు ఆర్డర్లు వచ్చేవరకు నేను మంచినీళ్ళయినా ముట్టను. ఇక్కడే మీ యింటిముందే నిరసనవ్రతం చేస్తాను...' అన్నాడుట విద్యార్థి నాయకుడు.

రంగరాజగారు పరుషంగా మాట్లాడాడు. పిల్లలు ఉద్రేకపడ్డారు. అందరూ తలోకర్రా తీసుకొని ఆయన ఇంటిమీద పడబోయారు. ఆయన తనముందు జాగ్రత్తలోనే ఉన్నారు. పాతికమంది రౌడీలను బాణాకర్రలతో సిద్ధంగా ఉంచుకున్నారు. జరగబోయే బీభత్సం వెంటనే గ్రహించుకొని వాళ్ళనందరినీ తిరుగుముఖం పట్టించి మా ఇంటికి తీసుకువచ్చాడు విద్యార్థి నాయకుడు.

పెద్దయెత్తున 'అతనికి' జే జే లు చెపుతూ విద్యార్థులు నినాదాలు చేసారు. ప్రెసిడెంటుగారు అన్నమాటల్ని విద్యార్థి నాయకుడు చెప్పి, '...ఏది ఎలా జరిగినా మిమ్మల్ని ఊరినుండి వెళ్ళనివ్వము. ఈ యుద్ధంలో విజయం సాధించేవరకు మేము పోరాడదలుచుకున్నాము...' అన్నాడు.

'మీ అందరి అభిమానానికి నేను కృతజ్ఞుడిని. నేను ట్రాన్స్‌ఫర్ ని గురించి రాజీనామా ఇవ్వలేదు... కాలేజీలో ఉద్యోగం వచ్చింది. అందుకని' అన్నాడతను.

'ఉహూ! మేము నమ్మం మాస్టారూ! మాకేదో నచ్చచెప్పదామని అలా అంటున్నారు మీరు. మీరు కావాలనుకుంటే కాలేజీలో ఉద్యోగం మీకెప్పుడో వచ్చుండేది. మీరు వచ్చేనెలలో మా ఊరి అమ్మాయిని పెళ్ళి చేసుకుంటున్నారని మాకు తెలుసు. అటువంటప్పుడు ఊళ్ళోని ఉద్యోగం వదులుకొని వెళ్ళిపోదామనుకుంటున్నారంటే ఎలా నమ్మమంటారు...?'

లోపలనుంచి ఈ మాటలు వింటున్న నాకు సిగ్గు ముంచుకొచ్చింది. మా పెళ్ళి విషయం స్కూలు పిల్లలకు కూడ తెలిసిపోయిందన్నమాట!

'...మీరు మా కోరికలని మన్నించి ఈ ఊళ్ళోనే ఉండిపోండి. మిమ్మల్నిక్కడనుంచి దేవుడుకూడ ట్రాన్స్‌ఫర్ వేయించలేడు. మేము ఈ యుద్ధంలో సాధించి తీరుతాము...' అన్నాడు విద్యార్థి నాయకుడు.

'ఇంతమంది తమ్ముళ్ళు కోరుకుంటే నేనెక్కడికి వెళ్ళిపోగలను? నేనిక్కడే ఉంటాను. కాని, నా గురించి మీరు మీ పెద్దవాళ్ళను నొప్పించటం నాకు బాధగా ఉంటుంది. మీరెటువంటి దౌర్జన్యాలకు దిగనని నాకు మాటివ్వండి...' అన్నాడతను.

'మేమెటువంటివాళ్ళమో మీకు తెలియదా మాస్టారూ! బలప్రయోగంతో ప్రెసిడెంటుగారిని లొంగదీయాలని అనుకుంటే ఈపాటికి ఆయన ఇల్లు నేలమట్టమై ఉండేది. మేము మంచికోసం మంచిగానే పోరాడుతాము. మాకు విజయం కలగాలని మీరు ఆశీర్వదించండి...'

అతను కొంతసేపటివరకు మాట్లాడలేకపోయాడు. ఆర్ద్రకంఠంతో, 'సరే, క్షేమంగావెళ్ళి దిగ్విజయంగా తిరిగిరండి...' అన్నాడు.

జయధ్వానాలు చేస్తూ పిల్లలంతా వెళ్ళిపోయారు. ప్రెసిడెంటుగారింటి ఎదురుగా విద్యార్థి నాయకుడు నిరాహారదీక్ష ప్రారంభించాడు. పిల్లలంతా చందాలు పోగుచేసుకొని కొంతడబ్బు పోగుచేసారు. ఒక పందిరివేసి అక్కడ వంతులవారీగా తమ

## ఘోష

కవిత్వం రాద్దామని బుద్ధిపుట్టిందో కమ్మని సాయంత్రంపూట
నలుగురూ నచ్చేటట్లుగా పదుగురూ మెచ్చేటట్లుగా
'ఇది కవిత్వం' అనిపించేటట్లుగా రాద్దామనుకున్నాను.
సిసలైన విప్లవ కవిత్వమొక్కటే చదువరుల
హృదయాంతరాళాల్లోకి చొచ్చి పోగలదనిపించింది.
చిత్తశుద్ధి కొక్కి, కర్తవ్య బుద్ధి కొక్కి ముందుకు సాగాను.
    'అమాయకుల్లారా! తినటానికి తిండిలేదు!
    కట్టుకోవటానికి బట్టలేదు!! ఉండటానికి
    ఇల్లైనా లేదు!!! ఎందుకీ పాడు బ్రతుకు!!!!?
రాసేనాడున్నాడని చదువరులభిప్రాయపడవచ్చు!
ఏకంగా పోకడనే విలకడనే మార్చేయాలి.
    'డొక్కలు అదుక్కుపోయాయి! పిక్కలు చెక్కల్లా
    తయారయ్యాయి. నాలుకలు పిడచలు కట్టాయి!...'
ఏనాటి మీ చదువగలనని పాఠకులు భ్రమపడగలరు!
    'మీలో ప్రవహించవలసినది రక్తంకాదు! కర్తవ్యత!!
    మీరు తినవలసినది తిండికాదు! బండరాళ్ళు!!
    మీరు త్రాగవలసినది నీరుకాదు! పీడితుల కన్నీరు!!...'
'సరసుని నరాసరి చెప్పరాదూ?' అనేది రాబోయే వ్యాఖ్య!
    'అదుగో అల్లంత దూరాన ఉంది మన లక్ష్యం!
    సాధించే దాకా మనమందరమూ ఒక పక్షం!
    చేరుకునేదాకా మనం చెయ్యబోని త్యాగంలేదు,
    త్యజించని వస్తువులేదు, వర్జించని వాసన లేదు.'
'ఇంతకీ నీబాధేమిటయ్యా మహానుభావా!'
పాఠకుడే మంటాడో తలచుకుంటే భయమేసింది.
కవిత్వం పేర నేను అవస్థపడి పాఠకుడిని
ఇబ్బంది పెట్టడం మంచిది కాదని తెలుసుకున్నాను.
అయినా నేను విప్లవ కవిత్వ రచన కనర్హుడినేమో!
ఇంతటిలో ఈ అభిప్రాయం విరమించడం మంచిది.

— మల్లాది [illegible] శాస్త్రి

నాయకుని కాపాడుకొంటూ దీక్షను నిరా ఘాటంగా కొనసాగించారు.

పిల్లలంతా ఏదో మూర్ఖంగా తగవు లాడుతున్నారని మొదట్లో చాలామంది గ్రామస్థులు భావించారు. అందువల్ల ఎవ్వరూ ఈ విషయాన్ని పట్టించుకోలేదు. కాని, మూడురోజుల విద్యార్థుల దీక్ష కొంత సంచలనానికి కారణమైంది. పలువురువచ్చి వాళ్లను ప్రశ్నలువేస్తూ విషయాలు తెలుసుకోవటం ప్రారంభించారు. అప్పటికి కాని 'అతని' వ్యక్తిత్వం పిల్లలనెంతగా ఆకర్షించినదీ గ్రామస్థులు గ్రహించలేదు. దానితో పలువురికి రంగరాజు దుశ్చింత బోధపడింది. ఇంతలో మరొక దుస్సంఘటన జరిగింది.

నాల్గవనాడు రాత్రి కామేశంగారింట్లో దొంగలు పడ్డారు. ధాన్యం గాదెకు నిప్పుపెట్టి అంతా దాన్ని ఆర్పే హడావిడిలో ఉండగా ఇంట్లోని ఇనప్పెట్టె తెరిచి డబ్బూ దస్కం దోచుకుపోయారు. అదే సమయంలో రంగరాజు కొట్టంలో పాత గడ్డి మేటు అంటుకొని తగలబడిపోయింది.

తెల్లవారేసరికి ఈ వార్తలతో ఊరంతా గుప్పుమంది. రంగరాజుగారు మరొక పుకారు లేవదీసారు — పిల్లలే ఈ దుష్కార్యాలకు దిగారని. దానితో పిల్లలు సహనం కోల్పోయారు. తన గడ్డిమేటు తానే తగలబెట్టించుకొని కామేశంగారింటిమీదకు పిల్లల పేరిట రౌడీలను పంపాడని ప్రచారం చేసారు...వాళ్ల ప్రచారం ఆఖరికి నిజమైంది కూడ. గుంపులుగుంపులుగా పిల్లలంతా రంగరాజుగారి కమతగాళ్ల ఇళ్లల్లోకిదూరి భీభత్సంచేసారు. ఇళ్లు తవ్విగోతులు పెట్టారు. రామ రావణ యుద్ధంలో వానరమూకలా విలయం తెచ్చారు. ఆఖరికి వాళ్లే విజయం సాధించారు. ఇద్దరు ముగ్గురి పనివాళ్ళ ఇళ్లల్లో దొంగిలించబడిన కామేశంగారి సంపద బయటపడింది. అవి నలుగురి ఎదుట పెట్టి రంగరాజుగారి మోసం ఊరంతటికీ చాటి చెప్పారు.

అప్పటి పిల్లల ఉద్రేకానికి ఎవ్వరూ తట్టుకోలేకపోయారు. వాళ్ళ నాయకుడు నీరసపడిపోవటం వాళ్లకు మరింత క్రోధం తెచ్చి పెట్టింది. అప్పటికే రంగరాజు రిపోర్టు అందుకొని పోలీసులు ఊళ్లోకి దిగారు కాని లేకపోతే వాళ్ళ ఆగ్రహంతో రంగరాజుగారి మేడ నేలమట్టమై ఉండేది.

సమయానికి హెడ్మాస్టారు, కర్ణంగారు అందరి మధ్యకు రావటంతో ఇరుపక్షాల వారికి ఘర్షణ జరగలేదు. జరిగిందంతా స్పష్టంగా చెప్పారు కర్ణంగారు. దానితో రంగరాజుగారి మోసం పోలీసులకి కూడ అర్థమయింది. కాని, వాళ్ళు ఏమీ చేయలేకపోయారు. కామేశంగారు తన యింట దొంగలు పడినందుకు పోలీసు రిపోర్టు ఇచ్చారు. పిల్లల సాక్ష్యం తీసుకొని ముగ్గురిని అరెస్టుచేసి పోలీసులు తీసుకుపోయారు.

విద్యార్థులదీక్ష కొనసాగుతూనే ఉంది. రంగరాజుగారి క్షేమంకోసం పోలీసుల కాపుదల ఊళ్లో అవసరమైంది. అయితే విద్యార్థులు తమ నాయకుని మాటలకు కట్టుబడి ఏటువంటి దుష్కార్యాలకు దిగలేదు.

డి. ఇ. ఓ. గారు ఐదవనాడు ఊళ్లోకి వచ్చేసరికి దీక్ష పటిష్టంగా కొనసాగుతోంది. పలువురు పెద్దల అభిప్రాయాలు ఆయన తెలుసుకున్నారు. రంగరాజుగారికి బయట ఎంత పలుకుబడి ఉన్నా ఊళ్లో పరిస్థితి పూర్తిగా ఎదురు తిరిగిందని ఆయనకు అర్థమయింది.

మరి ఏ విధంగా సంప్రదింపులు జరిగాయో నాకు తెలియదు. భవిష్యత్తు భయంకరమవుతుందని భయపడ్డాడో— లేక తన ఓటమిని గుర్తించాడో రంగరాజుగారు విద్యార్థుల కోరికను తీర్చటానికి తనకేమీ అభ్యంతరం లేదని డి. ఇ. ఒ. తో చెప్పాడట. దానితో డి. ఇ. ఓ. గారు విద్యార్థి నాయకుని అభినందిస్తూ మాస్టారి ట్రాన్స్ఫర్ ని రద్దు చేసినట్లు ప్రకటించారు.

మహా ప్రవాహంలా జయధ్వానాలుచేస్తూ వస్తున్న విద్యార్థి సమూహాన్ని చూసి ఉప్పొంగిపోయాను. అతని ఆనందానికి అవధులు లేవు. తన విద్యార్థులు ఎంతో సహనంతో దీక్ష వహించి తమ కోరికలను సాధించుకున్నందుకు, గ్రామంలో జరుగుతున్న అన్యాయాలను బయటపెట్టినందుకు తనకెంతో ఆనందంగా ఉందని...అని విద్యార్థులను అభినందిస్తూ ఉపన్యసించాడు.

నేను బత్తాయిరసం తీసి గ్లాసులో రాజుచేత పంపాను. విద్యార్థి నాయకునిచేత తానే ఆ రసాన్ని త్రాగించాడతను. ఆ గురుశిష్యుల అనుబంధానికి మనస్సు ఆర్ద్రత చెందింది. తెలిసీ తెలియని భావ పరంపరలతో తమ అభిమానాన్ని వ్యక్తం చేసుకున్నారు విద్యార్థులు. అందుకు తన అభినందనలను, అభిమానాన్ని వారిపై కురిపించాడు అతను. అతనికి జయ జయ ధ్వానాలు చేసి వెళ్లిపోయారు విద్యార్థులు.

'ఆఖరికి పిల్లలే గెలిచారు...' అన్నారు రాఘవరావుగారు.

'అలా అనటంకంటె మీవంటి పెద్దలంతా గెలిపించారనటం సబబు. దుడుకు రక్తంతో ఆవేశపడే పిల్లలను అర్థం చేసుకొని సహనంతో వాళ్ల కోరికలను మన్ని






ర్భావంతో తీర్చే పెద్దలంటే పిల్లలెప్పుడూ అభిమానించుతారు కారు...' అన్నాడు అతను.

'ఆ మాట అక్షరాలా నిజం. ఇప్పుడు దేశమంతా క్రమశిక్షణారాహిత్యంతో అరాజకమవుతున్నదంటే పిల్లలను నిందించి ప్రయోజనం లేదు. ప్రభుత్వంయొక్క అసమర్థత, గద్దెలెక్కిన పెద్దల అవినీతి చర్యలు ఈ అరాజకానికి ముఖ్య కారణాలు. ప్రజలలో సంఘీభావము లేదు. పాపభీతి, దైవచింతన, విశ్వప్రేమ అన్న మాటలు పుస్తకాలలో మాత్రమే కనిపిస్తున్నాయి. ఇంక మహాత్ముడాశించిన రామరాజ్యం ఎక్కడుంది. ఇదంతా రాబందుల రాజ్యం... రాక్షసుల రాజ్యం...' అన్నారు నాన్నగారు విట్టూరుస్తూ.

మరునాడు మాధవి వచ్చినప్పుడు '...ఆఖరికి మీ ఆయన సినిమా హీరో అయిపోయాడే!...' అంది నవ్వుతూ.

సిగ్గుతో కుంచించుకుపోతూ, 'ఛీ! ఏమిటా మాటలు?...ఎవరైనా వింటే?' అన్నాను.

'ఏం వింటే?... పుస్తె కడితే కాని మగడు కాడా? లేక ప్రియుడని అనుకోవటంలోని మజా మగడు అన్నదాంట్లో లేదా?'

'ఏయ్ మధూ!...'

'అవునే! చాలామంది ఆడపిల్లలు పెళ్ళయిన వెంటనే పెళ్ళికి ముందున్న థ్రిల్ లేకుండాపోయిందని బాధపడుతుంటారు. ఈ సైకాలజీ నాకు బాగా తెలుసు...'

'పాపం, కాపరానికి వెళ్ళకుండానే నీలో థ్రిల్ పోయినట్లుందే!'

'అబ్బే, నా విషయం కాదు నేను చెప్పేది. నేను ప్రేమించకుండానే పెళ్ళి చేసుకున్నాను. ఇక ప్రేమించటమే తరువాయి ...కాని, నీ విషయం వేరుగా!'

'పద్ధతి వేరు కావచ్చు కాని గమ్యం మాత్రం ఒక్కటే!'

'నువ్వెంత చెప్పు. ప్రియుని ప్రేమలో ఉన్న మాధుర్యం నాగని మమకారంలో ఉండదే అమ్మా! ఇది ముమ్మాటికి నిజం!'

'ఇటువంటి మాటలు పెళ్ళికాని పిల్లలకు చెప్పకు...ఇంకెవరూ పెళ్ళిళ్ళు చేసుకోరు...' అన్నాను నవ్వుతూ.

'కాని నువ్వు చేసుకుంటావు...'

'ఏం? నీ సలహా పాటించి మానేయ్యనా?'

'వద్దు బాబూ! నీ హీరోగారి తరువాత మళ్ళీ ఈ పిల్లలంతా స్ట్రైకు చేస్తే అక్కడినుంచి ఎవ్వరు పెళ్ళికొప్పించలేక నేను అవస్థపడాలి...' అంది మాధవి.

ఇద్దరం ఫక్కున నవ్వుకున్నాము.

(ఇంకా ఉంది)

# రాత్రిందివములు



ధర్మపథం. బులుసు వేంకటరమణయ్య

చీకటి వ్యాపించి ఉన్నకాలం రాత్రి భాగమని, వెలుగు ఉన్నకాలం పగలని మనం వ్యవహరిస్తున్నాం. పగటివేళ సూర్యుని ప్రకాశం వల్ల వెలుగు ఉంటుంది. అతడు కానరాని కాలం — రాత్రి చీకటి వ్యాపించి ఉంటుంది జనులు తమ నిత్య కృత్యాలను, ఇతరములైన — జీవికకోసమైన పనులను పగటివేళ ముగించుకుని రాత్రి విశ్రాంతి తీసుకుంటారు. ఆ సమయంలో వారు బాగా నిద్రపోతేనే... తిరిగి ఉదయం లేచి తమ పనులను మామూలుగా చేసుకోవడం సాధ్యపడుతుంది.

ఈ విధంగా కాలాన్ని బట్టేకాకుండా జ్ఞానాజ్ఞానాలను బట్టికూడా రాత్రిం దినాల వ్యవహారం కానవస్తుంది. భగవద్గీతలో ఇలా చెప్పబడింది—

'యా నిశా సర్వభూతానాం
తస్యాం జాగర్తి సంయమీ.
యస్యాం జాగ్రతి భూతాని
సా నిశా పశ్యతో మునేః'

సర్వ ప్రాణులకూ రాత్రిగా ఉన్న సమయంలో యోగి మేలుకొనే ఉంటాడు. ప్రాణులన్నీ మేల్కొనివుండే పగటి సమయం అతనికి నిశా సమయంగా ఉంటుంది అని దీనికి సామాన్యంగా తోస్తూ ఉన్న అర్థం. అయితే రాత్రి సమయంలో యోగనిష్ఠ కలవారు నిద్రపోకుండా మేలుకొని వుంటారని, పగటివేళల్లో నిద్రపోతూ ఉంటారనీ దీని అభిప్రాయం కాదు!

సకల భూతాలకూ నిద్రావస్థ. అంటే ఆత్మజ్ఞానంలేని అజ్ఞానావస్థ. ప్రాణులట్టి అవస్థలో ఉన్నప్పుడు, తత్వదర్శి అయిన యోగి ఆత్మజ్ఞానం కలిగి ఉంటాడు. సకల ప్రాణులకూ నిశవలె — అయోమయంగా ఉండే పరమార్థాన్ని యోగి మేలుకొని చూస్తూ ఉంటాడని అభిప్రాయం. ఆ విధంగానే సకల ప్రాణులకూ జాగ్రత్కాలము వలె ఉండి — ఆలోచించగా మాయారూపాలుగా ఉండే లౌకిక విషయాలతో ఏమీ ప్రసక్తి లేనట్లు ప్రవర్తిస్తారు. వారి దృష్టి యోగసాధన మీదనే ఉంటుంది.

అజ్ఞానులకు ఏది అక్కరలేదని తోస్తుందో వారికి ఏది అంధకార బంధురంగా ఉంటుందో — ఆ పరతత్వ జ్ఞానమే జ్ఞానులకు ఎంతో ఆవశ్యకమయి ఉంటుంది. అజ్ఞులు దేనియందు ఆసక్తులై ఉంటారో, జ్ఞానులు దాన్ని ఏంత మాత్రమూ ఆదరించరు.

రాత్రింబగళ్ళంటే యథార్థంగా రాత్రింబగళ్ళు కావు, ఆలోచించి చూస్తే వాటి అంతరార్థం వ్యక్తమవుతుంది.




'పాపా! కప్పు తీసికొని రా. చంద్రకి కాఫీ తీసికొని వెళ్దువుగాని' కాఫీ ఫ్లాస్కులో పోస్తూ అంది అమ్మ. ఫ్రిజిడేర్ తెరవబోతున్న నేను అమ్మ మాటలు విని మాట్లాడకుండ ఫ్రిజి తెరచి గుడ్డు తీసి తాగి పెంకు తీసికొని వెళ్ళి డబ్బాలో వడేశాను.

'ఏం చేస్తున్నావ్? కప్పు తీసుకు రమ్మంటుంటే?' పెర్కొలేటర్ వంట మనిషికి కడగడానికి యిస్తూ విసుగ్గా అంది. ఇక మాట్లాడకపోతే లాభం లేదని 'దయచేసి చంద్రకి కాఫీ ఎవరితో నన్నా పంపమ్మా! నా కిష్టం లేదతనికి తీసికొని వెళ్ళడానికి.' అన్నాను.

ఆశ్చర్యంతో అమ్మ కనుబొమలు వెడల్పుగా మారినాయి. 'ఏం జరిగింది?' అన్నట్లున్నాయి ఆశ్చర్యంతో కూడిన అమ్మ చూపులు.

'ఛ! అసలు బుద్ధిలేదతనికి. పెద్ద చదువు చదువుతున్నాడు గాని ఇంగిత జ్ఞానం లేని మనిషి ఒక మనిషేనా? సరదాగా తనతో నాలుగు మాటలు మాట్లాడినంత మాత్రానా లేనిపోని అర్థాలు తీస్తున్నాడు. నిన్న ఏం జరిగిందంటే'...

ఒక్క క్షణం ఆగి అమ్మని చూశాను.

రైస్ కుక్కర్ గిన్నెలో బియ్యం పోసి, కప్పుతో నీళ్లు కొలిచిపోస్తూ నా మాటలు వింటూంది అమ్మ. పెర్కొలేటర్ కడుగుతూ మాటలు విననట్లు నటిస్తూంది వంట మనిషి.

'నిన్న ఏం జరిగిందంటే తోటలో మొక్కలికి నీళ్ళు పోస్తూంటే, చంద్ర వచ్చి నీతో ముఖ్యమైన విషయం మాట్లాడాలి పాపా! అన్నాడు. ఏమిటన్నాను. 'అసలు నాగురించి నీకెలాంటి అభిప్రాయముందో సూటిగా చెప్పు' అన్నాడు. ఆశ్చర్యం, కోపం రెండూ చుట్టుముట్టాయి నన్ను. అనవసరంగా యిలాంటి విషయాలు మాట్లాడకు చంద్రా! అయినా నీమీద అభిప్రాయాలు ఏర్పరచుకోవాల్సిన అవసరం నాకే ముంది? అని గట్టిగా సమాధానం చెప్పానమ్మా! 'అదికాదు పాపా! ఎన్నాళ్ళనుండో నాలో రేగుతున్న భావనలకి నామీద నీకున్న అభిప్రాయం ద్వారా రూపం కల్పించాలనే ఆశతో వెయ్యి మైళ్ళ దూరం ప్రయాణం చేసి వచ్చాను. చెప్పు పాపా!' అన్నాడు.

'షటప్! ఇలాంటి ప్రసంగం యింకెప్పుడూ నా దగ్గర తేకు' అని అన్నాను. వాడవమ్మా! ఎలాంటివాడో! నేను ఎలాంటి సంకోచాలు పెట్టుకోకుండ మాట్లాడబట్టేగా యిలాంటి అర్థాలు తీస్తున్నాడు. నాలో సగం వున్నాడు పొదుగులో గాని, వెడల్పులో గాని. ఛ! యిలాంటి వాళ్లతో మాట్లాడడం నాదే తప్పమ్మా!' జీర పోయింది నా గొంతు.

'కొంచెం అదుపులో వుండడం మంచిది పాప నువ్వు. అతనెప్పుడూ అలా మాట్లాడడు. నువ్వు అతనలా మాట్లాడడానికి తగినంత చనువివ్వబట్టే అలా అడిగాడు' యిందులో అంతా నాదే తప్పన్నట్లు రైస్ కుక్కర్ స్విచ్ వేస్తూ అంది అమ్మ.

నిర్ఘాంతపోయాను నేను.

'అంటే నాదే తప్పంటావా?' దుఃఖం నా గొంతులో సుళు తిరుగుతూంది.

అమ్మ మాట్లాడకుండ మజ్జిగ చిలకడానికి మిక్సర్ ఆన్ చేసింది.

'అమ్మగా అర్థం చేసికొని మాట్లాడతావనుకొన్నాను గాని...ఛ! నాదే బుద్ధి తక్కువ నీతో చెప్పడం' అనేసి గబగబా బయటకు వచ్చేశాను.

'ఏంటి ప్రొద్దునే ఏడుపు మొహంతో ఎదురువచ్చావ్?' అన్నాడు కాఫీకోసం వంటింట్లోకి రాబోతున్న రాజన్నయ్య.

'మాటలు కొంచెం ఆలోచించి మాట్లాడు రాజా!' అని, కోపంగా అని డైనింగ్ రూంలో కొచ్చి ఆగాను అమ్మ ఏమంటుందోనని.

నేనాశించినట్లే అమ్మ 'ఎప్పుడూ వుండే ఏడుపేగా. ఇందులో క్రొత్తేం వుంది' అన్న మాటలు వినబడ్డాయి. నిర్లక్ష్యంగా నవ్వుకొని మేడమీద నా గదిలోకి వెళ్లి పోయాను.

చదువుకోవడానికి పుస్తకం తెరచి ముందుంచుకొన్నాను గాని మనస్సు దాని మీద లగ్నం కావటంలేదు. ఎందుకో చిరాగ్గా, చేతిలోవున్న పుస్తకాన్ని చిన్న చిన్న ముక్కలుగా చింపి పారేయాలన్నంత విసుగ్గా వుంది. అమ్మ తరహా నాకెప్పుడూ విచిత్రంగా, విడ్డూరంగా కనబడ్తూంది. ప్రేమగా అమ్మ సమీపానికి వెళ్తే, తిరిగి వచ్చేటప్పుడు మనస్సు బరువుగా మారి పోతూంది. అమ్మ తనకు తెలియకుండానే పరోక్షంగా నన్ను ద్వేషిస్తూందని అమ్మకు —అనుభవిస్తున్న నాకు తెలుసు. కాని విచిత్రమేమిటంటే— నేనెప్పుడూ నన్నెందుకిలా ద్వేషిస్తావని ప్రశ్నించలేదు. కాని—కాని—ఈరోజు నన్ను నేను నిగ్రహించుకోలేక నీతో చెప్పడం నాదే పొరబాటని అనేస్తే, విన్న అమ్మ విస్తుబోయి చూడడం నేను స్పష్టంగా గమనించాను.

నన్నెందుకు అమ్మ ద్వేషిస్తుందో నాకు కారణం తెలుసు. కాని ఆ కారణాన్ని మాపే శక్తి నాకు — మరెవ్వరికీ లేదు. అందుకు నేనేం చేయగలను? అంతలా ద్వేషిస్తే మాత్రం ఉచితానుచితాలు తెలియవా? నోటికి ఎలాతోస్తే అలాగేనా? ఇలా అమ్మని నాలో నేనే విమర్శించుకొంటుంటే పూర్వం జరిగిన సంఘటనలు జ్ఞాపకానికి వస్తున్నాయి.

నేను పి. యు. సి. చదువుకొనే రోజుల్లో దసరా సెలవులవి. నేను అక్కయ్య యిద్దరూ ఫ్రెండ్ యింటికి వెళ్లి తిరిగి వస్తూంటే మధ్యలో వర్షం పట్టుకొంది. వర్షం అంటే నాకు చాలా సరదా కాబట్టి ఆగివెళ్దామన్న అక్కయ్యని బలవంతంగా వర్షంలో తడిపేస్తూ, ముద్దగా తడిసిపోయి నవ్వుకొంటూ యింట్లో అడుగు పెట్టిన యిద్దర్నీ, డ్రాయింగ్ రూంలో కార్నర్ టేబిల్ దగ్గర ఫ్లవర్‌వాజ్‌లో పువ్వులు పెడ్తున్న అమ్మ, మా నవ్వుల శబ్దానికి వెనక్కి తిరిగిచూసింది.

నిజంగా అలా చూసినప్పుడు అమ్మ చూపులెంత కర్కశంగా వున్నాయి!

మిగిలిన మువ్వురిమీద అమ్మ చూపులు నిలిపితే వాటిలో ప్రేమ, ఆపేక్ష పొంగి చూస్తాయి.

కాని — అవే చూపులు నామీదకు వచ్చినప్పుడంతులో నిర్లిప్తత, కర్తవ్యం పొంగి చూస్తాయి.

ఆ చూపుల్ని చూస్తే చాలు. నా మనస్సు కుంచించుకు పోతుంది.

కాని — ఆ రోజు అమ్మ చూపుల్లో నిర్లిప్తత తొంగిచూడ్డం లేదు. దెబ్బతిన్న ఆడపులిలాగె కనబడింది నా కళ్లకి.

గబగబా మా దగ్గరకువచ్చి 'శాలీ! వర్షంలో తడిసావా? నిన్ననేగా రొంప, దగ్గు అంటూ డాక్టర్ దగ్గరకు పరుగులు పెట్టావ్?' అని అంటే అందుకు 'ఫరవా లేదమ్మా! ఏదో పాపకి సరదాకదా వర్షమంటే అందుకని వచ్చామ'ని సర్ది చెప్తున్న అక్కయ్యతో 'పాపకి వర్షమొక్కటే కాదు. మనుష్యుల ప్రాణం తీయడంకూడా సరదా' అనేసి వంటింట్లోకి వెళ్లిపోయింది అమ్మ. అమ్మ నోటి నుండి అంత మాటగా, అంత కఠినంగా మాటవినని నేను స్థాణువై అలాగే తడి బట్టలతో నిలబడిపోయాను. మొదట నాకసలు ఆమాటే అర్థం కాలేదు. కాని రెండు క్షణాలనంతరం అమ్మ మాటలలోని అర్థం అర్థమయి చుట్టూ చూసేటప్పటికి అక్కయ్య తల తుడవడానికి కాబోలు తువ్వాలు తీసికొని అక్కయ్య గదిలోకి వెళ్తున్న అమ్మని చూసి మెల్లగా మేడమీద నా గదిలోకి వెళ్లిపోయి, బట్టలు మార్చుకొంటూంటే 'లక్ష్మీ! మేడమీదకు వెళ్లి చెప్పు తలతుడుచుకొని, బట్టలు మార్చుకోమని. వర్షంలో తడిసిన మూలంగా మళ్లి శాలినికి రొంప, దగ్గు మొదలయ్యాయని కూడ చెప్పు' అని క్రిందనుంచి అమ్మ గట్టిగా చెప్తున్న మాటలు చెవిన పడ్తే, పేలవంగా నవ్వుకొన్నాను.

అదేం చిత్రమోగాని ప్రొద్దున లేచేటప్పటికి తలంతా బరువుగా, కళ్ళు మంటలుగా వుంటే ఎలాగో ఓపిక చేసికొని క్రిందకు వెళ్లాను. డైనింగ్ రూంలో అమ్మ మెల్లగా ఏడుస్తున్న శబ్దం, నాన్న అందుకు మందలిస్తుండడం వినిపించి కర్టెన్ దగ్గరే ఆగిపోయాను.

అమ్మ ఏడుస్తూ, 'నాకు తెలుసు దాని జాతకమే అంత. అందర్నీ పొట్టన పెట్టుకోవడమే. వర్షంలో సరదా అని శాలినిని తడిపించిన మూలంగా యిప్పుడు చూడండి 103° జ్వరం. పుట్టిన క్షణమే నాకు దైవం లాంటి అమ్మను మింగి యిప్పుడు... ఏంటిది భగవాన్?' అని అమ్మ లోలోపల ఏడుస్తూంటే, 'ఛ పారూ! ఏంటిది. పాపదా యిందులో తప్పు. అదే జ్వరం పాప కొస్తే' అని అడుగుతున్న నాన్నకి 'దానికి ఎప్పుడూ రాదు. పుట్టినప్పటి నుండి చూస్తున్నారుగా అది చీదడం గాని, దగ్గడం గాని మీరెప్పుడన్నా విన్నారా?' అనే అమ్మ మాటల్ని మరిక వినలేక గదిలోకి వచ్చి మంచం మీద వాలిపోయాను.

ఆ రోజు తెలిసింది అమ్మ నా దగ్గర

మూ తం నిండుకలా ప్రవర్తిస్తుందో.

వాళ్ళ అమ్మ నేను పుట్టిన క్షణమే చని పోవడానికి నేనే కారణమని అమ్మ భావన.

అబ్బ! ఎంత చేదు నిజం.

చిన్నప్పటి నుండి మొరటుగా దేనిని లక్ష్యం చేయని నేను ఈరోజు ఈ బాధ భరించలేక పోతున్నాను.

ఎవరో చిన్న గుండుసూది తీసికొని సూటిగా హృదయానికి గుచ్చుతున్నట్లుంది.

ఎంత దురదృష్టవంతురాలిని.

నిజానికి ఈ దురదృష్టం నాది కాదు.

ఈ గుండెకోత నాకు కాదు.

అమ్మకి-ముప్పాతికి అమ్మకే.

నలుగురి పిల్లల్లో ఒకరిని ద్వేషించడం అమ్మ దురదృష్టం.

ఆ ఒకరే తమ యింటి అశుభాలకి మూలమనే భావన అమ్మకి ఎంత గుండె కోతని కలిగిస్తుందో? నామీద నాకే అసహ్యంగా, అమ్మమీద చెప్పలేనంత జాలిగా వుంది.

ఇలా అనుకొంటూ కన్నుమూసిన నేను అలాగే నెలరోజులదాకా టైఫాయిడ్‌లో పడుకొన్నాను.

ఈ నెలరోజులు అమ్మ నాకు కేవలం ఒక నర్సుగా సేవ చేయడం తన కర్తవ్యమనే భావంతో సేవలు చేసింది.

ఆ సమయమే నాదెంత దురదృష్ట జాతకమో నిరూపించింది.

కేవలం అలాంటి ప్రాణాపాయ సమయంలో కూడ అమ్మద్వారా ఒక్కసారన్నా పూర్తిగా ప్రేమతో కూడిన చూపుకు నేను నోచుకోలేదు. అంతే—అదే ఆఖరు. మరె ప్పుడూ కూడ అమ్మ అన్నట్లు నేను

# విధిలిఖితం

పెద్దదంగాని, దగ్గడంగాని చేసినట్టు నాకే గుర్తులేదు.

అక్కయ్యకి పెళ్ళయి వెళ్ళిపోబోతుంటే ఆ బాధ భరించలేక నేను నా గదిలోకి వెళ్ళిపోయి కిటికీదగ్గర కుర్చీలో కళ్ళు మూసుకొని కూర్చొనివుంటే, అక్కయ్య నా గదిలోకి వచ్చి 'పాపా!' అని పిలిస్తే మెల్లిగా లేచి వెళ్ళి అక్కయ్య కౌగలించుకొని బావురుమన్నాను. అక్కయ్య దగ్గర తప్ప మిగిలిన యిద్దరి దగ్గర నాకు చనువు, అధికారం లేవు. అదీగాకుండ నాకు అక్కయ్యకి ఆరు సం॥ తేడా మూలాన్న అమ్మచేత కొరవయిన ప్రేమను నేను అక్కయ్య ద్వారా తాత్కాలికంగా పొందే దాన్ని. ఆ ప్రేమే కరువయి పోతూంటే కరుడు గట్టిన నా మనస్సు భరించలేక పోతూంది.

'చూడు అదేంటది? మళ్ళీ వచ్చేస్తానుగా. పాపా! నేను ఎన్నో రోజులుగా చెప్పాలను కొన్నాను గాని అలా దాటేస్తూ వచ్చేశాను. ఇప్పుడు చెప్పాల్సిన అవసరం వచ్చింది. అలా కూర్చో పాపా! చూడు తల్లీ! అమ్మ నీ దగ్గర అలా ప్రవర్తిస్తున్నందుకు కారణం నీకు తెలియదు కదూ! నీకు కూడ తెలిసింది అక్కా అన్నట్లు చూడకు. నాకు తెలుసు. అమ్మ ప్రవర్తనకు నువ్వు బాధ పడుతున్నావని కూడ తెలుసు. ఆగు, నేను బాధపడటం లేదే అని చెప్పాలని చూడకు. నువ్వు అందరి లాగ బాధపడితే బయటకు ఏడుపువ్వారా వెలువరించవు. ఎప్పుడూ తళతళ మెరిసే నీ కళ్ళు, కాంతి విహీనంగా వారి శూన్యంలోకి వెళ్ళిపోతాయి. అవి చాలు పాపా! నీ మనస్సులోని బాధని నాకు చూపడానికి. చూడు పాపా! నువ్వు పుట్టే రోజది. అమ్మకి కాన్పు చాలా కష్టమని చెప్పాడు డాక్టరు. సరిగ్గా ఈ గదిలోనే అమ్మ ప్రసవించడానికి ఏర్పాటు చేయబడింది. అమ్మపడే బాధ చూడలేక నాన్న క్రిందకు వెళ్ళిపోయారు. చివరకు అతి ప్రయాసతో, డాక్టర్ల చాకచక్యంతో నువ్వు బయటకు వచ్చావు. నా తర్వాత యిద్దరూ మగపిల్లలే. అమ్మకి నాన్నకి ఎందుకో ఆడపిల్లలంటే చాలా యిష్టం. ఇద్దరూ ఆడపిల్లే కావాలని కోరుకున్నారు. అలాగే నువ్వు పుట్టావు. ఈ సంతోష వార్త నాన్నకి అందజేయాలని అమ్మమ్మ ఆనందంతో గబగబా మెట్లు దిగబోయి అరటిపండు తిని తొక్క మెట్లమీదే రాజు పడేస్తే దానిమీద కాలువేసి జారి మెట్లమీద నుంచి క్రింద పడిపోయింది. హార్ట్ ఎటాక్ గల అమ్మమ్మ గుండె తిరిగి పనిచేయలేదు. అదే పాపా! నీ దురదృష్టం. అమ్మమ్మగారు చనిపోకుండా వున్నట్లయితే నువ్వు పెరిగినంత ముద్దుగా మరెవ్వరూ ప్రపంచంలో పెరిగి వుండరు.

పాపా! ఒక్కతే కూతురు అమ్మ అమ్మకి. అమ్మకి తన అమ్మమీద ఎంత ప్రేమంటే తనకి పెళ్ళయితే అమ్మమ్మని విడిచి వెళ్ళాలేమోనని భయంతో యిల్లరికానికి ఒప్పుకొనే అతనినే భర్తగా పొందుతానని చెప్పిందట. అలాగే నాన్నని పొందించె కూడ. నన్ను అమ్మమ్మ ఎక్కువగా ముద్దు

హరిరామ్









చేస్తే నామీద నీకు ప్రేమ తగ్గింది శాలిని పుట్టిన తర్వాత అనేదట ఈర్ష్యగా అమ్మ. చూశావా పాపా! తన రక్తం పంచుకొని పుట్టిన నన్నే అమ్మమ్మ కొంచెం ప్రేమగాచూస్తే సహించలేని అమ్మ నువ్వు పుట్టిన క్షణమే చనిపోతే సహించ గలదంటావా? అమ్మమ్మ చావుకి మూలకారణం రాజు పడేసిన అరటితొక్క. కాని ఆ మాట అమ్మ ఒప్పుకోదు. నీ జాతకఫలమే అదంటుంది.

పాపా! అమ్మమ్మపోయిన ఐదారు సంవత్సరాలదాకా అమ్మ మనస్ఫూర్తిగా నవ్వడం నేను చూడలేదు. అసలు ఆ దుఃఖం యిప్పటిదాకా తగ్గలేదు. బహుశా తగ్గదేమోకూడ. నిన్ను ఐదారు నెలలదాకా అసలు ముట్టుకునేది కాదు. తర్వాత తర్వాత నాన్న తదితరుల బోధవలన నిన్ను పెంచడం తన కర్తవ్యం, విధి అన్న భావనతో చూసింది. ఇప్పుడు కూడ అలాగే చూస్తుందని నాకు తెలుసునక్కా అన్నట్లు చూడకు. అలాంటి చూపు భరించలేను.

కాబట్టి పాపా! అమ్మ ఏమన్నా మనస్సులో పెట్టుకొని బాధపడకు. ఎందుకంటే నువ్వు బాధపడ్తే ఓదార్చడానికి ఈ అక్కయ్య నీ దగ్గర వుండదు. అందుకే పూర్తిగా చెప్పేను' అని అక్కయ్య అంటే, అలాగే అక్కయ్య గుండెల్లో తల దాచు కొన్నాను.

అంతే—అక్కయ్య వెళ్ళిపోయిన తర్వాత నేను ఒంటరిగా మిగిలి పోయాను.

అక్క పూర్తిగా అమ్మ గురించి చెప్పిన తర్వాత అమ్మ మీద చెప్పలేనంత ప్రేమగా వుండేది. కాని ఒక్కటే ప్రశ్న!

అమ్మ తన కూతుర్నే అమ్మమ్మ ప్రేమగాచూస్తే సహించలేదే. అలాంటి ప్రేమే తన కూతుర్లు కూడ తన దగ్గర నుండి ఆశిస్తారని భావించలేదా అన్న ప్రశ్న నాలో ఎప్పుడూ మెదలుతూ వుండేది.

అక్కవెళ్ళి మూడు సంవత్సరాలు గడిచింది. ప్రస్తుతం నేను బి. ఏ. ఆఖరి సం.లోకి వచ్చాను. ఇక రెండు నెలల్లో నా చదువు పూర్తవుతుంది. ఇక ఆ తర్వాత చదవాలన్న ఆసక్తి నాకు లేదు. కాని ఒక్కటే కోరిక.

కూతురుగా అమ్మ దగ్గర పొందలేని ప్రేమని భార్యగా భర్త దగ్గర పొందాలని వుంది. అది నేరమా?

అప్పుడు నా బావ నిక్కీ నా [illegible]


మైక్రోఫైన్డ్ ఆస్ప్రో

త్వరగా కరుగుతుంది,
త్వరగా ఇముడుతుంది

కనుకనే మామూలు బిళ్ళల కన్నా
రెట్టింపు త్వరగా పనిచేసి నొప్పిని తొలగిస్తుంది.

| మామూలు బిళ్ళ | మైక్రోఫైన్డ్ ఆస్ప్రో |
| --- | --- |
| పెద్ద అణువులు నెమ్మదిగా ఇముడుతాయి. నెమ్మదిగానే నివారణ | సూక్ష్మాణువులు త్వరగా ఇముడుతాయి. శీఘ్ర నివారణ |



మామూలు బిళ్ళల వలెగాక ఆస్ప్రో అతి సూక్ష్మమైన అణువులు త్వరగా ఇముడుతాయి. నొప్పిని కలిగించే చోటుకు శీఘ్రగతిని చేరి సత్వర నివారణ కలిగిస్తాయి.

మైక్రోఫైన్డ్ ఆస్ప్రోను: తలనొప్పి • ఒళ్ళు నొప్పి • జలుబు • ఫ్లూ • కీళ్ళ నొప్పులు • గొంతు నొప్పి • పంటి నొప్పులకు వాడండి

మోతాదు: పెద్దవారికి: రెండు బిళ్ళలు. అవసరమైతే మళ్ళీ వేసుకోండి. పిల్లలకు: ఒక బిళ్ళ లేక మీ డాక్టరు సలహా ప్రకారం వేసుకోవాలి.

నొప్పిని అతి శీఘ్రంగా తొలగించడానికి
ఆస్ప్రో మాత్రమే మైక్రోఫైన్ చేయబడినది

నికోలస్ (N) తయారు

A.G.37 TL.

అది పేరాశే. మొన్న ఎవరో చూడ్డానికి వచ్చి వెళ్ళిన తర్వాత నేను తోటలో కాలక్షేపానికి తిరుగుతూ వున్నాను. నాన్న ఆఫీసు గది కిటికీ బయటకు తోటలోకి వుంటుంది. దాని దగ్గరకు వచ్చి వెనక్కి పోబోతున్న నాకు, 'దీని జాతకం, ఆ అబ్బాయికి కూడ ఏమన్నా కీడు చేయదుకదా. నాకదే భయంగా వుంది' నిస్తేజంగా అంటున్న అమ్మ మాటలు చెవిన పడ్డాయి.

ఆ రోజా వర్షంలో—తడిసిన రోజా— మనుష్యుల ప్రాణం తీయడం కూడ సరదా అన్న అమ్మ మాటలకు స్తబ్ధురాలయిన

## విధిలిఖితం

నేను - మళ్ళీ — అమ్మ నా పెళ్ళి గురించి చెప్తూంటే విని ఆ స్థలం నుండి కదిలే శక్తిని కోల్పోయాను.

అందుకు నాన్న 'పారూ! పాప నీ కూతురు. దాని గురించి నువ్విలా మాట్లాడడం భావ్యం కాదు, నేను సహించలేను కూడ.' అని అంటే 'నా కూతురు, నా కూతురు' అని గొణుక్కుంటూ అడుగులో అడుగు వేసుకుంటూ వెళ్ళిపోతున్న అమ్మను ప్రత్యక్షంగా నాన్న, పరోక్షంగా నేను జాలిగా చూశాం.




కాని— ఈనాడు— చంద్ర ప్రవర్తన గురించి చెప్పితే నా వనువే అతనికా ధైర్యం ఇచ్చిందట. ఎంతటి అసత్యం పలికింది!

నిజమే. అమ్మదగ్గిర పొందలేని ప్రేమ యితరుల దగ్గిర దొరుకుతుందేమో నన్న భ్రమతో నేను అందరిదగ్గిరా గలగలా మాట్లాడేస్తాను. నా వనువే చంద్ర ప్రవర్తనకి కారణమని అమ్మ చెప్పింది. నిజమే.

కాని—అమ్మవలననే ఆ పరిస్థితి ఏర్పడిందని అమ్మకెలా చెప్పడం?

ఆనాడు పెళ్ళిచూపులకు వచ్చినవాళ్ళకి నేను నచ్చానట, ముఖ్యంగా అతనికి. ఆమాట పెళ్ళిళ్ళ పేరయ్య అమ్మా నాన్నలతో అంటూవుంటే చాటుగా విన్న నా హృదయం ఆనందంతో పొంగలేదు. మొట్టమొదటిసారిగా భయంతో, ఆందోళనతో అల్లకల్లోలమైంది.

ఆడపిల్ల కావాలని అమ్మా, నాన్న కోరుకుంటే వాళ్ళ కోరిక ప్రకారమే పుట్టాను.

కాని— వాళ్ళ కోరిక అడుగంటింది.

ఆస్థానంలో నామీద ద్వేషం పుట్టింది. నేను ప్రవేశించకముందు నేనే కావాలని కోరుకొన్న అతనికి నా ప్రవేశానంతరం అమ్మ అన్నట్లు ఏదన్నా జరిగితే?

లేకపోతే ఏ కారణం చేతన్నా నామీద ద్వేషం కలిగితే...?

ఆడపిల్ల పుట్టాలని అమ్మా నాన్నలు ఎంతలా కోరుకున్నారో ఆవిధంగా నన్ను పొందాలని అతను కోరుకొన్నాడు. కాని— కాని— భగవాన్! అమ్మ కోరికను కలిగించిన ఫలితాన్ని మాత్రం అతని కోరికకు కలిగించకు.

ఎందుకంటే 18 వసంతాలుగా ముందు జీవితం గురించి కలలు కంటున్న నాకు అవి కల్లలని తెలిస్తే బ్రతకలేను గనుక.

ముఖ్యంగా అతి మధురమని చెప్పే ప్రేమను పొందే అవకాశం జీవితంలో ఇంతదాకా నాకు కలుగలేదు గనుక.

'పాపా!' క్రిందనుండి వినబడ్డ కేకతో ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను. అప్పుడు జ్ఞాపకం వచ్చింది ఆరోజే పెళ్ళి వుందన్న సంగతి. ●

**ఎస్. ఎస్. ఆర్. హేమగిరి, ఒరిస్సా**

**రాజాజీగారు భారతాన్ని ఇంగ్లీషులోకి అనువదిస్తున్నారట నిజమేనా ?**

మీరదే దేశంబాబూ — యింత ఆలస్యంగా అందుతాయి వార్తలు! ఆయన భారతం అప్పుడే జనుదు ముద్రణలు కూడా చూసింది.

**కె. వి. ఆర్. ఎం. ఆర్, గురజాడ**

**స్త్రీకి నిదానము, నమ్రత ముఖ్యం కదా! అవి లేక కాలానికి ఎదురీదే స్త్రీలకి మీ సమాధానం ఏమిటి ?**

నిదానం, నమ్రత ప్రధానమే. కాని అవి పనిచేయనప్పుడు కాళికా రూపం దాల్చడమూ తప్పుకాదు. కార్యసాధన ముఖ్యం. వోర్చిన పనలానికి తేటనీరన్నారని— ఎన్నితరాలు వేచి ఉంటారు?

**వి. టి., చిలకపాడు**

**మానవుడు తాను నమ్మిన సత్యాన్ని సాధించడంకోసం సంఘాన్ని ధిక్కరించడం నేరమా ?**

సంఘం ఒప్పుకోని సత్యాలు లేవే!!

**జీవాత్మకు పరమాత్మకు గల భేదం ఏమిటి ?**

ప్రాణంతో ఉన్న మనిషిలోనిది జీవాత్మ. దానికి వ్యక్తిత్వాన్నిచ్చేది—పరమాత్మ. రెండూ బతికిఉన్నంత కాలం— ఘర్షణపడి చస్తాయి.

**ఎం. కె. ఎస్, గూడూరు**

**ఏదో చేయాలి సాధించాలి అని మనస్సులో ఎన్నో అనుకుంటా. కాని ఒక్కటీ చేయలేకుండా ఉన్నాను.**

మనస్సులో అనుకుంటే చాలదు. కార్యాచరణకు పూనుకోవాలి. ఎంతకాలం అనుకున్నా — చేయక పోతే పనులు జరగవు.

**ఇ. బి. వి. ఆర్, ప్రొతకోట**

**మమతలు లేకుండా మనిషి జీవించ కల్గడం సంభవమా ?**

అసంభవం. మమతలేమిటి ఆశలే కదా? ఆశలేని మనిషిని వూహించగలరా?

**ఎమ్. కె. కె, నర్సారావుపేట**

**మనదగ్గిర కట్నం పుచ్చుకుని, మనకి అమ్ముడుపోయి మనపైనే పెత్తనం చెలాయించే ఈ మగవారిని ఏమనాలి ?**

మగవారినెందుకు— ఏమైనా అనడం—ఏదైనా అనుకుంటే— మనచేత కాని తనానికి, కొనుక్కునేనా సరే భర్తల్ని సంపాదించాలన్న బలహీనతకి, మా స్వరతులమీద మా భర్తలు వచ్చేదాకా పెళ్ళి చేసుకోం—అని ధైర్యంగా చెప్పలేక పోవడానికి— మన జాతినే మనం అనుకోవాలి సోదరి.

**టి. ఏ. జె, పూరు**

**మీకు క్రికెట్ ఆట అంటే ఇష్టం**




**వుందా ?**

ఎందుకుండదు. అది ఫాషన్ కదా. మా డాక్టరుగారైతే జీవితాన్నే క్రికెట్టుతో పోల్చి 'ఒకే యిన్నింగ్సు. జాగ్రత్తగా ఆడాలి' అంటారు!

**ఆర్. వి. జి. ఆర్, ప. దిళ్ళపల్లి**

**మీ జవాబులు చూస్తూంటే వయస్సు మళ్ళినవారిలా తోస్తారు. ఫోటో ప్లీజ్.**

ఏమిటి? వయస్సు మళ్ళిన. . . . . అంటూ భావ మనరు కద! . . . . ఫోటో పంపిస్తే వయస్సు కనిపెట్టేస్తారా? మీరా పిచ్చిగాని, వయస్సు శరీరానికి వస్తుంది. మనస్సుకి కాదు.

**జి. ఎస్. ఆర్, నాగపూరు**

**...ఆరుద్రగారి రూపం మీ పరాకుని తెలియచేస్తుందన్నాడు...ఒప్పుకోమంటారా?**

చిన్న ఎమెండ్‌మెంటుతో — నా ఎడ్మిరేషను ఫలితం అనుకోమనండి.

**ఎ. వి. ఎల్. ఎస్. ఆర్, కొత్తపేట**

**మేం త్వరలో మీ యింటికి వస్తున్నాం.**

మంచిది. రెడ్‌కార్పెట్టు సిద్ధం చేస్తున్నాను.

**బి. వి. జి, శ్రీకాకుళం**

**కనులతో తెలిపేది, మనస్సుతో పలికేది ఏమిటండి ?**

ప్రేమ.

**డి. కె, నిడమర్రు** (?)

**తాము చేసే పని తప్పని తెలిసీ కొందరు దాన్నే ఎందుకు చేస్తారు ?**

ఆ తప్పువల్ల వారికేం కష్టం కలుగడం లేదు కనుక!

**కె. ఎస్ ఎస్ ఆర్, విశాఖపట్నం**

**మీరు కవిని మెచ్చుకుంటారా ? కవిత్వాన్ని మెచ్చుకుంటారా ?**

పూర్వం కవి ఎలావున్నా కవిత్వం చదవ కల్గేదాన్ని. ఇప్పుడు అలా కాదు. కవిత్వం వేరు, కవి వేరుచేసి చదివినా— కొంత కవిత్వం అర్థం కావడంలేదు. మరి నా మెదడు పదును తగ్గిందో— కవిత్వం క్లిష్టత పెరిగిందో తెలియదు.

**సి హెచ్. వి. కె, కొల్లిపర**

**స్త్రీకి జీవితంలో స్వాతంత్ర్యం ఎప్పుడు లభిస్తుంది ?**

దేనికి కావాలి స్వాతంత్ర్యం? దేనికి లేదు స్వాతంత్ర్యం— అన్ని ఉన్నాయి. లేనిది మనికి చేవ.

**సి హెచ్. బి. కె, ముప్పవరం**

**యిట్టి కరువు రోజుల్లో వరదక్షిణలు లేకుండా పెళ్ళి చేసుకునేవారిని ఏమనాలి ?**

ఎవరికి కరువు?— వరునికి కరువూ వధువుకి కలిమి గా తోస్తుందా మీకు? కొంచెం కాలం వోపిక పట్టండి అమ్మాయి తండ్రి 'మా అమ్మాయికి నెలకింత జీతం. మీ రెంత కట్నం యిస్తారు?' అని అబ్బాయి తండ్రిని అడిగే రోజులు వస్తాయి.

**ఎక్స్. ఆర్. ఆర్, ఎల్. ఎస్. ఎ.**

**సాక్ష్యంలేని నేరం చేసేవారిని ఏమనాలి?**

నేర్పరి అయిన నేరగాడన వచ్చు. గాని కనీసం మనస్సాక్షి కూడా లేని నేరం జరగడం అసంభవం! లోకానికి తాము చేసిన తప్పు తెలియకుండా చేయ వచ్చును. గాని తనకు తెలియకుండా చేయలేడుకదా,

**జి. ఎమ్. ఎస్, పెనుమండ్ర**

**దూరానవున్న దేవునిపై పైసలు కర్చుపెడతారు కాని ముష్టివానికి ఒక్క పైసా వేయ బుద్ధికాదు. ఎందుచేత ?**

నమ్మకంచేత. అయినా— ముష్టి ఎత్తడం నేరం గాని, ఈ దేశంలో దేవుని కొలవడం కాదు. ●


యువ

సచిత్ర మాస పత్రిక

ఆగస్టు 72 సంచిక నుండి

సి. ఆనందారామంగారి

'విద్య'

నవలను సీరియల్‌గా ప్రచురిస్తున్నాము. పాఠకులు ఏజంటు వద్ద తమ కాపీని ముందుగా రిజర్వు చేసుకోండి!

విడి సంచిక వెల: రూ. 1—50

సంవత్సర చందా రూ. 18—00

2 సంవత్సరాల చందా: 32—00

2 సం. ల చందా దీపావళి ప్రత్యేక సంచికతో రూ. 40—00

యువ

5—9—88, పబ్లిక్ గార్డెన్ రోడ్, హైదరాబాద్—1 (ఆం. ప్ర)

# 'మానవత భద్రత వున్న దేశమే రష్యా' - అక్కినేని

## అక్కినేని రష్యా పయనం

'రష్యాకు ప్రభుత్వ అతిథిగా వెళ్ళాను. రష్యా పయనం చాలా ఆనందంగా జరిగింది. వాళ్ళ జీవిత విధానం నాకు బాగా నచ్చింది. మరి కొన్నాళ్ళు వుంటే బాగుండేది అన్న అభిప్రాయం నాకు యేర్పడింది. వారు మనదేశ ప్రజలకు యిచ్చే గౌరవ, మర్యాదలను మరువలేను.' అన్నారు 'నట సామ్రాట్' నాగేశ్వరరావు, (న్యూ వుడ్ లాండ్స్‌లో పాత్రికేయులు యిచ్చిన డిన్నరులో).

తాష్కెంట్ ఫిలిమ్ ఫెస్టివల్‌కు రమ్మని నాకు ఆహ్వానం వచ్చింది. నాకు వెళ్ళాలనిపించలేదు. రష్యా ప్రభుత్వం అతిథిగా పిలవకుండా, ఆదేశం వెళ్ళకూడదన్న గిర నాకుండేది. 'నేను షూటింగులో పాల్గొనాలి. మీరు వెళ్ళిరండి తమ్మారెడ్డిగారు', అని చెప్పి నేను వూటీకి వెళ్ళాను. తర్వాత కొన్నాళ్ళకు నాకు, అన్నపూర్ణకు, తమ్మారెడ్డికి విదేశీవ్యవహారాలశాఖ వారినుండి ఆహ్వానాలు వచ్చాయి.

## విప్ చేసిన మంచి

రష్యాలో కామ్రేడ్‌ను వర్యారిష్ అంటారు. వాళ్ళు (ప్రజలు) ఒకప్పుడు గట్టి దెబ్బ తిని, బాగా కష్టపడి, విప్లవకు కట్టుబడి వృద్ధిలోకి వచ్చివుంటారన్న భావం నాకు యేర్పడింది.

అక్కడ నేనున్నది 20 రోజులే. నాకున్న పరిధిలో చాలా విషయాలను తెలుసుకున్నాను. రష్యాలో విలాస వస్తువులపై మోజు తక్కువ. వ్యభిచారం, దొంగతనం వాళ్ళకు తెలియని విషయం.

## 'ఆలివ్ నూనె'

మనదేశంకన్నా ఆరురెట్లు ఎక్కువ వైశాల్యం వున్న పెద్ద స్థలం రష్యాకు వుంది. అక్కడ 15 పరగణాలు వున్నాయి. 120 వాడుకభాషలు వున్నాయి. మనకి, వాళ్ళకి సామ్యం ఎక్కువ అనిపించింది — ప్రజలు బియ్యం వుపయోగిస్తారు. కాని వంటకు ఆలివ్ నూనె వాడుతారు.

## వంద జడలు

ఉజ్‌బెక్‌స్తాన్ విమానాశ్రయంలో మేము కాలూనినప్పుడు, ఆ ప్రజలు డప్పులు, వాయిద్యాలతో మాకు ఘనస్వాగతం పలికారు. అక్కడి స్త్రీలు వంద జడలు వేసుకుంటారు. నూటికి ఎనభైమంది మహమ్మదీయులు వున్నారనిపించింది. వాళ్ళ పేర్లు కూడా శర్మిలియా, షిరియా లాంటివే. కబాబ్‌ను (మాంసాహారం) ఎక్కువగా తింటారు. వాళ్ళకు చీరెలపై మోజు ఎక్కువ. నా భార్య అన్నపూర్ణ దగ్గర ఆటోగ్రాఫ్ తీసుకునేవాళ్ళు. నన్ను (చిత్రం లేదు గాబట్టి) ఎక్కువమంది అడగలేదు.

రష్యాలో ఆర్మీనియన్ స్టేట్‌ను చూశాను. మద్రాసులోని ఆర్మీనియన్ వీధిలో వున్న భవంతులులాగా, గృహనిర్మాణం జరిగినట్లు అనిపించింది. 275 బి. సి. లో సాధించిన విజయాన్ని వేడుక చేసుకున్నారు.

జారు రాజుల కాలంలో పరదేశీయులు యిచ్చిన ముత్యాలు, నాణేలు, వైఢూర్యాలను ఒకచోట భద్రపరచి వున్నారు. ప్రతి దేశ సంస్కృతిని తెలియచేసే గ్రంథాలయం కూడా వుంది.

## కోడెదూడల తోళ్లు

తాటాకు గ్రంథాలు, బంగారు రేకులపై వ్రాసిన రచనలు, కోడెదూడల తోళ్ళపై లిఖించబడిన పుస్తకాలు వేల సంఖ్యలో వున్నాయి...

రష్యాను 'యినుప తెర' అని విన్నప్పుడు నిజమేనేమో అనుకున్నాను. వెళ్ళి చూస్తే అది నిజం కాదు — రష్యాను 'బంగారు తెర' అనడం వుచితం అనుకున్నాను.

వాళ్ళు దృఢకాయులు, రంగు, భాషలో



మాస్కో ప్రముఖులతో అక్కినేని దంపతులు.

మనకీ, వాళ్లకీ తేడా వున్నా చాలా విషయాల్లో మనకీ, వాళ్లకీ పోలికలున్నాయి. కాఫీ యిమ్మంటే టిఫియర్ తెచ్చింది ఒకమ్మాయి. టిఫియర్ అంటే పెరుగు అన్నమాట.

## క్షబ్బులేని హోటలు

నేను యిటీవల నిర్మించబడిన పెద్ద హోటల్‌లో బసచేశాను. అందులో 3600 గదులున్నాయి. ఆ హోటల్‌లో ఒక క్షబ్బు కూడా కనిపించలేదు.

## ప్రభుత్వ భద్రత

కారు ఖరీదు ఎక్కువ. కారు కొనాలను కునే వాళ్ళు చాలా తక్కువ. కారు కొనాలంటే ప్రభుత్వం అడిగే ప్రశ్నలకు సరయిన సమాధానం యివ్వగలిగి వుండాలి. ప్రజలకు కావలసిన అన్ని సౌకర్యాలను ప్రభుత్వం చేసి పెడుతుంది. వాళ్లకి భద్రత వుంది. నివసించడానికి వ్యక్తి ఆదాయాన్ని బట్టి, ప్రభుత్వమే యిల్లు కట్టి, బాడుగను పుచ్చుకుంటుంది. విలాస వస్తువులు కనిపించవు. గత 10 ఏండ్లుగా సెంట్సను వాడుతున్నారని తెలుసుకున్నాను. బంగారం ధర ఎక్కువ. నగలను వుపయోగించే వాళ్లు అరుదు. నేను, నా భార్య కలిసి 80 రూబుల్స్‌ని ఖర్చు పెట్టలేక పోయాము.

## శిల్పకళా వైభవం

మాస్కోలో మెట్రోను చూచి ఆశ్చర్య పోయాను. మార్‌బుల్‌తో నిర్మించబడిన ఆ ప్రదేశాన్ని చూచి, ప్రపంచంలో యింతకంటె శుభ్రమైన ప్రదేశం మరొకటి లేదు అన్ని నిర్ణయానికి వచ్చాను. అక్కడి శిల్పకళా వైభవాన్ని చూచి అచ్చెరువందాను. ప్రతిశిల్పం దగ్గిర ఎన్నిరోజులు వున్నా, యింకా చాలదు అనిపిస్తుంది. వాళ్ళకి సంగీతం అంటే ప్రాణం.

మాస్కోలో పప్పెట్ సర్కస్‌కి వెళ్ళాను. నారింజపండును తిని, తోలును హ్యాండ్ బ్యాగులో పెట్టుకునేంత శుభ్రతను అక్కడే చూశాను. అక్కడ ఎక్కువ జీతాన్ని తీసుకునేది — సైంటిస్టు, డైరెక్టరు, ఆర్టిస్టు. ఒక కమిటీ సినిమా పాత్రను ఆతగాడే ధరించాలి అని నిర్ణయించి, ఆ పాత్రకు ఎంత పారితోషికం యివ్వాలో దాన్ని కూడ ఆ సంఘమే నిర్ణయిస్తుంది. మన స్కూల్‌కీ, రష్యాలో సినిమా పద్ధతికీ చాలా తేడా వుంది.

నేను వున్నది తక్కువ రోజులే అయినా, ఎక్కువగానే తెలుసుకున్నాను. రష్యాను మరొకసారి చూడాలనుకుంటున్నాను.

## మనదేశం ఆదేశం కాగలదా?

రష్యాలాగా మనదేశం మారాలంటే, కనీసం 150 సంవత్సరాలయినా పడుతుంది: వాళ్ళకి భూమి ఎక్కువ; జనాభా తక్కువ; ఫలితాలు ఎక్కువ; మనకి భూమి తక్కువ; జనాభా ఎక్కువ; ఫలితాలు అతి తక్కువ. మనదేశం ఆదేశం గావడం యిప్పట్లో జరగదు, అన్నారు అక్కినేని నాగేశ్వరరావు.

ఇంటర్‌వ్యూ: శ్రీనివాస్ ●


గృహిణులకు వరప్రసాదము
అతి త్వరితంగా పూరీలు, చపాతీలు, పత్రిలు తయారు చేయుటకు ఆధునిక సాధనము —
ప్రీతి ప్రెస్ ష్యాప్
కొడుపు, పల్లెము అవసరంలేదు మెత్తని పూరీలు, చపాతీలు మరియు పత్రిలు క్షణాల్లో తయారుచేయవచ్చు
PREETHI
ప్రీతి
మీ వంటగదికి
Manufactured and marketed by:
P. KESAVAN & COMPANY
P.B.No. 1129 T.D. Road, Ernakulam, Cochin-11



ముఖ్యమైన వా[illegible]
ఇప్పటినుండి, నెలకు రు. 10/— నెలసరి వాయిదాల పద్ధతిపై చెల్లించి, ప్రఖ్యాతి చెందిన 1972 మోడల్ 5 యేండ్ల గ్యారంటీ, 4 బ్యాండు వెదర్ ప్రూఫ్ "ఏర్ మార్షల్" ట్రాన్సిస్టరను కొనండి. దీనికి కలర్ లైట్ మరియు బంగారు వన్నెకాబినెట్ గలదు. ధర రు. 260/—కి మాత్రమే తగ్గించబడినది. కొనువారు తమ పూర్తి పేరును సరిగ్గాను, ఇంగ్లీషులో వ్రాసి పంపవలెను. పార్శిల్ ద్వారా పంపబడును.
AIR MARSHAL AGENTS
AIR MARSHAL AGENTS (WAPM)
Gandhi Nagar Delhi-31.

# కోడలు పిల్ల

✸ పరీక్షలు రాసి పట్నం నుంచి తండ్రిని కలుసుకోవాలని ఎంతో ఉత్సాహంతో బయలుదేరి వచ్చిన సుమతికి — ఆత్మహత్య చేసుకున్న తండ్రి మృత శరీరం కనిపించింది ఇంట్లో. అక్కడ ఆమె తండ్రి రాసి పెట్టివున్న ఉత్తరం ఆధారంగా — అది ఆత్మహత్య కాదని, హత్య అని తెలుసుకోగలిగింది సుమతి.

తన తండ్రి హత్యకు కారకుడైన వ్యక్తి మీద పగతీర్చుకుంటానని శపథం చేసింది సుమతి. హంతకుడు అసాధారణమైన వ్యక్తి. పెద్దమనిషిగా, ఊరికి ఉపకారిగా, ధర్మాత్ముడుగా చలామణీ అవుతూ — కుట్రలతోను కుయుక్తులతోను తన స్వార్థం కోసం ఎంతో మంది జీవితాలను బలిగొన్న పరమ కిరాతకుడు.

తన శపథం నెరవేరాలంటే ఆ ఊళ్లో ఉండటం మంచిది కాదని తెలిసి వేరే ఊరికి వెళ్లింది సుమతి. అక్కడ ఆమె ఒంటరిదని తెలిసి అడ్డగించిన గూండాల నుంచి రక్షించిన వ్యక్తి కథ తెలుసుకున్నది. అతని తండ్రిని చంపినవాడు, తన తండ్రిని చంపినవాడు ఒకడేనని ఆ యువకుని తల్లి మూలంగా తెలుసుకోగలిగింది. చక్కని ప్లానువేసి, ఆ యువకునికి పెళ్ళి కాకుండానే భార్య అయింది.

తన బద్ధశత్రువుకు 'కోడలు పిల్ల' అయి, అతనింట్లోనే తిష్ట వేసింది. అక్కణ్ణించి తన ప్రయత్నాలను సుమతి ఎలా సఫలం చేసుకోగలిగింది అన్న అంశాలను దర్శకుడు శ్రీ ఎం. మల్లికార్జునరావు ఎంతో ఆసక్తిదాయకంగా చిత్రీకరించారు.

సుమతిగా కె. ఆర్. విజయ, ఆమెకు తోడ్పడి, వలచి వలపించుకున్న యువకునిగా కృష్ణ, నాగభూషణం — శశిభూషణంగా రెండు పాత్రలను నాగభూషణం పోషించారు. అంజలీదేవి, పండరీబాయి, రాజబాబు, అల్లురామలింగయ్య, పెరుమాళ్ళు, లీలారాణి, గోకిన రామారావు ఇతర ముఖ్య పాత్రలు ధరించారు.

బాలమురుగన్ రాసిన యీ చిత్ర కథకు రాజశ్రీ సంభాషణల రచయిత. జి. కె. వెంకటేష్ సంగీత దర్శకుడు. ప్రకాష్ ఛాయాగ్రహణ దర్శకుడు. నారాయణన్ చెట్టియార్ నిర్మాత. ఎస్. ఎస్. ప్రకాశం ఎడిటర్.

లక్ష్మీ ఫిలింస్ ద్వారా యీ చిత్రం ఆంధ్రప్రదేశ్ అంతటా జూన్ 29న విడుదలయి విజయవంతంగా ప్రదర్శింపబడుతున్నది.

— మోహన్ కుమార్ ●



'కోడలు పిల్ల'లో కె. ఆర్. విజయ, కృష్ణ.

# సినిమా

## మేనకోడలు

✸ రవిశంకర్ పిక్చర్స్ నిర్మించిన చిత్రం యిది. ఫిలించేంబర్‌లో చూపించారు. నేను మాదిరెడ్డి సులోచన విరచితమైన 'శిక్ష' నవల చదివాను. సినిమాలో చాలా మార్పులు చేశారు. మొత్తం మీద కథను బాగా నడిపించారు. పాత్రలన్నింటికీ సమాన గౌరవం యివ్వాలనుకున్నారేమో, నటీనటు లందరికీ ప్రాధాన్యత కనిపించింది.

'మేనకోడలు'గా జమున నటించడం చిత్రానికి పెద్ద యస్సెట్. ప్రేక్షకుల సానుభూతి నందుకునే విధంగా, పాత్రలో లీనమై జమున నటించింది. పైగా యిరవై యేండ్ల ప్రాయంలోవున్న వనిత అనిపించింది. తర్వాత బాగా చేసినవాళ్ళు గుమ్మడి, సూర్యకాంతం. హీరోకు పని తక్కువే అనిపించినా, అద్యంతం కనిపించి, చక్కగా నటించాడు కృష్ణ. ఇతర భూమికలను రాజబాబు, రేణుక, కె. వి. చలం, సత్యనారాయణ సమర్థవంతంగా నిర్వహించారు.

## దాసరి మాటలు

స్త్రీలను ఆకర్షించే కథ యిది. కన్నీరు కార్పించే ఘట్టాలున్న చిత్రం యిది. (దాసరి) డైలాగు వేల్యూవున్న చిత్రం యిది. ఘంటసాల మాస్టారుగారి సూరవ చిత్రం యిది. ఈ చిత్రానికి రామ్‌బాబు[?] ఛాయ బాగా సహకరించింది. కథను సూటిగా, చక్కగా చెప్పుకుపోయాడు, దర్శకుడు బి. ఎస్. నారాయణ. అలీల్ ఫిలిమ్స్ ద్వారా జులై 7న, 27 కేంద్రాల్లో విడుదలైంది. [illegible] చిత్రం 'మేనకోడలు.'

## ఆత్రేయ పాట...
## అక్కినేని ఆట...

పద్మశ్రీ పిక్చర్స్ [illegible] నిర్మిస్తున్న చిత్రానికి 'ప్రేమకానుక' అని

పేరు పెట్టారు. ఈ చిత్రానికిగాను ఆచార్య ఆత్రేయ వ్రాసిన 'నీకేం తెలుసు ... నిమ్మ కాయ పులుసు' పాటను, ఘంటసాల— సుశీల మహదేవన్ ఆధ్వర్యంలో పాడారు.

పై పాటను హీరో నాగేశ్వరరావు— లక్ష్మిలపై జూలై 2, 3 తేదీల్లో మద్రాసుకు 15 మైళ్ళ దూరంలోగల పూందమల్లి శ్రీనివాసా ఫారమ్‌లో, దర్శకులు పుల్లయ్య చిత్రీకరించారు. ఈ చిత్రానికి కె. ఎస్. ప్రసాద్ ఛాయాగ్రహణ దర్శకుడు.

## ఇన్ డోర్...

జూలై 4 నుండి 10 వరకు సారథీ స్టూడియోలో యిన్‌డోర్ జరుగుతుంది, అన్నారు పుల్లయ్య. ఈ రంగుల చిత్రానికి వి. వెంకటేశ్వర్లు నిర్మాత.

'ప్రేమకోసం' చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచయిత ముఖ్య పాత్రలను నాగేశ్వరరావు, ఎస్వీరంగారావు, గుమ్మడి, రాజబాబు, సత్యనారాయణ, వాణిశ్రీ, లక్ష్మి, శాంతకుమారి, రమాప్రభ, నిర్మల పోషిస్తున్నారు. జగ్గయ్య, సూర్యకాంతం గెస్టుగా కనిపిస్తారు. శ్రీ ఫిలింస్ విడుదల.

ఊటీ, కొడైకెనాల్, వైగై డామ్ పరిసరాల్లో జరిపిన పాటల చిత్రీకరణ చాలా బాగా వచ్చిందని రషస్ చూసిన వాళ్ళు చెపుతున్నారు. పాటలన్నీ మృదు మధురంగా వున్నాయని అంటున్నారు.

## దేశంకోసం

మంచి కథలను తీసే ఉత్సు, భారీ ఖర్చుతో నిర్మించే యింటరెస్టు వున్న నిర్మాతగా రామానాయుడును పేర్కొన వచ్చు. ప్రస్తుతం సురేష్ మూవీస్ తరపున 'జీవన తరంగాలు' నిర్మాణం జరుపుతున్నారు' (శోభన్—వాణిశ్రీలతో)

## ప్రభుత్వ అనుమతి

1973 జనవరిలో 'దేశంకోసం' అనేడి సంచలనాత్మక చిత్రాన్ని నిర్మించబోతున్నారు. కాశ్మీరులో సగానికి పైగా షూటింగు చెయ్యాలని నిర్మాత చెప్పారు. భారత ప్రభుత్వం అనుమతిని (కొన్ని సన్ని వేశాల చిత్రీకరణకు) కోరడానికై, సెప్టెంబరులో న్యూఢిల్లీ వెళ్ళనున్నట్టు రామానాయుడు నుడివారు. కథానాయకుడు అక్కినేని నాగేశ్వరరావు. మరొక నాయకుడి పాత్రను శోభన్ ధరించవచ్చు. నాయికగా వాణిశ్రీ నటిస్తుంది. రచన ఆచార్య ఆత్రేయ. ఈ చిత్రం ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిత మవుతుంది. 'ప్రేమనగర్' కన్నా మిన్నగా నిర్మించాలన్నారు. రామానాయుడు. ఆత్మ విశ్వాసం, వృత్తిలో ధైర్యం, ప్రజలపై నమ్మకం వున్న వ్యక్తిగా రామానాయుడ్ని చెప్పవచ్చు.

## పుట్టినరోజు పాట

ప్రతాప్ ఆర్ట్స్ ప్రొడక్షన్స్ 'తాత—మనవడు' చిత్రాన్ని ఆగస్టులో ప్రారంభిస్తారని పాఠకులకు తెలిపాము. ఆ చిత్రం యొక్క మొదటిపాటను జెమినీలో విన్నాను. నారాయణరెడ్డి వ్రాయగా రమేష్‌నాయుడు స్వరకల్పనలో, సుశీల అద్భుతంగా పాడింది.

'ఈనాడే బాబూనీ పుట్టినరోజు. ఈ యింటికే కొత్త వెలుగు వచ్చినరోజు.'

ఇది పల్లవి మాత్రమే. చరణాలు మరీ బాగున్నాయి, ఈ చిత్రానికి దాసరి, నారాయణరావు కథ, మాటలు, సినిమా అనుకరణను చేపట్టడంతో బాటు దర్శకుడు అయ్యారు.

## రాజబాబు విజయనిర్మల

తాత, మనవడిగా ఎస్వీ రంగారావు

---

# మంచి రచయిత–మంచిమనిషి శ్రీ శంభుప్రసాద్‌గారికి సినీ ప్రముఖుల శ్రద్ధాంజలి



మంచి రచయితను, ఒక మంచి మనిషిని, మంచి మిత్రుడ్ని (స్వర్గీయ శంభూప్రసాద్‌గారు) కోల్పోయినందుకు విచారిస్తున్నా

ఒకప్పుడు 'కృష్ణదేవరాయలు' సినిమా నిర్మించమని సలహా యిచ్చారు. నాకు నిర్మించాలన్న ఆశ వున్నా, తీయడం కష్టమని చెప్పాను. 'అయ్ లవ్ యూ' అని నా ధైర్యాన్ని మెచ్చుకున్నారు; అలాంటి నా శ్రేయోభిలాషి, కన్ను మూశారంటే నమ్మలేక పోతున్నాను, అన్నారు దర్శకుడు సి. పుల్లయ్య.

* * *

'నాకు శంభూప్రసాద్‌గారితో యిరవైయేండ్ల పరిచయం వుంది. అడయారులో నివసించినప్పుడు, తరచుగా ఆయన్ని కలసి మాటాడేవాడిని. నిండుకుండ ఆయన. వారి సాహితీ సేవ అనన్యమైనది. నేను అమెరికా వెళ్ళినప్పుడు, వారి ఆశీస్సులను తీసుకున్నాను.

గత ముప్పది సంవత్సరాలుగా, వారు పడిన బాధ, అంతా, యింతా కాదు. శస్త్ర చికిత్స లండన్‌లో చేయించుకున్నారు. అయినా ఆయన బాధ తగ్గలేదు. మనం ఒక మంచి వ్యక్తిని దూరం చేసుకున్నాము,' అన్నారు అక్కినేని నాగేశ్వరరావు.

# భూమినుండి బంగారమా!



# అవును! మనము సుఫల 15:15:15 వాడితే సాధించవచ్చు



అధిక దిగుబడికి, మిశ్రమ ఎరువుల రూపములో ఎక్కువ పోషక పదార్థములను పైరులకు అందించవలసిన అవసరం ఎంతైనా వుంది. మీ భూసారమును పెంచుటకు తద్వారా మీకు ఆర్థిక విజయమును చేకూర్చుటకు ఎక్కువ పోషకపదార్థములను కలిగియున్న 'సుఫల' మిశ్రమ రసాయనపు టెరువులను వాడండి.

పలురకములైన పైరులకు, మేలైన ఎరువు 'సుఫల' 15:15:15 అధిక దిగుబడి రకములకు. వరి, మొక్కజొన్న, జొన్న, వేరుశనగ, పసుపు, మిరప, ప్రత్తి, చెరకు, అరటి మొదలగు పంటలకు వాడవలసిన ఎరువు 'సుఫల' 15 : 15 : 15.

**మీ భూమినుండి బంగారం పండించటం కొరకు 'సుఫల' 15 : 15 : 15 వాడండి**

గుంటూరుజిల్లా, మంగళగిరిలోనున్న మా భూసార పరిశీలనా కేంద్రము నుండి 'ఉచిత' భూసార పరిశీలనా సేవ పొందండి. "మీ నేలనెరిగి సాగుచేయండి."



ఇతర వివరములకు వ్రాయండి.

**ది ఫెర్టిలైజర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లి.**

(ట్రాంబే యూనిట్)

(కేంద్రప్రభుత్వ యాజమాన్య సంస్థ)

5-10-173 ఫతేమైదాన్ రోడ్,

హైదరాబాద్-4.






'మా యింటి వెలుగు' లో హాలం, కృష్ణ.

## సినిమా

## పాపం పసివాడు

ఆ విమానానికి పైలట్ ఎవరో తెలుసా? ప్రముఖ హాస్యనటుడు నాగేష్. ఎడారిలో ఒంటరివాడుగా మిగిలిన ఆ పసిబాలుడు ఎలా న్యగ్రహానికివచ్చాడు? అక్కడ అతగాడు పడ్డ అవస్థలేమిటి? అనేది సందేహాల నివృత్తి కావాలంటే శ్రీ లక్ష్మీ ప్రొడక్షన్స్ వారి రంగుల చిత్రం 'పాపం పసివాడు' చూడవలసిందే.

పై చిత్రానికి గొల్లపూడి రచయిత, సత్యం సంగీతాన్ని, కన్నప్ప ఛాయను, ఎస్. కృష్ణారావు కళను నిర్వహించారు. వి. పూర్ణచంద్రరావు నిర్వహణలో నిర్మించబడిన యీ చిత్రం తెలుగుతెరకి ఒక వెరైటీ. తెలుగు ప్రజకి ఒక నావల్టీ. వి. శేషగిరిరావు నిర్మించిన యీ చిత్రం లక్ష్మీఫిలింస్ ద్వారా విడుదలవుతుంది.

## ప్రజానాయకుడు

శశి ఆర్ట్స్ నిర్మించిన 'ప్రజానాయకుడు' చిత్రం తెలుగు చిత్రరంగానికి సరికొత్త ప్రయోగం అని తెలుస్తోంది. క్యారెక్టర్ నటుడు నాగభూషణం నటన మరపురానివిధంగా వుందని చెప్తున్నారు. ఇలాంటి కథలను ప్రేక్షకులకు నచ్చేవిధంగా చిత్రీకరించే విధానం దర్శకుడు వి. మధుసూదనరావుకు బాగా తెలుసు. ఈ కథకి బొల్లిముంత కలం ప్రాణం పోసింది. ఛాయను ఎస్.ఆర్. స్వామి, సంగీతాన్ని మహదేవన్ నిర్వహించారు గనుక అవి ఎటూ బాగుంటాయి.

'ప్రజానాయకుడు' నాయకి, నాయకుడు అయిన షావుకారు జానకి, జగ్గయ్యా పోటీపడి నటించారు. రిక్షాతోలి బ్రతికే కష్టజీవిగా కృష్ణ అమోఘమైన నటన

నటి జయలలిత

(చిత్రకారుడు: కొండూరు నాగేశ్వరరావు)

'అఖండ దంపతులు'లో జమున.

దర్శించారు. హాస్యం సన్నివేశంగా వుండేట్టు పిజబాబు, రమాప్రభ నటించారు. ఈ చిత్రంద్వారా జయ అనే కొత్త నటిని నాగభూషణం పరిచయం చేస్తున్నారు. చంద్రమోహన్‌కి సరైన జోడీగా వుంటుంది. ఒక ముఖ్యపాత్రను నిర్మల ధరించింది.

పత్రికలలో యీచిత్రంగూర్చి గొప్పగా వ్రాస్తున్నారు. కె. బసవయ్య నిర్మాణ పర్యవేక్షణలో సి.రాఘవరావు (నాగభూషణం కుమారుడు) నిర్మించిన యీ చిత్రం ఆగస్టు 4న నవయుగ ద్వారా విడుదల అవుతుంది.

## డి.వి.ఎస్. లో జ్యోతిలక్ష్మి!

డి. వి. ఎస్. నిర్మిస్తున్న 'అబ్బాయి గారు—అమ్మాయిగారు' షూటింగు దాదాపు పూర్తయింది. చిత్రం రషెస్ చూసిన తర్వాత మరొక్కపాట వుంటే బాగుంటుంది అనిపించింది, నిర్మాత డి. వి. నారాయణకు. పాట పెట్టదగిన సన్నివేశం కూడా వుందట. అందుకే సెక్స్ క్వీన్ జ్యోతిలక్ష్మిని [illegible] రికించారు. ఆమెకు ఒక ఆట. పాట పెట్టారు. ఆ పాటను నారాయణరెడ్డి వ్రాశారు. మహాదేవన్ సారథ్యంలో ఎల్. ఆర్. ఈశ్వరి పాడింది.

'ఊగకరోయ్ మామా. వూగకరోయ్
వూగుతూ తూగుతూ, పట్టొట్టు
లాగకరోయ్'

ఈ పాటను జ్యోతిలక్ష్మి, [illegible] నారాయణ మధ్య చిత్రీకరిస్తుంటాం, అన్నారు డి. వి. ఎస్.

టైటిలు చాలా బాగుంది అంటూ ప్రేక్షకులు ఉత్తరాలు వ్రాస్తున్నారు. కథకు అనువైన టైటిలు అని సినిమా చూసిన తర్వాత, మీరంతా ఒప్పుకుంటారు.

'అబ్బాయిగారు—అమ్మాయిగారు' కథను ముళ్ళపూడి వ్రాశారు. మాటలను మద్దిపట్ల సూరి సమకూర్చారు. సంగీతాన్ని మామా (మహాదేవన్) ఛాయను వి. ఎస్. ఆర్. కృష్ణారావు నిర్వహిస్తున్నారు. చిత్రంలో కనిపించే దృశ్యనాటికలను, వెరువు అంజనేయశాస్త్రి రచించారు. అబ్బాయిగారు పాత్రను కృష్ణ, అమ్మాయి గారు భూమికను వాణిశ్రీ పోషిస్తున్నారు. ఓచోట్ల అమ్మాయిగా గీతాంజలి నవీ కొత్త పాత్రలో కనిపిస్తుంది. ఈ చిత్రా

నికి వి. రామచంద్రరావు దర్శకుడు. శ్రీ పిలింస్ విడుదల.

## వింత దంపతులుగా జమున—కృష్ణంరాజు

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తున్న వింత దంపతులుగా జమున, కృష్ణం

'వింత దంపతులు' షూటింగు పూర్తయింది. ప్రస్తుతం ఎడిటింగు బల్లపై వుంది. త్వరలోనే రీ—రికార్డింగు జరుపుకుని, మీ ముందు వుంటుంది.

ఈ చిత్రానికి భమిడిపాటి రచయిత.


**FREE! ఉచితం!**

**వ్యాధి నివారణ — పాపక్షమాపణ**

"విశ్వాస సహితమైన ప్రార్థన ఆ రోగిని స్వస్థపరచును. ప్రభువు అతని లేపును. అతడు పాపములు చేసినవాడైతే పాప క్షమాపణ నొందును. మీ పాపములను ఒకనితో నొకడు ఒప్పుకొనుడి. మీరు స్వస్థత పొందునట్లు ఒకరికొరకు ఒకడు ప్రార్థన చేయుడి. నీతిమంతుని విజ్ఞాపన మనఃపూర్వకమైనదై బహుబలముగలదై యుండును". యాకోబు—5:15—16.

స్వస్థపరచబడుట, పాప క్షమాపణ, విజ్ఞాపన వీనినిగూర్చి విరివిగా తెలిసికొనగోరినను, బైబిల్ పరిశోధనపై చక్కని సర్టిఫికేట్ పొందవలెనని కోరినను, విలువైన పుస్తకములను పొందగోరినను మాకు వ్రాయండి. పోస్టు ఖర్చులు మావే. **ఎస్. జాన్ డేవిడ్, నిరీక్షణ, పోస్టు బాక్సు—12,** చిలకలూరిపేట, గుంటూరు జిల్లా. A.M.G.



నాగరిక జీవితమునకు తప్పక అవసరమైనది




**బాన్‌సాకా సువాసన బిళ్ళ**

★ దుర్గంధమును పారద్రోలును సుగంధమును విరజిమ్మును

★ మిడతలుమొదలైన క్రిములను నిర్మూలించును

తయారుచేయువారు: మిల్లన్‌కెమిప్లాస్ కార్పొరేషన్ [illegible]

### గమనిక

ఉత్తరాల శీర్షికకి రాసేవారు ఈ క్రింది నియమాలు పాటించాలని మనవి: 1. ఉత్తరాలు వీలయినంత చిన్నవిగా ఉండాలి 2. రాసేవారి పూర్తి పేరు, చిరునామా ఇవ్వాలి 3. ఇంగ్లీషు లిపిలో అక్షరాలు రాయరాదు 4. కాగితానికి ఒకవయిపునవే రాయాలి, 5. సిరాతోనే రాయాలి. —సం॥


## సిద్దాస్ తత్వశోధిన్

**వెల రు. 12—00**

ఇంగ్లీషు వైద్యమునకు కుదరని స్త్రీల బహిష్టునొప్పులు, హిస్టీరియా, తెల్లబట్ట, ఎర్రబట్ట, ఫిట్సు, ఋతు కాలక్రమము తప్పుట, యివిగాక సర్వ గర్భాశయ వ్యాధులను 4 మోతాదులు వాడునప్పటికే అమోఘమైన గుణమునిచ్చి, త్వరలో సంపూర్ణ ఆరోగ్యము అనేకమంది స్త్రీలు పొందినారని తెలియ జేయుటకు సంతసించుచున్నాము.

**సంతానము లేనివారికి సంతానము కలిగించి జీవితములో ఆశాజ్యోతిని వెలిగించు దివ్య ఔషధము.** పోస్టల్ చార్జీల నిమిత్తం రు. 3—00 అదనముగా పంపిన మందు వి.పి. ద్వారాకూడా పంపబడును.

**సిద్ధ ఆయుర్వేద ఫార్మసీ**
(రిజిష్టర్డు)
H.O. పి. సీవరం, వందలపాకపోస్టు (తూ.గో)
బ్రాంచి : తణుకు. (A. P.)



**Johny**
3 బ్యాండ్ ఆల్ వరల్డ్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్ ధర రు.165/—నెలకు రు.5/—వంతున చెల్లించి ప్రతి గ్రామమునకు మరియు పట్టణమునకు పంప వచ్చును. ఇంగ్లీషులో మాత్రమే వ్రాయండి.

**(80) TAJ AGENCY**
POST BOX No. 2818, NEW DELHI-5.




'పాపం పసివాడు' లో దేవిక, ఎస్వీ రంగారావు, నాగేష్, మాస్టర్ రాము.

## సినిమా

రాజా నటించారు. ముఖ్యనటుడు నాగభూషణం. ఆయన భార్యగా కృష్ణకుమారి నటించింది. మరొకజంటగా చంద్రమోహన్, జయ కనిపిస్తారు.

స్త్రీ యొక్క సౌశీల్యతను, సహనాన్ని, వ్యగ్రతను, పౌరుషాన్ని ప్రతిబింబింపచేసే చక్కటి కుటుంబ యితివృత్తం గొన్న చిత్రమే 'ఎంత దంపతులు'. దర్శకుడు కె. హేమాంబరధరరావుకు పేరుతో బాటు కనకాన్ని తెచ్చిపెట్టే చిత్రం యిది. సాంకేతికవర్గం: శేఖర్, సింగ్ (ఫొటో) కోదండపాణి (సంగీతం) మహేంద్ర (ప్రొడక్షన్) గోపాలం (కూర్పు) బి. ఎస్. కృష్ణ (కళ). విడుదల: పూర్ణా

— శ్రీనివాస్



'అబ్బాయిగారు — అమ్మాయిగారు!' లో కృష్ణ, పుష్పకుమారి, వాణిశ్రీ

# పుస్తకాలు

## నాలుగు నాటికల సంపుటాలు

1. **ఘోష:**— రచన: శ్రీ భీశెట్టి లక్ష్మణ రావ్. క్రౌన్ ఆక్టేవో. 119 పేజీలు. రూ. 2.75. ప్రచురణ: స్టూడెంట్స్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

2. **అంతరాలు — శిథిలాలయం:**— శ్రీ చింతపల్లి హనుమంతరావు. 66 పేజీలు, రూ. 2. ప్రచురణ: జయశ్రీ పబ్లికేషన్స్, కొత్తపేట, విజయవాడ—1.

3. **ఆశయం-నమ్మిన బంటు:**—శ్రీ కిలపర్తి అప్పారావు రచన. 192 పేజీలు. వెల: రూ. 2. ప్రతులకు: నాగజ్యోతి ప్రచురణలు, 3, అప్పర స్వామి కోవెల వీధి, మదరాసు—19.

4. **కౌరవపాండవీయం:**— రచన: శ్రీ జి. నారాయణరావు (కావ్యశ్రీ). 132 పేజీలు. రూ: 3. ప్రచురణ: ది చిల్డ్రన్స్ బుక్ హవుస్, మెయిన్ రోడ్, గుంటూరు—3.

1. 'నిన్ను చంపటం అదేం పెద్ద పని కాదు. చంపటం, చంపించటం నా కనుసైగలో జరిగి పోతుంటుంది. నేను తలచుకుంటే క్షణాలమీద శాల్తీలకు శాల్తీలే గల్లంతై పోతాయి, జాగర్త!'— ఇది రాజకీయ నాయకుడు నరహరి నిజరూపం. పార్వతీశం, జగన్నాథం అతనికి కుడి— ఎడమ భుజాలు. ఫలితం? ఒక హత్య, ఒక మానభంగం, ఒక కుటుంబం సర్వనాశనం.

సంఘంలో ఇలాటి నరరూప రాక్షసులున్నారని ఎత్తి చూపుతుంది దృశ్య రూపకం. అయితే— ఇటువంటి కుళ్ళు పోవడం ఎలా? ఆ రాక్షసుల్ని శిక్షించడం ఎలా? అమాయక సంఘాన్ని రక్షించడం ఎలా?— ఈ ప్రశ్నలకు సమాధానం ప్రేక్షకులే నిర్ణయించాలి.

2. లేమి, నాటక కళారాధన—కారణంగా భార్యను అనుమానించి అఘాయిత్యం చేసిన ఒక రచయిత జీవితంలోని అంతరాంతరాలు మొదటిది.

మానవసేవా, మాధవసేవా? వరద ప్రమాదం నుండి గ్రామాన్ని కాపాడటమా, శిథిలాలయాన్ని పునర్నిర్మించటమా? ఏది ముఖ్యం? దీనికి సమాధానమే 'శిథిలాలయం' నాటిక.



- హేట్సాఫ్ టు కృష్ణ
—యస్. వి. రంగారావు
- సెన్సారువాళ్ళకి నచ్చిన చిత్రం!
- దక్షిణాది చిత్రాలే నయం!
—జి. కామరాజ్

'ఈ చిత్ర కథలో ఒక కొత్తదనం ఉంది. నా పాత్రలో ఒక వెరైటీ ఉంది. ఇటీవల నేను నటించిన చిత్రాలన్నిటి కన్న ఈ చిత్రంలో నేను పోషించిన పాత్ర నాకెంతో నచ్చింది.' అన్నారు ప్రముఖనటుడు శ్రీ ఎస్. వి. రంగారావు— 'పండంటి కాపురం'లోని తన కారెక్టరు గురించి యిటీవల పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ.

ఈ పత్రికా ప్రతినిధుల గోష్ఠిని జయప్రద పిక్చర్స్ వారు వాహినీ స్టూడియోలోని లాన్స్‌లో ఏర్పాటు చేశారు.

'ఈ చిత్రం షూటింగ్ ఆరంభించిన నాటి నుంచి 90 రోజుల్లో యింతమంది అగ్రశ్రేణి నటీనటులతో పూర్తి చేయ గలగటం చెప్పుకోదగిన సంగతి. హేట్సాఫ్ టు కృష్ణ!.. ఎవరికీ ఏ లోపం జరుగకుండా చూసి, చక్కని యూనిట్‌ని కలిగి వున్న నటుడు 'కృష్ణ' నిర్వహణాసామర్థ్యాన్ని అభినందిస్తున్నాను' అన్నారు మళ్ళీ యస్. వి. రంగారావు.

ఈ గోష్ఠిలో ఆయనతో పాటు కృష్ణ, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, అల్లురామలింగయ్య, దేవిక కూడా పాల్గొన్నారు. కృష్ణ సమర్పిస్తున్న యీ 'పండంటి కాపురం' చిత్రానికి ఆయన తమ్ముడు శ్రీ జి. హనుమంతరావు నిర్మాత.

చిత్రం పూర్తి చేసింది 90 రోజుల్లోనే అయినా, ఖచ్చితంగా షూటింగ్ జరిగింది 45 రోజులే! జమున, సరోజాదేవి, విజయ నిర్మల, దేవిక, యస్. వి. రంగారావు, లాంటి అగ్రశ్రేణి నటీనటులతో ఒక చిత్రాన్ని యింత తొందరగా పూర్తి చేయగలగటం నిజంగా కృష్ణ నిర్వహణ దక్షతను తెలువుతుంది!

*　　*　　*

సెన్సారు వాళ్ళకి నచ్చిన చిత్రం ఒకటి. యీమధ్య సెన్సారు అయింది. అయితే, సెన్సారు వాళ్ళకి నచ్చింది గనుక, ఆచిత్రంలో, కట్స్ ఉండవనుకుంటే— అది పొరపాటే అవుతుంది.

'సినిమా పరిశ్రమ ఆరంభమయినాక, యింత చక్కని చిత్రాన్ని మేము చూడలేదు', అన్నారట సెన్సారువారు ప్రజానాయకుడు చిత్రం చూసి.

ఈ విషయాన్ని ప్రసిద్ధ నటుడు శ్రీ నాగభూషణం కిందటివారం వాహినీలో రాజేష్ మూవీస్ వారి షూటింగ్ విరామ సమయంలో వెల్లడించారు నాతో.

'ప్రజా నాయకుడు' చిత్రాన్ని నాగభూషణం సమర్పిస్తున్నారు. ఆయన కుమారుడు శ్రీ సి. హెచ్. రాఘవరావు నిర్మాత.

తమకు నచ్చిన చిత్రాలకు కూడా సెన్సారు వారు కట్స్ వేయటం గమనార్హం!

*　　*　　*

పూర్ణా పిక్చర్స్ అధినేత శ్రీ జి. కామరాజు యిటీవల తాష్కెంట్‌లో జరిగిన రెండవ ఆఫ్రో ఏషియన్ ఫిలిమ్ ఫెస్టివల్‌కి వెళ్ళి తిరిగివచ్చిన సందర్భంగా మద్రాసులోని న్యూ ఉడ్‌లాండ్స్ హోటల్‌లో జయప్రద పిక్చర్స్‌వారు టీపార్టీ ఏర్పాటు చేశారు.

శ్రీ కామరాజు అక్కడి విశేషాలను వివరిస్తూ— దక్షిణభారత దేశంలో తయారయ్యే చిత్రాలలో మౌలికత ఉండటం లేదనీ, అందువల్ల ఆ చిత్రాలు ఇటువంటి ఉత్సవాలకు అర్హతను కలిగి ఉండవని ఒక ఉత్తరాది ప్రముఖుడు అప్పట్లు చెప్పారు. దాని మీద శ్రీ కామరాజు వ్యాఖ్యానిస్తూ ఉత్తరాది చిత్రాల కంటే దక్షిణాదిన నిర్మించబడే చిత్రాలు ఎన్నో రెట్లు నయం! ఇటువంటి చిత్రాలు యీ చలన చిత్రోత్సవానికి రాకపోవటం శోచనీయం! అన్నారు.

త్వరలో రూపొందబోతున్న ఫిలిం కౌన్సిల్‌లో ఆంధ్రప్రదేశ్ చలనచిత్ర వాణిజ్య సంఘానికి సరియయిన స్థానం లభించాలన్న, అంశం మీద కూడా చర్చించారు శ్రీ కామరాజ్.

—మోహన్ కుమార్



"మాయింటి వెలుగు"లో కృష్ణ, వెన్నిరాడై నిర్మల

